# చతుర

జనవరి 1980

సంపుటి-2 సంచిక-12

NR

ఆరంభ యౌవనంలో అడుగిడిన అతను తొలిచూపుల ఆకర్షణలనే 'ప్రేమ' అని భ్రమ పడ్డాడు. కాలక్రమంలో ఆ భ్రమనే 'ప్రేమ'గా మార్చుకోగలిగాడుకూడా. అయినా అనేకానేక కారణాల వల్ల ఆ యౌవన జీవితంలో తనకు ఎదురై తనను ఆశించిన అందరికీ దూరమయ్యాడు. మరి సాంఘికంగా ఎదిగి పెద్దవాడైన తర్వాతకూడా ఆ అనుభవాలతో అతివలపట్ల తన అలవాట్లను ఎందువల్ల మార్చుకో లేకపోయాడు? అతని జీవితంలో జరిగిన వన్నీ కేవలం—

# ప్రేమ మజిలీలు

మాత్రమేనా ? ప్రేమకు నిజంగా మజిలీలుంటాయా ?

సి.యస్. రావు

తాజా నవల ప్రేమ మజిలీలు 'ఈ నెల చతుర సమగ్ర నవల'

# చతుర

ఈనాడు కాంపౌండ్ సోమాజిగూడ,
హైదరాబాద్-500 004

కవర్ పేజీ : బెంగాలీ గ్రామీణ యువతి
ఫొటో : దిలీప్ బెనర్జీ
2వ కవరు : కలంకారీ చిత్రం
ఫొటో : గీతాదత్త
3వ కవరు : బిజాపూర్
ఫొటో : డాక్టర్ ఎస్. హరినారాయణ్

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని వివిధ కోణాలనుండి ప్రతిబింబించగల సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి.

* ఈ పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసిపంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి. ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100-112 పేజీల పాకెట్ సైజు నవలాను బంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత వరకూ కుదించవలసివచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతోసహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పిపంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పని సరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే ప్రతి నవలకూ పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 004

# ఏది విషం - ఏది అమృతం?

‘‘ఇదుగో! ఈ ఒక చిన్న సీసాలోని నాలుగు చుక్కలతో మన ప్రేమ జీవితానికి ఉన్న అడ్డంకులన్నీ తొలగి పోతాయి’’ అని ప్రోత్సహించాడతను. అతను స్వయంగా డాక్టరు గనుక అతని మందుకు తిరుగులేదు. కానీ, ఆ మందు బెడిసికొట్టి ఆ అందాలరాశి జీవితాన్నే ఎలా అంతం చేసింది? ‘విపుల’ జనవరి సంచికలో ప్రచురిస్తున్న సుప్రసిద్ధ ఉర్దూ రచయిత్రి అతియా పర్వీన్ కథ ‘త్యాగం’లో చదవండి.

ఈ కథతో పాటు మిమ్మల్నాకట్టుకునే మరెన్నో కథలు తెలుగు, తమిళ, కన్నడ, బెంగాలీ, మరాఠీ వంటి అనేక సంపన్న భాషలనుండి సేకరించి అందజేస్తోంది విపుల. కథలతో పాటు కార్టూన్లు, జోకులు, విచిత్ర విశ్వవిజ్ఞానం అడుగడుగునా మిమ్మల్నలరిస్తాయి. ప్రతి కథకూ రెండు రంగుల భావస్ఫోరకమైన చిత్రాలు మరో ప్రత్యేకాకర్షణ.





Marketed By
Margadarsi
Marketing
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad-500 004

ప్రతినెలా ఒకటవ తేదీకి
వెలువడే విశ్వకథా విపంచి

**విపుల**

132 పేజీలు 125 పైసలే!

# ఫ్రీ ఎయిర్ కండిషన్

సౌరశక్తితో ఎయిర్ కండిషన్ చేసే పథకాన్ని రూపొందించింది తమిళనాడు విద్యుత్ బోర్డు ప్రణాళికా శాఖ. దీని కోసం పేరొక పదంతస్థుల భవంతి కడుతున్నారు. ముందుగా మొదటి రెండంతస్థులు సౌర శక్తితో ఎయిర్ కండిషన్ చేస్తారు. ఇందు కోసం 'సిర్ కోష్' అనే యంత్రాన్ని అమెరికా నుండి దిగుమతి చేసుకుంటు




న్నారు. 1980 జనవరి నుంచి ఈ పథకాన్ని అమల్లో పెడతారు. ఇలా చేయడం వల్ల ఎంతో విద్యుత్ ఆదా అవుతుందని తెలిసి ఎన్నో కంపెనీలు ముందుకు వస్తున్నాయిట.

వరుసగా మూడు రోజులు సూర్యుడు రాకపోయినా, వాతావరణం మబ్బు మబ్బుగా వున్నా పర్వాలేదు. కిటికీ తలుపులు తెరచి వుంచితే సరి అంటున్నారు వీరు. తమిళనాడుకి గరిష్ఠ పరిమితిలో విద్యుచ్ఛక్తి అవసరం వుంది. అందుకని సముద్రంలోంచి కూడా విద్యుత్‌ను తీసే ప్రయత్నాలు చేస్తున్నారు. తమిళనాడులో వున్న సముద్రపు నీరు ఉపయోగించుకుని సాగర విద్యుత్ ఉత్పాదక కేంద్రాన్నొకదాన్ని నెలకొల్పేందుకు అంతర్జాతీయ స్థాయిలో చర్చలు జరుగుతున్నాయి. జనరల్ ఎలక్ట్రిక్ కంపెనీవారు వాషింగ్టన్ దగ్గర ఈ పథకానికి చెందిన నమూనా నొకదాన్ని వుంచారు.

# భయంభయం

విలువైన పరికరాల పట్ల నిర్లక్ష్యంగా వుంటే జరిగే అనర్థాలు లెక్కలేనన్ని. మొన్నటికి మొన్న కలకత్తా ఆర్.జి.కార్ ఆస్పత్రిలో గర్భాశయంలో కేన్సరు వున్న ఒక రోగి నిమిత్తం వాడిన మూడు రేడియం సూదులు మాయమయ్యాయి. వాటికోసం డిస్చార్జి అయిన స్త్రీని మళ్ళీ రప్పించి ఆమె శరీరాన్ని పరిశీలించడమే గాక, ఆవిడ ఇంటి చుట్టు పక్కల 200 గజాల మేర తవ్వి చూశారుగానీ లాభం లేకపోయింది.

ఆఖరికి రేడియం డిటెక్టరు సహాయంతో ఆస్పత్రి బాత్రూం గొట్టంలో ఒక సూదిని కనుక్కొన్నారు. రెండవదాన్ని కూడా డిటెక్టరు సాయంతోనే చెత్తకుండీలో పట్టుకున్నారు. మూడవది మాత్రం ఇంకా దొరకలేదు. సూది కోసం ఇంత కంగారెందుకయ్యా! అంటే అవి పొరబాటున దేహంలో ప్రవేశిస్తే మరణమే శరణ్యం. పైగా వీటి ధర కూడా ఏం తక్కువ కాదు. ఒక్కొక్కటి సుమారు 30,000




రూపాయలు.

ఇది చాలదన్నట్లు ఆ మహానగరం లోనే జంతు ప్రదర్శనశాల నుంచి మూడు ప్రమాదకరమైన విషసర్పాలు మాయ మయ్యాయని అధికారులు తెలియజేశారు. వాటిని ఎవరైనా పట్టుకుపోయారో, లేక జూలోనే ఎక్కడైనా పొంచి వున్నాయో ఇంకా తెలీదు. మూడింట్లో ఒకటి పసుపు పచ్చని విషసర్పం, రెండోది నల్లని నీటిపాము, మూడోది 8 అడుగుల పొడుగున్న పెద్ద పాము. వీటిని బంధిం చిన బోన్లకి మూడు వైపులా అద్దాలు, ఒకవైపున సన్నని ఇనుప జాలీ తలుపు




అమర్చి వున్నాయి. ఇంతేగాక గోడకి పది అడుగుల ఎత్తున చుట్టూ ఇనుప జాలీ బిగించి తాళాలు కూడా వేశారు. ఇప్పుడా పాములతో బాటు తాళం కప్పలు కూడా కనబడ్డం లేదు.

గత నెల రోజులుగా రిక్రూట్ మెంట్ విషయంలో ఏదో తగాదా వచ్చి జూ సిబ్బంది సమ్మె చేశారు. కాపలాలేని పాములు ఎవరి పాల్పడ్డాయో! లేక స్వేచ్ఛగా మిగతా జంతువుల్ని చూసేం దుకు బయల్దేరాయో తెలీదు. ఆరేళ్ళ క్రిందట కూడా సరిగ్గా ఇలాగే రెండు పాములు మాయమైతే వెతికి పట్టుకున్నా రట.

ఈసారి పోయిన వాటిలో నీటిపాములు ఇటీవలి భారీ వర్షాల గంగలో కొట్టుకు పోయి వుండవచ్చనీ, మూడో సర్పం ఇక్కడే ఎక్కడో తిరుగుతుండాలని జూ డైరక్టరుగారి అభిప్రాయం.

రోజుకి పిల్లలతో సహా 3,000 మంది విజిటర్స్ తిరుగుతున్న ఆ జంతు ప్రదర్శన శాలలో పారిపోయిన పాముల కోసం వేట కొనసాగుతూనే వుంది.

# ఆవిరికార్లు

నీటి ఆవిరితో కారు నడవడం ఏమిటని ఆశ్చర్యపోకండి. కాదేదీ మనిషి కసాధ్యం అని అమెరికాలో 'స్టీం ఆటో మొబైల్'కు చెందిన జేమ్స్, మద్రాసుకు చెందిన మురుగమణిక్కం అనే ఓ ఇంజనీరు గారు నిరూపించారు.

పెట్రోలు కొరత కారణంగా ఆవిరితో నడిచే కారుని రూపొందించేందుకు ఇద్దరూ కష్టపడి ఆర్నెల్లలో దాని బ్లూ ప్రింటు తయారు చేశారు. ఫలితంగా నాలుగు పడకలు, ఒక వంటగది, అధునాతనమైన బాత్ రూం మొదలైన హంగుల్తో ఒక ఎయిర్ కండిషన్ ఆవిరికారు తయార యింది. ఇందులో వాడిన పరికరాలన్నీ మన దేశానివే.

వీటన్నింటితో బాటు నాలుగు వందల లీటర్ల ఘనపరిమాణం గల టాంకులు కూడా ఆ కారుకు అమర్చబడ్డాయి.

అందులో కొంత నీరు ఎయిర్ కండిషన్‌కు వినియోగిస్తారు. అపుడే ఈ కారు రోడ్డు మార్గం ద్వారా పయనం ప్రారంభించి అమెరికాకు చేరువౌతోంది. మధ్య మధ్యలో ఆపి సాంకేతికంగా అవసరమైన మార్పుల్ని చేస్తూ ముందుకి సాగిపోతున్నారు. హెట్సాఫ్‌టు హ్యూమన్ బ్రెయిన్.

# హిట్లర్ ఇల్లు

హిట్లరు ఆత్మహత్యా చేసుకుని 33 సంవత్సరాలయినా ప్రజలింకా అతని పట్ల ఉత్సుకత చూపిస్తూనే వున్నారు. పశ్చిమ జర్మనీలో హిట్లరు నివాసగృహమైన 'ఈగల్స్ నెస్ట్' ఇపుడు టూరిస్టులను విపరీతంగా ఆకర్షిస్తోంది. ఆ ఇంటిని దర్శించడానికి ప్రతిదినం వేలాది యాత్రికులు బారులు తీరి నిలబడుతున్నారు.

1934లో జైల్లో గడిపినపుడు తన ఆత్మకథ రాసుకున్నాడు హిట్లరు. జైలు నుంచి విడుదలయ్యాక బెర్చెస్ట్ గేడెన్ ప్రాంతంలో ఓ గది అద్దెకు తీసుకుని ఆత్మకథకు మేలు ప్రతి రాశాడు. ఆ ప్రాంతంలో హిట్లరును బాగా ఎరిగున్న జోసఫ్ఫెన్ ఇప్పటికీ బతికేవున్నాడు. 'అప్పట్లో హిట్లరు చాలా పెద్ద మనిషి తరహాగా వుండేవాడని' అంటాడు జోసఫ్.

పదవిలోకి వచ్చాక హిట్లర్ బెర్చెస్ట్ గేడెన్లోనే తన విశ్రాంతి మందిరాన్ని, ఇతర రాజగృహాలను నిర్మించాడు. హిట్లరు అనుచరులైన గోరింగ్, గోబెల్సులు అందమైన ఈగల్స్ నెస్ట్ పక్కనే తమ భవంతులు కట్టుకున్నారు. పోలీసులు, సైనికులు, కుక్కలతో పకడ్బందీగా గస్తీ ఏర్పాటు చేశారా ప్రాంతాల్లో. యుద్ధం మొదలైన తర్వాత మరింత జాగ్రత్తకోసం ఫిరంగులు కూడా తరలించబడ్డాయి. యుద్ధసమయంలో ఆంగ్లోఅమెరికను విమానాలు ఇక్కడ కట్టడాల మీద బాంబులు ప్రయోగించటం వల్ల కొన్ని బిల్డింగులు నాశనమయ్యాయి. యుద్ధానంతరం అమెరికా ప్రభుత్వం-హిట్లర్, తదితరుల బిల్డింగులను నేలమట్టం చేయవల్సిందిగా స్థానిక ప్రభుత్వాధికారులకు ఆదేశమిచ్చింది ఆ మేరకు దాదాపు



అన్ని కట్టడాలు నేల కూలినా అధికారుల ఆదరణ వల్ల ఈగల్స్ నెస్ట్ మాత్రం చిరస్థాయిగా వుండిపోయింది.

ప్రకృతి అందాన్ని చూడ్డానికైతేనేమి, ఒకప్పటి నియంతృత్వ నేత హిట్లరు నివాస గృహాన్ని చూడ్డానికైతేనేమి ఏటా లక్షన్నర మంది టూరిస్టులు బెర్చెస్ట్ గేడెన్ను సందర్శిస్తున్నారు. గోరింగ్, గోబెల్స్ భవంతులు ఎక్కడుండేవోనని యాత్రికులు అంచానా వేస్తుంటారు. ప్రస్తుతం వాళ్ళ బిల్డింగు ఫోటోలకు మంచి గిరాకీ వుంది. హిట్లరు, గోబెల్స్‌ల సంభా




షణలున్న గ్రామ ఫోను రికార్డులు హాట్ కేక్స్‌లా అమ్ముడు పోతున్నాయి. రోజు రోజుకీ పెరిగే టూరిస్టుల రద్దీని వరంగా భావించి స్థానిక వ్యాపారస్థులు, హోటలు యజమానులు ఆనందం పట్టలేక పోతుంటే, నాజీజం పట్ల ప్రజలకు పెరుగుతున్న ఆకర్షణను చూసి పశ్చిమ జర్మనీ మేధావులు తలలు పట్టుకు కూర్చున్నారు.

# రక్షించండి

ఈ మధ్య మద్రాసు పేరిస్ కార్నర్లో దాదాపు 25 ఆవులు 'దయచేసి మమ్మల్ని రక్షించండి', 'మేమేం తప్పు చేశాం?', 'మేము మీ మిత్రులం', 'మమ్మల్ని చంపకండి' అని హిందీ, ఇంగ్లీషు, తమిళ భాషల్లో రాసిన అట్టలను పట్టుకుని ఊరేగింపుగా బయల్దేరాయి. గోసంరక్షణ సభ వారు తమ సంస్థ ప్రథమ వార్షికోత్సవ సందర్భంగా ఈ ఊరేగింపును నిర్వహించారు.

చాలా మంది ముసలి ఆవులను నిరుపయోగమని తక్కువ ధరకు అమ్మేస్తుంటే, కొనుక్కున్నవాళ్ళు ముక్కలు ముక్కలుగా నరికి మాంసం దుకాణాల్లోకి వేస్తున్నారు. అటువంటి ముసలి ఆవులను కాపాడ్డం కోసం ఏర్పడిన ఈ సంస్థ వాటికి నీడనిచ్చి అవి సహజంగా మరణించే వరకూ పోషిస్తుంది. మనుషులకి చేసినట్లే కర్మకాండ జరిపిస్తుంది.

కంచి శంకరాచార్యుల శిష్యుడైన జయేంద్ర సరస్వతి ప్రోత్సాహంతో ఉత్సాహవంతులైన కొందరు యువకులు మద్రాసులో ఈ కార్యక్రమాన్ని చేపట్టారు. మొదట్లో వీరంతా తలకొక పది రూపాయలు వేసుకుని మొత్తం 110 రూపాయలు సేకరించి కరపత్రాలు ముద్రించి, పంచి 1978 ఆగస్టు 19వ తేదీన అధికార పూర్వకంగా గోసంరక్షణ సంస్థకు ప్రారంభోత్సవం చేసినట్లు ప్రకటించారు.

కూరగాయలు, పళ్ళ వ్యాపారస్థులు, హోటళ్ళ వారి ఔదార్యంతో ఆవులన్నింటికీ పోషకాహారమే ఇవ్వగలుగుతున్నారు.

ఈ సంస్థలో మొత్తం 20 ఆవులున్నాయి. వాటి పాలను బీదవారికి పంచి పెట్టారు. పూనమల్లిహైరోడ్లో వీటికోసం 20 ఎకరాల స్థలాన్ని కొన్నారు. జంతువు



లకి ఈ ప్రదేశం ఎంతో అనువుగా, ఆహ్లాదకరంగా వుంటుందిట. తమిళనాడు అంతటా అనతికాలంలో ఇటువంటి గోశాలలు నిర్మించాలని ఈ సంస్థ అభిప్రాయ పడుతోంది. 'తల్లి పాల తర్వాత ఆవు పాలే శ్రేష్ఠమైనవన్న సత్యాన్ని మనం ఎప్పటికీ మరువరాదన్నది' వీరి నినాదాల్లో ఒకటి.

# ప్రతిజ్ఞ!

"5 ఏళ్ళ కరుప్పస్వామికి 3 ఏళ్ళ తంగమణినిచ్చి చేయు వివాహ మహోత్సవమునకు తామెల్లరు బంధుమిత్ర సపరివార సమేతంగా" అంటూ తిరుచ్చికి చెందిన స్వామియప్పనాదర్, రాజప్ప నాదర్ వేసిన శుభలేఖ చూస్తే ఎవరికైనా ఆశ్చర్యం కలక్కమానదు. ఈ వయసులో కిందర్ గార్టెన్ స్కూల్లో ఏబిసిడి నేర్చు






కుంటూ, 'తాయిలం కావాలి'... అంటూ అమ్మ కొంగు పట్టుకు మారాం చేస్తూ, వుండే పిల్లలకి పెళ్ళి చేయడమేమిటి? తల్లిదండ్రులకి బాల్యవివాహ చట్టం గురించి తెలీదా! అని మీరాశ్చర్యపోకండి-

రాజప్ప, స్వామియప్ప ఇరుగు పొరుగున వుండేవాళ్ళు. కరుప్పస్వామి, తంగమణి కలిసిమెలిసి ఆడుకోవడం చూసి వాళ్ళిద్దరికీ పెళ్ళిచేస్తే ఈడూ జోడూగా వుంటుందనుకున్నారు. ఏది ఏమైనా, ఎన్ని అడ్డంకులు వచ్చినా వారి వివాహం జరిపి తీరాలని 1965 ఆగస్టులో ప్రమాణం తీసుకున్నారు-

ఇపుడు తంగమణికి 17 ఏళ్ళు, కరుప్పస్వామికి 19 ఏళ్ళు ఇన్నేళ్ళు గడిచినా గతంలోని ప్రమాణం మాత్రం మర్చిపోలేదు సరికదా! శుభలేఖల్లో చిన్ననాటి మాట గుర్తుగా పిల్లలిద్దరి చిన్నప్పటి ఫొటోలను కూడా ముద్రించారు.

స్నేహితులు, బంధువులు ఎంత మందో తమ పిల్లల్ని, డబ్బుని ఎరచూపి ఈ సంబంధం చెడగొట్టాలని ప్రయత్నాలు చేశారు. కానీ రాజప్ప, స్వామియప్ప ఎవరినీ లక్ష్య పెట్టలేదు. అనుకున్న మాట ప్రకారం 1979 ఆగస్టులో తంగమణి, కరుప్పస్వామిలను ఒక యింటి వాళ్ళను చేశారు.

# ఇసుకమందు

పఠాన్‌కోట్‌కు 20 కిలోమీటర్ల దూరంలో కులు-మనలై రహదారి వుంది. ఈ దారి మధ్యలో నాగినీ దేవత గుడి ఒకటి వుంది. ఇక్కడ కొన్ని రకాల రోగాలకు మందులిస్తారు. పాము కాటుకు చికిత్స చేస్తారు. ఎన్నో వేలమంది ఈ సదవ కాశాన్ని వినియోగించు కుంటున్నారు.

గత 500 సంవత్సరాలుగా ఈ గుడికి ఎంతో పేరుప్రఖ్యాతులున్నాయి. ఇంతకు ముందు కుష్ఠు వ్యాధికి చికిత్స చేసేవారి క్కడ. వ్యాధులన్నీ చాలా తొందరగా నయమవడం వల్ల పూర్వం 'కోఢీదేవి' అనే పేరుతో పిల్చేవారు. ఆ తర్వాత కొన్నాళ్ళకు పాము కాటుకు మందు కని

పెట్టారు. తరతమ భేదాలు లేకుండా ఈ చికిత్స అందరికీ అందుబాట్లో వుంటుంది.

పాము కరిచిన రోగికి ముందు దేవీస్తోత్రం చేస్తూ రోగి మెడచుట్టూ దారంతో చుడతారు. తర్వాత అక్కడ దొరికే ఇసుకను రోగికి ప్రసాదంగా ఇస్తారు. వ్యాధి నయమయ్యే వరకు రోగి గుడి ముందున్న ఆవరణలో పడుకోవాలి. మంత్ర తంత్రాలేవీ వుండవు. ఇదంతా



దేవీ అనుగ్రహమేగాని వేరు కాదంటారు అక్కడవారు. రోగ తీవ్రతనుబట్టి ఒక రోజు నుండి నెల రోజులదాకా అక్కడ వుండాల్సి వస్తుంది.

ప్రతి సంవత్సరం 'అవని' నెల శని వారం నాడు జరిగే ఉత్సవం చూడ్డానికి వివిధ ప్రాంతాల నుండి యాత్రికులు తండోప తండాలుగా వస్తారు.

కులమత భేదాలు లేకుండా అందరూ దేవి ఆశీస్సులు పొందడానికి అస్తారే. దేవీ విగ్రహం చిన్న పాము రూపంలో వుంటుంది. విగ్రహం దగ్గర్నించి వూరే నీళ్ళు చాలా తియ్యగా వుంటాయట.

# ప్రయోగం ప్రమాదం

నందాదేవి పర్వతప్రాంతంలో వున్న పియంగ్, లత, దౌలిగంగా మొదలైన గ్రామ ప్రజల్ని అప్రమత్తులై వుండమని ఏడుమంది సభ్యులున్న న్యూక్లియర్ శాస్త్రజ్ఞుల కమిటీ హెచ్చరికలు చేసింది. 1966లో నందాదేవి పర్వతం మీద అణు ప్రయోగాలు జరిపినపుడు కొన్ని అణు పరికరాలు ఆ చుట్టు పక్కల పడిపోయాయి.

భూమిలోను, రాళ్ళలోను నిక్షిప్తమైన ఆ పనిముట్లు మిక్కిలి శక్తివంతము, అపాయకరము, కాంతివంతము అయిన వనీ, ఆ గ్రామాల ప్రజలకు వాటివల్ల ప్రమాదం వాటిల్లవచ్చుననీ ఈ కమిటీ వారు భావించి కేంద్ర ప్రభుత్వానికి తెలియ చేశారు.

మొత్తం మూడు గ్రామాల్లోనూ కలిపి 361 మంది కంటే జనాభా లేరు. రోడ్డుమీద నడుస్తున్నపుడు, ఇళ్ళుకట్టడానికీ, పొలాల కోసం నేలను తవ్వినపుడు మూసివున్న ఏ చిన్న పెట్టెగాని, కొత్త పనిముట్టుగానీ కనబడినట్లయితే వెంటనే అధికారులకు తెలియబర్చాలి. ప్రత్యేకంగా ఇందుకోసం కొందరిని "న్యూక్లియర్ వాచ్‌డాగ్స్"గా నియమిస్తున్నారు.

ఆ పరికరాలు భూమిలో తుప్పు పట్టి చీకిపోయినట్లయినా, చిన్న పెట్టెలో అలాగే వున్నా ప్రమాదం లేదు. కానీ అదేమిటో తెల్సుకోవాలన్న ఉత్సుకతతో గ్రామస్థులు

ఆ పెట్టెను బద్దలుకొడితే మాత్రం చాలా ప్రమాదం.

జనాభా తక్కువ సంఖ్యలో వుంది కనుక అందరికీ ప్రమాద హెచ్చరికలు తెలియజేయడం అంత కష్టం కాదు. నిజానికి



ప్రస్తుతం అంత భయపడవల్సిన పనిలేదు. పోయిన పరికరాల తాలూకు 'రేడియేషన్' జాడలేమైనా కనిపిస్తాయేమోనని భూమిలోను, నీళ్ళలోను, గాలిలోనూ నిర్విరామ పరీక్షలు జరుగుతున్నాయి.

## ఆటోగ్రాఫ్స్

ప్రముఖుల ఆటోగ్రాఫ్‌లను సేకరించడం సర్వసాధారణమైన హాబీ అయిపోయింది రోజుల్లో. కానీ కీర్తిశేషులైన ప్రపంచ ప్రముఖుల ఆటోగ్రాఫ్‌లను సేకరించటం అనుకున్నంత తేలికకాదు.

పశ్చిమ దేశాల్లోని కొన్ని సంస్థలు పేరెన్నికగన్నవారి ఆటోగ్రాఫులను, వ్రాతప్రతులను అమ్ముతున్నాయి. అటువంటి వాటి ఖరీదు మామూలుగా 25 నుండి 250 రూపాయలవరకూ వుంటుంది. ప్రస్తుతం విక్టోరియా మహారాణి ఆటోగ్రాఫ్ ధర వంద రూపాయలు. కాని షేక్స్పియర్ ఆటోగ్రాఫ్ ఖరీదు 7.5 లక్షలు.

కొలంబస్ చేతివ్రాత 25,000 రూపాయలకు దొరుకుతుంది. అతగాడు రాసిన ఓ ఉత్తరం 2.5 లక్షలకు అమ్ముడుపోయింది. శ్రీమతి మేరీ బెంజిమిన్ అనే అమెరికా దేశస్థురాలు ప్రముఖుల ఆటోగ్రాఫ్‌లు, దస్తూరీలు సేకరించి వ్యాపారం నడిపిస్తోంది. హిట్లర్, నెపోలియన్, షేక్స్పియర్, డాంటే, కీట్స్, హెన్రీ, నెహ్రూ, కెనడీ మొదలైనవారి చేతివ్రాతలు, ఆటోగ్రాఫ్‌లతోబాటు అరుదైన చేతిప్రతులు, డాక్యుమెంట్లు కూడా ఆమె





వద్ద వున్నాయి. వాటి విలువ దాదాపు 2 కోట్లు.

ఏ వ్యాపారంలోనైనా పోటీ, మోసం తప్పవేమో! ఈ మధ్యనే బ్రిటన్‌కి చెందిన విలియం హెన్రీని-ప్రముఖుల సంతకాలు, ఉత్తరాల డూప్లికేట్లు అమ్మాడన్న నేరంపై





అరెస్ట్ చేశారు. అతను షేక్స్పియర్ దస్తూరీని అచ్చంగా అలాగే రాయడంలో ఎంత నైపుణ్యం సంపాదించాడంటే బ్రిటన్‌లోని పెద్ద మ్యూజియం అధికారులు అది నిజంగా షేక్స్పియర్ దస్తూరీ యేనని మోసపోయారు. ఇతను హామ్లెట్, కింగ్‌లియర్ అనే రెండు షేక్స్పియర్ నాటకాల్ని చక్కగా కాపీకొట్టి పెద్ద మొత్తానికి అమ్మేశాడు. అముద్రితాలైన మరో రెండు నాటకాల్ని కూడా అమ్మితే ఉత్సాహవంతులు కొనుక్కు-నిఇంగ్లాండులో ప్రదర్శించారు కూడా!

# కొత్త మోజు

వ్యాయామం ఆరోగ్యానికెంతో మంచిది. పరిగెత్తడం కూడా మంచి వ్యాయామమే! అమెరికాలో చాలామందిప్పుడు ఎక్సర్‌సైజ్ పట్ల వ్యామోహం చూపిస్తున్నారు. ఎక్కువ శాతం వారానికి రెండు సార్లు ఓ మైలుదూరం పరిగెడుతున్నారు. ఎవరికే పిచ్చిపట్టినా మొదట బాగుపడేది వ్యాపారస్థులే. ఈ పరుగులకోసం అవసరమయ్యే మేజోళ్ళు, దుస్తులకు గిరాకీ పెరిగింది. ప్రస్తుతం అమెరికా అధ్యక్షుడు కూడా వైట్‌హౌస్ చుట్టూ పరుగులు తీస్తున్నాట్ట.

జేమ్స్ ఫిక్సస్ రాసిన 'ది కంప్లీట్ బుక్ ఆఫ్ రన్నింగ్' అనే పుస్తకం-రచయితకు, పబ్లిషర్‌కు మంచి లాభాలు తెచ్చిపెడుతోంది. అయినాగాని పరిగెత్తడం వల్ల వచ్చే ప్రయోజనాల గురించి తెలీని వాళ్ళు కూడా చాలామంది వున్నారు.

అసలీ ఎక్సర్‌సైజ్‌ను ప్రచారంలోకి తెచ్చిన వాళ్లు శరీరంలోని అన్ని రోగాలకు పరుగు దివ్యౌషధంగా పనిచేస్తుందంటున్నారు. ఆయువును పెంచడం, మనశ్శాంతి, చురుకుదనం, క్రమబద్ధమైన రక్తప్రసరణ మొదలైనవి దీని వలన లాభాలుగా వర్ణిస్తున్నారు. కొందరు ఈ



పరుగుల మీద పారడీలు రాసున్నారు. అవి హాట్‌కేక్స్‌లా అమ్ముడుపోవడమే ఆశ్చర్యం.

1968లో డాక్టర్ కూపర్ ఈ ఎక్సర్‌సైజ్‌ని ప్రవేశపెట్టాడు - అది బహుళ ప్రచారంలోకి రావడానికి ఇన్ని సంవత్సరాలు పట్టింది. అయితే కొందరు మనశ్శాంతి కోసం పరిగెత్తి మోకాలి చిప్పలు పగుల గొట్టుకున్నారు కూడా!

అమెరికన్ కాంగ్రెస్ సభ్యుడు గూడిల్ బైవన్‌కి ఎక్కువ పరిగెత్తడం వల్ల గుండె జబ్బు వచ్చింది. ఈ వ్యాయామం అంటే గిట్టనివాళ్లు, పరిగెత్తే ఓపిక లేని బద్ధకస్తులూ "ఎన్ని వ్యాయామాలు చేస్తేమాత్రం ఏం లాభం! మరణాన్ని తప్పించుకోలేం కదా" అని వేదాంతం వొలకబోస్తున్నారు.

జూలై 2, 1948.

ఆదివారం సాయంత్రం,

విశాఖపట్నం సముద్రతీరాన యిసుకలో తల కింద చేతులు పెట్టుకొని వెల్లకిలా పడుకున్నాను. ఆకాశం చిత్రవిచిత్ర ఆకారాలు గల మబ్బుతునకలతో చిత్రకారుడి అసంపూర్ణ కేన్వాసులా వుంది. ఎక్కడో సముద్ర మధ్యం నుంచి పుట్టుకొచ్చిన ఆకాశం భూ ప్రపంచం మీద వున్న నాపై కప్పిన పిరమిడ్‌లా వుంది. 'పెద్ద జైలులో చిన్న మనిషిని' అనిపించింది నాకు. ఒక్కసారి నిట్టూర్చాను. సముద్రం వైపు చూశాను. కెరటాలు పిచ్చిగుర్రాల్లా నామీదకుదూకుతున్నాయి. కానీ నన్ను తాకలేకపోతున్నాయి. దమ్మైపోయి దారిలోనే విరిగిపోయి పుట్టినచోటకే వెళ్ళి పోతున్నాయి.

తీయని నవ్వులు వినిపించాయి. అటు వైపు తిరిగాయి నా కళ్ళు. పేలాడుతున్న వల కన్నుల్లోంచి నా చూపులు దూసుకుపోయాయి.

నలుగురు అమ్మాయిలు తడి యిసుక మీద నడుస్తున్నారు. 'తనను వలచి వచ్చిన నదీ కన్యలా?' అనిపించారేమో ఆ నలుగురు అమ్మాయిలూ సాగరుడికి-కెరింతలు కొడుతూ కెరటాలు వాళ్ళ పాదాలతో దోబూచు లాడుతున్నాయి. సిగ్గుపడి తొలగినట్లు చీర కుచ్చెళ్ళు చేతబట్టుకొని కెరటాలకి దూరంగా పరుగెడుతున్నారు ఆ అమ్మాయిలు. అలా కెరటాల చెలగాటాలకు దొరక్కుండా తప్పించుకో గలిగినప్పుడు కిలకిలా నవ్వుతున్నారు వాళ్లు. ఆ నవ్వుల రవళికి సముద్ర ఘోష ఒక చిత్రమైన శృతి.

ఆ నవ్వుడికే నా చూపులు అటు తిరిగాయి. బంగారు చేపల్లా మెరిసి పోతున్న పాదాలనించి నా చూపులు పైకి నడిచాయి. చీరల జరీ కొంగులు తుంపరలకు తడిపొడిగా తడిశాయి. నా చూపుల వాలులోనే వీస్తున్న గాలి వారి చీరలను ముందుకు నెట్టుతూ వుండే వారి పిరుదులు ఏ చిత్రకారుడి కుంచెకీ అందనంత అందంగా వయ్యారపు వొంపులను తొణికిసలాడిస్తున్నాయి. ఆ తొణికిసలాటకు లయగా వాలు జడలు ఒంపులపై తాళం వేస్తున్నాయి. చీర కుచ్చెళ్ళకు, రవికెలకు మధ్య పిడికిలిలో యిమిడే ఆ సన్నని నడుములు మబ్బుల్లో తళుక్కుమనే మెరుపు తీగల్లా నా కళ్ళకు మిరుమిట్లు కొలుపుతున్నాయి. ఒంటినుంచి మొలిచి నట్లున్న బిగువైన రవికెలు, వాటిపైనుంచి వాలి యిటూ అటూ కదులుతున్న పమిట కొంగులు- చూసేకొద్దీ చూడాలని పించింది. 'వెనకనించి చూస్తూ వుంటేనే యిన్ని అందాలు జాలు వారుతూంటే ముందుకు వెళ్ళిచూస్తే యింకెన్ని అందాలో' అనుకున్నాను.

పడుకున్నవాణ్ణి లేచాను. బట్టలకు-అంటిన యిసుక కూడా దులుపుకోకుండా వేగంగా వాళ్ళ వెనకే నడిచాను. ఏమీ యెరగనట్టు వాళ్ళ పక్కనించే యెదరకు నడిచి పోయాను. కొంత దూరం వెళ్ళి వెనక్కి తిరిగాను. వాళ్ళకి యెదురుగా వాళ్ళవైపే నడుస్తున్నాను. వాళ్ళనే చూస్తూ నడుస్తున్నాను. వాళ్ళ నలుగురిలో ముగ్గురు మామూలుగానే వున్నారు. ఒక అమ్మాయి మాత్రం నన్నెంతగానో ఆకర్షించింది.

వాళ్ళునలుగురూ నాకు తెలియని వాళ్ళు కాదు. వాళ్ళూ, నేను ఒకే కాలేజీలో చదువుకుంటున్నాము. కాకపోతే నన్ను

ఆకర్షించిన అమ్మాయి నా క్లాసుమేటు మేమిద్దరం బి. యస్. సి. సెకండియరు. మిగిలిన ముగ్గురూ బి. య్యే. నా క్లాసు మేటు పేరు అభినేత్రి.

అభినేత్రిని చాలాసార్లు కాలేజీలో చూశాను. క్లాసురూంలోనూ చూశాను. కొంగు నిండుగా కప్పుకొని తల వంచు కొని క్లాసులోకి వచ్చేది. క్లాసుకాగానే మళ్ళీ అలాగే బయటకి వెళ్ళిపోయేది. ఎవరితోటీ మాట్లాడటం కానీ, తన తోటి వారిని జోక్‌చేయడం కానీ నేనెప్పుడూ చూడలేదు. అసలు యిప్పుడగుపించినంత ఫ్రీగా కాలేజీలో యెప్పుడూ కనిపించలేదు. ఆమె యింత చలాకీగా వుంటుందనీ, యింతటి అందగత్తె అనీ యేడాది నించి యిద్దరం కలిసి చదువుకుంటున్నా నాకు తెలీలేదు.

అనుకోకుండా సముద్ర తీరాన చూశాను అభినేత్రిని. ఎంత ప్రయత్నించినా ఆమె నుంచి నా చూపులను తిప్పు కోలేక పోతున్నాను. కానీ, నేను చూసు న్నట్టు ఆమె యెక్కడ గ్రహిస్తుందోనని మనసు కాస్త బిడియపడుతోంది. ఆమె కంటపడకుండా ఆమెనే చూస్తూ మెల్లగా, అడుగులో అడుగు వేసుకుంటూ ఆమెకు యెదురుగా నడుస్తున్నాను.

ఆమె కనురెప్ప కదిలిస్తే తీయని చూపుల చురకలు నా గుండెకు తాకు తున్నాయి. ఆమె చిరునవ్వులు మందా రాల కెంపుల మాటునుంచి విరబూసిన మల్లెలు. 'కోపం అంతా ముక్కుమీదే వుందా' అన్నట్టు కొనతేరిన ముక్కు. చూ సేకొద్దీ చూడాలనిపించే అందం అభి నేత్రిది. నా చూపులు ఆమె ముఖం మీంచి కిందకు జారాయి. ఆమె సన్నమూ కాదు, లావూకాదు. అయినా ఆమె నాజూకుకు మరో రూపం. యవ్వనం ముచ్చటపడి ఆడదై పుడితే అభినేత్రిలా వుంటుందా అనిపించింది.

అలా ఆమెను చూస్తూ ఆమె పక్కనే వున్న మిగిలిన అమ్మాయిలను మరిచి పోయి ఆమెకు దగ్గరగా నడిచాను. ఆమె నన్ను చూసింది. అప్పటిదాకా అలలా ఆడుకుంటున్న ఆమె నన్ను చూడగానే వొడ్డును తాకి విరిగిన అలలా అయిపో యింది. కాస్త యెత్తి పట్టుకున్న చీర కుచ్చెళ్ళు వదిలేసింది. కనురెప్పలు దించు కుంది. పమిట నిండుగా కప్పుకుంది. చకచకా నా ముందు నుంచి యెదరకు నడిచి వెళ్ళిపోయింది.

నేను వెనక్కి తిరిగి వెళ్ళిపోతున్న అభినేత్రిని చూస్తూ నిలబడ్డాను. నాలో నేనే నవ్వుకున్నాను. గుప్పెడు యిసుక తీసుకొని పైకెగరవేశాను.

"అభినేత్రి"-అనుకున్నాను. ఒక్కసారి కాదు. ఎన్నోసార్లు ఆ పేరును స్మరించాను. అలల అలికిడిలో కూడా "అభినేత్రీ! అభినేత్రీ!" అన్న పిలుపే వినిపించింది ఆ రోజంతా నాకు.

ఆ రోజునుంచి నేను రూంలో వున్నా, కాలేజీలో వున్నా ఆమె స్మరణే. ఒక్క సారి ఆమెతో మాట్లాడాలనీ, వీలైతే పరి చయం పెంచుకోవాలనీ నా మనసు తహ తహలాడుతోంది. కానీ ఆమె అవకాశం యిచ్చేదికాదు. నాకేకాదు-నాకు తెలిసి నంతవరకూ ఎవరికీ ఆ అవకాశం దొరకలేదు.

అనుకోకుండా కాలేజీ ఎన్నికలు వచ్చాయి. అప్పటికే ఒకటి రెండు కథలు యేవో పత్రికల్లో నావి అచ్చుకావడంచేత, గత సంవత్సరం కాలేజీ వార్షికోత్సవాల్లో

నేనో నాటకంలో నటించడంచేత నా ఫ్రెండ్స్ ఫైనార్ట్స్ సెక్రటరీకి పోటీ చెయ్యమన్నారు నన్ను. నేను కాస్త మొహమాట పడ్డాను. మొహమాట పడటానికి కారణం లేకపోలేదు.

నేను పుట్టింది ఒక పల్లెటూళ్ళో. అమ్మా నాన్నా పెట్టిన పేరు నారాయణ రావు. నాన్నగారు వూరికి మునసబు. ఏభై ఎకరాలు ఆస్తిగల ఆసామీ. వూరికి మోతుబరి. వూళ్ళో జనం అంతా మా నాన్నగారిని "మునసబుగారూ" అనే పిలిచేవారు. రాఘవయ్య అన్న ఆయన పేరు పత్రాల్లో వుండేది కానీ, జనం పెదాలమీద వుండేదికాదు. అలాగే నన్ను కూడా "నారాయణరావూ" అని ఎవరూ పిలిచేవారు కాదు. అంటే "చిన మునసబుగారు" అనే వారు. లేకపోతే "చిన్నబ్బాయిగారు" అనేవారు. చివరికి నా పేరు మా ఊళ్ళో చిన్నబ్బాయిగానే స్థిరపడి పోయింది. మా నాన్నకు చదువు విలువ తెలియడం చేతకాదు నన్ను పెద్ద చదువులకు పంపించింది - కరణంగారి అబ్బాయి కాలేజీ చదువు చదివి అప్పుడప్పుడు సూటూ బూటూ వేసుకొని ఊళ్ళోకి రావడం చూసి నన్నూ అంతవాణ్ణి చేయాలని కాలేజీ చదువులకి పంపారు మా నాన్న నన్ను.

ఇంటర్‌మీడియట్ కాకినాడ పి. ఆర్. కాలేజీలో చదువుకున్నాను. బై. పి. సి. గ్రూపు. నా క్లాసులో చాలామంది అమ్మాయిలు వుండేవారు. పల్లెటూరి ప్రాంతం నుంచే వచ్చినవాణ్ని అవడం వల్ల కాలేజీలోచేరిన కొత్త రోజుల్లో బెరుకు బెరుకుగా వుండేవాణ్ణి. ఎవరితోటి అంత చనువుగా మాట్లాడలేక పోయేవాణ్ణి. ఆడపిల్లలంటే భయం, సిగ్గు కూడాను. కాలేజీ సంగతి అటుంచి బయట ప్రపంచం కూడా నాకంత తెలీదు.

ఒకసారి నేనొక్కడినే టౌన్‌హాలు పక్కనున్న ఇండియా కాఫీ హౌస్‌కు వెళ్ళాను. అప్పటికి కాకినాడలో వున్న హోటల్స్ అన్నింటిలోకి ఇండియా కాఫీ హౌసే కాస్త ఫాషనబుల్‌గా వుండేది. ఆ హోటలుకి వెళ్ళాలనిపించి ఓ సాయంత్రం వెళ్ళాను. మెనూకార్డు చూసి 'ఆమ్లెట్' ఆర్డరుచేశాను. బేరరు తెచ్చాడు. కత్తులు, కటార్లు పక్కనపెట్టి చేత్తో తినేశాను. కారణం-అవి యెలా వుపయోగించాలో తెలీక. తరవాత కాఫీ వచ్చింది. తాగి చూస్తే చేదుగా వుంది. టేబులుమీద ఎదురుగా వున్న తెల్ల సీసా తీసుకొని, కాఫీలో చల్లుకొని స్పూన్‌తో తిప్పి, తాగాను. కాఫీ ఉప్పగా వుంది.

బేరరుని పిలిచి "కాఫీ ఉప్పగా వుందేమిటయ్యా'' అని అడిగాను అమాయకంగా.

వచ్చే నవ్వు నాపుకుంటూ ''ఏం వేసుకున్నారు కాఫీలో?" అన్నాడు బేరరు.

"ఇదిగో! ఇదే'' అన్నాను ఎదురుగా వున్న తెల్ల సీసాను చూపిస్తూ.

"అది సాల్ట్ సార్!'' అని నా ముందున్న కాఫీ తీసుకుపోయి వేరే కాఫీ తెచ్చి యిచ్చాడు.

అదీ అనాటి నా ప్రపంచజ్ఞానం.

నిజం చెప్పాలంటే నన్ను మనిషిని చేసింది కాకినాడ పి. ఆర్. కాలేజీయే. ఆ కాలేజీలో ఇంటర్‌లో చేరేంతర్వాతనే నేను 'టక్' చేయడం నేర్చుకున్నాను. 'షూస్' వేసుకోవడం నేర్చుకున్నాను. పదిమందితోటి కలిసిమెలిసి తిరగడం అలవాటు చేసుకున్నాను. కానీ, అప్పటికీ నాకు ఆడవాళ్ళంటే భయమే. నా

 

క్లాసులోనే దాదాపు ముప్పైమంది అమ్మాయిలున్నా, ఫస్ట్ ఇయర్‌లో ఎప్పుడూ యెవరితోనూ మాట్లాడలేదు. అప్పటికి నా వయస్సు పదిహేడు. నాకంటే నాచుట్టూ వున్న నా క్లాసుమేట్సు తెలివైనవాళ్ళుగానూ, అనుభవజ్ఞులుగానూ కనబడేవాళ్ళు నాకు. అందుకని ఎవరితోటీ కలవకుండా పుస్తకం చేత పట్టుకొని, పుస్తకంలో ముఖం దాచుకొని కూర్చుండేవాడిని. చదువుతున్నట్టు నటన కాదు నిజంగానే చదివేవాడిని. కానీ నోరువిప్పి ఎవరితోటీ ఇంగ్లీషులో మాట్లాడేవాణ్ణికాదు. మాట్లాడితే తప్పులు మాట్లాడతానని భయం. క్లాసులో లెక్చరరు యేదేనా ప్రశ్న వేస్తే తెలిసినా చెప్పేవాడినికాదు. ఇదంతా 'ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు' మాత్రంకాదు – నేను పెరిగిన వాతావరణ ప్రభావం. నేను ఏ వుద్యోగస్తుడి కుటుంబంలోనో పుట్టి పట్నంలో పెరిగి వుంటే యెలా వుండేవాడినో! పుట్టింది రైతు కుటుంబంలో, పెరిగింది పల్లెటూరిలో, చదివింది ఒక చిన్న టౌనులో. అందుకే నాకు నాగరికుల లక్షణాలూ, పద్ధతులూ అలవాటు కాలేదు.

అటువంటి నన్ను నా రూంమేటు ప్రసాదు సహృదయంతో అర్థం చేసుకొని మార్చడం మొదలు పెట్టాడు. మార్చడం అనే కంటే నాకు మెరుగు పెట్టడం మొదలెట్టాడు అనటం మంచిది. యన్. సి. సి.లో జేర్పించాడు తనతోబాటు.

నేను కాలేజీలో చేరిన కొత్తలో సీనియర్ విద్యార్థులు గ్రౌండులో ఎన్. సి. సి. పెరేడ్ చేస్తూ వుంటే దూరంగా నిలబడి కళ్ళప్పగించి చూసేవాడిని. అక్కడి నుంచి కదలబుద్ధి అయేదికాదు, సాయంత్రపువేళ గ్రౌండులో ఎవరైనా ఫుట్‌బాల్ ఆడుతున్నా, టెన్నిస్ ఆడుతున్నా అంత ఆసక్తిగానూ చూసేవాడిని. అలా చూడ్డమే తప్ప ఆటల్లోకి దిగేవాడినికాదు. ఒకసారి ఫుట్‌బాల్ నా దగ్గరకి వచ్చింది. ముట్టుకు చూశాను. గట్టిగా రాయిలా వుంది. ఆ క్షణంలోనే చచ్చినా దాని జోలికి వెళ్ళకూడదు, ఆ ఆట ఆడకూడదు అనుకున్నాను. కానీ, టెన్నిస్ మీద నా గ్లామరు పోలేదు. వైట్ నిక్కరు, వైట్ బనియను, చేతిలో టెన్నిస్ రాకెట్టు–ఎందుకనో నాకు చూసేకొద్దీ చూడాలనిపించేవాళ్ళు టెన్నిస్ ఆటగాళ్ళు. నాకూ ఆడాలనిపించేది. టెన్నిస్ బంతిని కూడా ఒకసారి ముట్టుకు చూశాను. ఫుట్‌బాల్ అంత కటువుగా లేదా బంతి. చిన్న బొచ్చుకుక్క పిల్లలా వుంది.

అటువంటి ఊహల్లో నేనుండగా ప్రసాదు ప్రోద్బలంతో ఎన్. సి. సి.లో చేరాను. ఏ ఎన్. సి. సి. పెరేడు చూసి ఒకప్పుడు నేను ముగ్ధుడినయిపోయేవాడినో అదే ఎన్. సి. సి.లో చేరి నేను పెరేడులో పాల్గొనడం నాకెంతో ఆనందంగా వుండేది.

అలాగే మరో మిత్రుడు సుబ్బారాయుడి ప్రోత్సాహంతో టెన్నిస్ ఆడ్డమూ ప్రారంభించాను. కొద్ది రోజుల్లోనే బాగా పికప్ చేశాను. గమ్మత్తు యేమిటంటే టెన్నిస్ యూనిఫారం వేసుకున్న రోజునే రాకెట్టు చేతబట్టుకొని సుబ్బారాయుడి చేత ఫొటో తీయించుకున్నాను. ఆ ఫొటోను జాగ్రత్తగా దాచుకుందుకు ఆల్బమ్ కొన్నాను. 'ఆల్బమ్ అంటే ఫొటోలు దాచుకునే పుస్తకము' అని అప్పటిదాకా నాకు తెలీదు! ఆ తరవాత కెమెరా కూడా కొనాలనిపించింది, కానీ కొనలేదు.

అలా రోజు రోజుకీ నేను ఎదుగుతున్నాను. ఈ ఎదగడం శారీరకంగానూ,

లోకజ్ఞానపరంగానూ మాత్రమే. కానీ, మనిషి మానసికంగా ఎదిగిన నాడే నిజంగా ఎదిగినట్టు. నేను మానసికంగా ఎదగడానికీ, మంచి అభిరుచుల్ని అల వాటు చేసుకోడానికీ దోహదం చేసింది కూడా పి.ఆర్. కాలేజీ వాతావరణమే.

ఆంధ్ర సాంస్కృతిక వారోత్సవాలు ప్రారంభమయ్యాయి కాలేజీలో. క్వాడ్ర యాంగిల్ హాలు ప్రాంతంలో పెద్ద వేదిక కట్టి, పందిరి వేశారు. పందిరి అడుగున చాందినీ కప్పారు. రంగు రంగుల కాగితపు బుట్టలు, తోరణాలు పందిరికి తీర్చిదిద్ది కన్నుల పండుగ చేశారు. 'సంస్కృతి' అనే పెండ్లికూతురికి అమర్చిన కళ్యాణ వేదికలా వుంది ఆ పందిరి.

సభ ప్రారంభం రోజున మొట్టమొదట వేదిక యెక్కి విద్యార్థులకు, ఆహ్వానితు లకు స్వాగతం చెప్పినది మా కాలేజీ విద్యార్థి సంఘ అధ్యక్షుడు శర్మ. శర్మ మాతోటి విద్యార్థే అయినా, అతను వేదిక ఎక్కి మైకు ముందు నిలబడేసరికి ఆడిటో రియంలోని సభంతా స్తంభించిన సాగ రంలా అయిపోయింది. అంతటి నిశ్శబ్దం ఆవరించేదాకా శర్మ పెదవి విప్పలేదు.

"ఆంధ్ర సాంస్కృతిక వారోత్స వాలలో ఉత్సాహంతో పాల్గొనేందుకు ఆసీనులై వున్న నా తోటి విద్యార్థి సోదరీ సోదరులకు, విచ్చేసిన పురప్రముఖులకు, మా వెనుకవుండి ఈ కార్యక్రమాలను నిర్వహించడానికి ఎంతో ప్రోత్సాహ న్నిస్తున్న ఆచార్యులకు, ఉపన్యాసకులకు, ఈనాటి ముఖ్య అతిథిగా విచ్చేసిన ఆధు నిక భావకవిరాజు కృష్ణశాస్త్రిగారికి సుస్వాగతం" - అని శర్మ స్వాగత వచ నాలు పలికేసరికి సభాప్రాంగణం కరతాళ ధ్వనులతో మారుమోగింది. స్తంభించిన సాగరం ఒక్కసారిగా గర్జించినట్టని పించింది నాకు. జీవితంలో శర్మలా అంతమంది ప్రేక్షకుల ముందు నిలబడి ఒక్క నిమిషం మాట్లాడినా జన్మ ధన్యమే అనుకున్నాను.

ఆనాడు కృష్ణశాస్త్రిగారు ఉపన్యా సించారు. అది ఉపన్యాసం కాదు-భావ కవితా భారతి వీణ చేబూని భావ గేయా లాపనలో సభను ఓలలాడించింది. అదీ ఆయన ఉపన్యాస విన్యాసం.

ఆ ఉపన్యాసం వింటున్నంతసేపూ నన్ను నేను మరిచిపోయాను. నేనేకాదు సభంతా తన్మయత్వంలోనే వుంది. తొలి సారిగా తెలుగు కవితలోని మాధుర్యం చవిచూశాను. భావకవితలోని మధుర భావనలను తరచి తెలుసుకున్నాను. అలా సాంస్కృతిక కార్యక్రమాల తొలిరోజు గడిచి పోయింది. ఆ మర్నాడు పుస్తకాల షాపుకు వెళ్ళి కృష్ణశాస్త్రిగారి గేయకావ్యా లను కొనుక్కున్నాను. ఒక్క నిమిషం కూడా వృధా చేయకుండా సాయంకాలం దాకా చదువుతూనే వున్నాను.

సాయంత్రం మళ్ళీ సభకు హాజర య్యాను. ఆనాడు మహాకవి శ్రీశ్రీ ముఖ్య అతిథి, మహా ప్రస్థానంలోని గేయాలను ఆలపించారాయన. కృష్ణశాస్త్రి భావ కవి త్వానికీ, శ్రీశ్రీ అభ్యుదయ కవిత్వానికీ ఎంతో తేడా కనిపించింది. రెండూ కవి తలే. ఇద్దరూ కవులే. భావాలు వేరు. కవితా లక్ష్యాలు వేరు. భావకవి మనిషి యొక్క హృదయా వేదనల గురించి వర్ణిస్తే, అభ్యుదయ కవి మనిషి మనుగడ గురించీ, తరతరాల వర్గ సంఘర్షణ గురించీ వాపోయాడు.





నాకు ఇద్దరు కవులూ నచ్చారు. ఇద్దరి కవితా ధోరణులూ నచ్చాయి.

ఆ మరుసటి రోజున శ్రీశ్రీ మహా ప్రస్థానం కూడా కొనుక్కున్నాను.

మిగిలిన అయిదు రోజులూ ఇంకా ఎందరో కవులూ, కళాకారులూ, పండితులూ సభలకు వచ్చారు. ఉపన్యసించారు.

ఏడాది పొడుగునా మేం కాలేజీలో చదువుకున్నది ఒక యెత్తు, సాంస్కృతిక వారోత్సవాలలో నేర్చుకున్నది ఒక యెత్తు.

అలా ఆ సాంస్కృతిక వారోత్సవాలు నన్ను ఎంతగానో ప్రభావితుడిని చేశాయి. తెలుగు సాహిత్యం మీద అభిరుచిని పెంచాయి. కళల మీద ఆసక్తిని కలిగించాయి. నాటకం అంటే యేమిటో తెలియచెప్పాయి. నటించాలన్న కోరిక కలిగించాయి. చదివి తెలుసుకోవాలన్న ఉత్సుకతను రేకెత్తించాయి.

నేను సైన్సు విద్యార్థినే అయినా చదవడం ప్రారంభించాను. ఎన్నో తెలుగు నవలలు, కవితలు చదివాను. చదివాక నాకూ రాయాలన్న కోరిక పుట్టింది. రాయలేనేమోనన్న భయమూ వుంది. చాలా కాలం రాయాలనుకుంటూనే రాయలేదు. కొన్నాళ్ళ తర్వాత రాశాను. కానీ యెవరికీ చూపించలేదు. చూపిస్తే నవ్వుతారన్న భయం. ఏ పత్రికకీ పంపలేదు. పంపిన ఏ పత్రికలూ ప్రచురించవన్న అనుమానం. అలా రోజులు గడుస్తున్నాయి.

నాకు ఇద్దరు ముగ్గురు కొత్త స్నేహితులు కలిశారు. లాంగ్వేజి క్లాసుల కోసం ఆర్ట్సు కాలేజీకి వెళ్ళేవాళ్ళం. వెళ్ళేటప్పుడు నా వెంట కొత్తగా పరిచయమయిన స్నేహితులు కూడా వచ్చేవారు. వాళ్ళు గోపాలం, రాంబాబు. నన్ను రాంబాబు సైకిలు మీద ముందు కూర్చోబెట్టుకునేవాడు.

రాంబాబు, గోపాలం బలే అల్లరిచేసేవారు. క్లాసులోనూ, బయటా కూడా వాళ్ళ అల్లరికి అడ్డూ అదుపూ వుండేదికాదు. ముఖ్యంగా తెలుగు క్లాసులో రెచ్చిపోయేవాళ్ళు వాళ్ళిద్దరూ. పిల్లికూతలూ, పిచ్చి జోకులూ వాళ్ళకి పరిపాటి. కానీ క్లాసంతా నవ్వేవారు. నవ్వేకొద్దీ రెచ్చిపోయేవారు వాళ్ళు. అక్కడితో ఆగకుండా అమ్మాయిలకు 'నిక్ నేమ్స్' పెట్టడం, ఒంటరిగా కనబడితే "ఏం పాపా కులాసా?" అనడం లాంటి అల్లరి కూడా వాళ్ళకలవాటు. కొత్తలో వాళ్ళ వెంటవున్న నాకు కాస్త ఇబ్బందిగా వున్నా, రాను రాను నాకూ అలవాటయింది వాళ్ళ ధోరణి.

ఒక రోజున రాంబాబు, గోపాలం, నేనూ సరిగ్గా అమ్మాయిల వెనక బెంచీలో కూర్చున్నాం. మా ముందు అమ్మాయిల బెంచీలో రాజకుమారి, కస్తూరి, ఇంకా కొంతమంది అమ్మాయిలూ కూర్చున్నారు.

కస్తూరి చాలా అందంగా వుంటుంది. చక్కని శరీరచ్ఛాయ, మెరిసే కళ్ళు, నవ్వితే సొట్టలుపడే బుగ్గలు, పిరుదుల కిందకు దిగిన వాలుజడ...ఇన్ని అందాలు వున్నా అలంకరణలో ఆడంబరం ఎక్కడా కనబడేదికాదు. చాలా సింపుల్‌గా వుండేది. ముక్కుమీద మాత్రం ఎడమ పక్క చింతగింజంత పుట్టుమచ్చ వుంది. ఆ పుట్టుమచ్చంటే నా కిష్టం. పుట్టుకతోటే దేవుడు పెట్టిన బేసరిలా అనిపించేది నాకు. ఆ మచ్చను చూసి

మా రాంబాబు కస్తూరికి 'చింతపండు' అని నిక్‌నేమ్ పెట్టాడు.



ఆ రోజున కస్తూరి ఒకే ఒక గులాబీ పువ్వును వోరగా తలలో తురుముకొని ఆణిముత్యంలా ముస్తాబై కూర్చుంది మా ముందు బెంచీలో. రాంబాబు కళ్ళు కుట్టాయి.

"చింతపండుకి తెలియకుండా గులాబీ

పువ్వుని తీయగలవా?" అని నా చెవులు కొరికాడు.

నన్ను యెవరినో హత్య చెయ్యమన్నట్టు ఉలిక్కిపడి చూశాను రాంబాబు మొహంలోకి. రాంబాబు నా ముఖంలోని భయాన్ని గమనించాడు.

'నువ్వింక చచ్చినా ఎదగవు, నీ బతుకింతే' అన్నట్టు చూశాడు నన్ను రాంబాబు.

నా అహం దెబ్బతింది. తెలుగు లెక్చరరు పాఠం చెప్పుకొని పోతూనే వున్నారు. ఎవరు విన్నా, వినకపోయినా ఆయన పట్టించుకోరు. ఎన్ని పేజీలు పీరియడుకి అయిపోయాయి అన్న లెక్కే తప్ప ఎంతమందికి అర్థమయిందన్న సమస్య ఆయనకు లేదు. ఆయన



ధోరణి ఆయనది.

'చింతపండు' తలలోని గులాబీని ఎలా తస్కరించాలి అన్నది నా సమస్య. లేకపోతే నన్ను మరీ చేతకాని వాడిగా కట్టేస్తాడు రాంబాబు.

మొత్తానికి కష్టం మీద రాంబాబు, గోపాలంల మద్దతుతో వాళ్ళ ధైర్యం

కూడా ఎరువు పుచ్చుకొని చాలా చాక చక్యంగా చింతపండు (కస్తూరి) తలలోని గులాబీని తీసేశాను. ఆ కార్యక్రమం పూర్తయేసరికి నాకు ముచ్చెమటలూ పోశాయి. ఎక్కడ కస్తూరి కెవ్వుమం టుందోనని నా భయం. దేవుడి దయవల్ల కస్తూరి కిష్మనలేదు.

గోపాలం, రాంబాబు నన్ను అభినం దించారు. నేను ఎదిగినట్టు ఒప్పుకున్నారు. ఆ రోజున నన్ను హోటలుకు తీసికెళ్ళి నా దగ్గర పార్టీ తీసుకున్నారు.

మర్నాడు కెమిస్ట్రీ ప్రాక్టికల్స్. కస్తూరి నా బేచ్‌లోనే వుంది. నా కెదురు గానే కూర్చుంది కెమిస్ట్రీ లాబ్‌లో. నేను ప్రాక్టికల్సుకి వెళ్ళడమా, మానడమా అని తటపటాయించి చివరికి తెగించి వెళ్ళాను. అప్పటికే కస్తూరి లాబ్‌కి వచ్చే సింది. డిమాన్‌స్ట్రేటరు చెయ్యాల్సిన ప్రాక్టికల్ గురించి వివరిస్తున్నారు. ఆయన చెప్పడం పూర్తయిన తర్వాత మేం ప్రాక్టికల్సు ప్రారంభించాము. ఆయన ఎందుకో బయటికి వెళ్ళారు.

నేను కస్తూరి ముఖంలోకి చూశాను. అదే సమయానికి ఆమె కూడా నన్ను చూసింది. ఆమె చూపులకి తట్టుకోలేక నా చూపులు తిప్పేసుకున్నాను.

"గులాబీలంటే మీ కిష్టమా ?" అంది కస్తూరి ప్రాక్టికల్స్ చేసుకుంటూనే.

దొంగని తేలు కుట్టినట్టు-నన్ను కాద న్నట్టు వూరుకున్నాను.

"నారాయణరావుగారూ ! మిమ్మల్నే నేనడిగేది" అని రెట్టించింది కస్తూరి.

"ఏమిటండీ?" అన్నాను ఏమీ ఎరగని వాడిలా.

"గులాబీలంటే మీ కిష్టమా ?" అని మళ్ళీ రెట్టించింది.

'పువ్వులంటే ఎవరికైనా ఇష్టమేగా!' అనాలనుకున్నాను. కానీ అనలేదు.

"మా పెరట్లో నాలుగైదు గులాబీ మొక్కలున్నాయి. మా ఇంటికొచ్చి రోజూ ఓ పువ్వు కోసుకున్నా అభ్యంతరం లేదు. కాదంటే నేనే రోజూ ఒకటి తెచ్చి యిస్తాను. అంతేగాని, తలలో పెట్టుకున్న వాడిన పువ్వుల కోసం ఆశపడకండి" అంది కస్తూరి.

చెప్పుకి ముఖమల్ రుమాలు చుట్టి కొట్టినట్టనిపించింది నాకు.

"సారీ" అని మాత్రం అన్నాను.

ఆ తరవాత కస్తూరిని కన్నెత్తి చూడ లేక పోయేవాడిని. ఆమె నన్ను చూస్తే ఆమె చూపులనుంచి తప్పించుకునే వాడిని. ఆరోజు నుంచీ గోపాలం, రాంబాబులతో తిరగడం మానేశాను.

నాలో వచ్చిన మార్పు కస్తూరి గమ నించినట్టుంది.

"మీలో చాలా మార్పొచ్చింది" అంది కస్తూరి ఓ రోజున లాబ్‌లో.

నేను నవ్వి ఊరుకున్నాను.

"మీ కోసం ఓ గులాబీ తెచ్చాను" అని నా ముందు ఒక గులాబీ వుంచి "తలలోది కాదు. కొమ్మనుంచి తుంపి తెచ్చినది" అంది

తీసుకోవచ్చో, తీసుకోకూడదో నాకు తెలియలేదు. ఒక్క క్షణం తటపటా యించి, తీసుకొని "థాంక్స్" అన్నాను.

ఆమె చిన్నగా నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నారు ?" అని అడిగాను

"సాధారణంగా మగవాళ్ళు పువ్వులు తెచ్చి ఆడవాళ్ళకి యిస్తారు. అలాంటిది నేను తెచ్చి మీకు యివ్వడం తలుచు కుంటే మనిద్దరిలో ఎవరు..." అని

పూర్తి చేయబోయేలోపున ఆమె ముఖం లోకి చూశాను. ఆమె నన్ను చూడటం లేదు కానీ కొంటెగా నవ్వుకుంటోంది. ఆ నవ్వులు కొరడా దెబ్బల్లా అనిపించాయి నాకు. ఆమె నన్ను యింకా వెంటాడుతూనే వుందని గ్రహించాను. ఆమె ఒంటరిగా కనిపిస్తే జరిగినదానికి క్షమార్పణ చెప్పుకోవాలని నిర్ణయించుకున్నాను. ఆ సంవత్సరం ఆఖరిలో వీలు చూసుకొని క్షమార్పణ కూడా చెప్పేశాను. అలా మేము స్నేహితులమయ్యాము.

నా జీవితంలో కలిసిన మొదటి స్నేహితురాలు కస్తూరి. అంతవరకూ ఏ అమ్మాయితోటీ అంత పరిచయంగా ఎప్పుడూ మాట్లాడలేదు. మొదటి సంవత్సరం పూర్తయింది. వేసవిశలవులకు యింటికి వెళ్లిపోయాను. శలవుల్లో ఒకటి రెండు సార్లు కస్తూరికి ఉత్తరం రాయాలనిపించింది. ఏం రాయాలో తెలియక, తీరా రాసే ఆ ఉత్తరం ఆమె పెద్దవాళ్ళ చేతుల్లో పడి యేం గొడవలొస్తాయోననే భయంచేత తెగించి రాయలేక పోయాను.

శలవులు పూర్తయి వెళ్ళిన తర్వాత కస్తూరితో యేవేవో మాట్లాడాలనుకున్నాను. ఎందుకో ఆమె అన్నా, ఆమె పేరు అన్నా పిచ్చి యిష్టం యేర్పడింది. నేను ఒంటరిగా వున్నప్పుడు, ఏమీ తోచనప్పుడు నాలో నేనే "కస్తూరి" అనుకునేవాడిని.

శలవులు యెప్పుడయి పోతాయా, ఎప్పుడు కాలేజీ తెరుస్తారా, ఎప్పుడు కస్తూరిని చూస్తానా అని మనసు తహతహ లాడేది. కస్తూరి నుంచి నేను ఏం ఆశిస్తున్నానో నాకు యిదమిద్ధంగా తెలీదు. అది ప్రేమో, స్నేహమో - అసలు ప్రేమంటే యేమిటో నాకుస్పష్టంగాతెలీదు. కానీ ఆమెను చూడాలన్న తహతహ, ఏదో మాట్లాడాలన్న ఆశ, అన్నిటికీ మించి ఆమెతోనే యెక్కువసేపు కాలక్షేపం చేయాలి అన్న కోరిక మాత్రం రోజు రోజుకీ పెరిగిపోతున్నాయి,

చివరికి కాలేజీ తెరిచారు.

సెకండియరు ఇంటర్ చదవడానికి మా వూరు నుంచి బయలుదేరి కాకినాడ వెళ్ళాను. కాలేజీకి వెళ్ళి కస్తూరి కోసం వెయ్యి కళ్ళతో ఎదురు చూశాను.

కస్తూరి వచ్చింది.

ఆమెను చూసి నవ్వాను.

బదులుగా ఆమె కూడా నవ్వింది. కానీ ఏమీ మాట్లాడలేకపోయాను.

రోజులు గడుస్తున్నాయి.

క్లాసులో కస్తూరి కనిపించకపోతే నాకు యేదోలా వుండేది. ఆమె కోసమే కాలేజీకి వెడుతున్నాననిపించేది.

చాలా జాగ్రత్తగా ముస్తాబయ్యేవాడిని. రోజుకి ఒక్కసారైనా ఆమె కంటపడేలా మసిలేవాడిని. ఎప్పుడైనా వీలుచిక్కి ఒక్కసారి ఆమెతో మాట్లాడినా, ఒక్కసారి మా ఇద్దరి చూపులూ కలిసినా, కనీసం చిరునవ్వులతో పలుకరించుకున్నా యెంతగానో మురిసిపోయేవాడిన్ని.

ఆ సంవత్సరం మళ్ళీ సాంస్కృతిక వారోత్సవాలు జరుగుతున్నాయి.

ఆ వారం రోజులూ ఎన్నో విషయాలు తెలుసుకుందుకు అవకాశాలు కలగడం మాత్రమే కాకుండా, ఎన్నాళ్ళనుంచో మాట్లాడదామనుకున్న స్నేహితులతోటీ, స్నేహితురాళ్ళతోటీ కూడా మాట్లాడేందుకు మంచి అవకాశం.

ఒకటి రెండుసార్లు కస్తూరితో మాట్లాడాను. కస్తూరి కనుమరుగైనప్పుడు

ఏవేవో మాట్లాడాలనుకునే వాడిని. 'మిమ్మల్ని చూడందే నేనుండలేను. డిగ్రీకోర్సు మనిద్దరం ఒకటే కాలేజీలో చదువుకుందాం. ఆ తరవాత కూడా కలిసేవుందాం' అని ఆమె చేతిని నా చేతిలోకి తీసుకొని చెప్పాలని ఆశ. తీరా ఆమె ఎదురైతే నాకు నోరు పెగిలేది కాదు. మాటలు గొంతుకలోనే వుండి పోయేవి.

వారోత్సవాలలో ఒక రోజున కస్తూరి వీణ వాయించింది. అందరూ మెచ్చుకున్నారు. నిజంగా చాలా బాగా వాయించింది. ఆమె వీణ కచేరీ విన్న తరవాత ఆమె ముందు నేనెంత చిన్నవాడినో అర్థమయింది.

కచేరీ పూర్తి కాగానే తొందరగా స్టేజి వెనక్కి వెళ్ళి కస్తూరిని అభినందించాను. ఆమె నాకేమీ కాకపోయినా 'నా కస్తూరి ఎంత గొప్పది' అనుకున్నాను.

ఆ మరునాడు మేం నాటకం ఆడుతున్నాం, భమిడిపాటి కామేశ్వరరావుగారి 'పెళ్ళి ట్రెయినింగు'. అది మంచి ప్రహసనం, అందులో నా పాత్ర అరవై యేళ్ళ వృద్ధుడు శాసయ్య. నా వయస్సు పద్దెనిమిదే అయినా అరవైఏళ్ళవాడుగా తయారయ్యాను. తెల్లజుట్టు, వంగిన నడుము, ఓ బంగారపు పన్ను – అదీ వేషం. స్టేజిమీద కొచ్చాను. ఎదురుగా వున్న అమ్మాయికి హితబోధ చెయ్యాలి. అది మర్చిపోయి జనంలో కస్తూరి వుందో లేదోనని వెదకడం మొదలెట్టాను. ఫుట్ లైట్స్ మూలంగా ఆడిటోరియంలోని జనం స్పష్టంగా కనిపించడం లేదు. నేను ఎంతసేపటికీ డైలాగు మొదలు పెట్టక పోవడంతో స్టేజి మీద నాతోబాటే అమ్మాయి వేషంలోవున్న రామకృష్ణ కంగారు పడుతున్నాడు.

జనంలో కలకలం బయలుదేరింది. ఆడిటోరియంలో వున్న రాంబాబు "గొంతు విప్పరా నాన్నా! రామకృష్ణగాడు కంగారు పడుతున్నాడు" అని అరిచాడు. అందరూ ఫక్కున నవ్వారు.

కస్తూరిని వెతికే కార్యక్రమం మానేసి డైలాగు మొదలు పెట్టాను.

ఆడిటోరియం కంట్రోలులోకివచ్చింది. నాటిక రసవత్తరంగా సాగింది.

నాటిక పూర్తికాగానే చాలా మంది స్టేజి వెనక్కి వచ్చి నన్ను మెచ్చుకున్నారు. కాని కస్తూరి మాత్రం రాలేదు.

చాలాసేపు చాలా ఆశగా ఎదురు చూశాను కస్తూరి కోసం.

చివరికి మేకప్ తీసేసి, ఆడిటోరియంలోకి వచ్చాను.

కస్తూరి కనిపించింది.

నవ్వింది.

నవ్వులతోనే అభినందించింది.

చాలా హేపీగా ఫీలయ్యాను. కానీ, నాకు తృప్తిలేదు. కస్తూరిలా వీణ కచేరి చేయలేకపోయినా ఒక్కడినే పాడాలనుకున్నాను.

మర్నాడు నేనే ఒక పాట రాసుకొని కల్చరల్ సెక్రటరీని బతిమాలి లిస్టులో నాపేరు రాయించి స్టేజి ఎక్కేశాను. నేను రాసిన పాట కస్తూరిని దృష్టిలో పెట్టుకునే! మైకు ముందు నిలబడ్డాను. పెద్ద గాయకుడిలా గొంతు సవరించుకున్నాను. ముందు నాలో నేనే ఆలపించుకున్నాను.

పాట మొదలు పెట్టాను,

"కవ్వించే కన్నులదానా
సొట్టలడే బుగ్గల దానా
నువ్వంటే నాకెంతో యిష్టం




నువ్వు లేకుంటే నా బతుకే కష్టం" అనే పల్లవి పాడేసరికి జనం చప్పట్లూ, ఈలలూ.

చరణం అందుకున్నాను.

"నీ జడలో గులాబి చూస్తే

నా మనసే పూవై పూస్తే

నా కలలో నువ్వే వస్తే"...అనేసరికి ఆడిటోరియంలో అల్లరి మరీ పెరిగి పోయింది.

ఎవరో కర్టెను దించేశారు.

ఆ తర్వాత ఆడిటోరియంలోకి వెళ్ళి కస్తూరిని చూడాలనిపించలేదు.

తిన్నగా రూంకి వెళ్ళిపోయాను. నేను నాటకం ఆడొచ్చు, కావాలంటే పాటలు రాసి దాచుకోవచ్చు, కానీ స్టేజియెక్కి పాడి జనాన్ని హింసించకూడదని నిర్ధారణ చేసుకున్నాను.

నాలుగైదు రోజులు కస్తూరి కనిపించినా తప్పించుకొని తిరిగాను.

చివరికి ఒకనాడు కస్తూరి, నేను ఎదురుపడ్డాం.

నవ్వుతూ "పాట బావుంది" అంది.

'నిజంగానా ?' అన్నట్టు ఆమె ముఖంలోకి చూశాను.

"పాడటంకాదు, రాయడం" అంది.

నేనో వెర్రినవ్వు నవ్వాను.

అలా ఆ సంవత్సరం పూర్తయింది. పరీక్షలు రాశాము.

కస్తూరికి, నాకు పరిచయం బాగా పెరిగింది. ఎంత పరిచయం పెరిగినా చెప్పుకోతగినంత చనువు పెరగలేదు.

పరీక్షలు పూర్తయాక ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయాం. ఆ శలవుల్లో నేను రెండు కథలు రాశాను. అచ్చయ్యాయి కూడా.

డిగ్రీ కోర్సుకి విశాఖపట్నం వచ్చేసరికి నాకు వున్న రంగస్థలానుభవం, రచనానుభవం, జీవితానుభవం పై చెప్పినవన్నీను.

ప్రచురితమయిన నా కథల గురించీ, నా రంగస్థలానుభవం గురించీ, తెలిసిన నా మిత్రులు విశాఖపట్నం కాలేజీలో జరుగుతున్న యూనియన్ ఎన్నికల్లో కల్చరల్ సెక్రటరీగా పోటీ చేయమని నన్ను బలవంత పెట్టారు. ముందు మొహమాటపడ్డా చివరికి ఒప్పుకున్నాను. పోటీకి నిలబడ్డాను.

అలా పోటీకి నిలబడ్డం మూలంగా సముద్ర తీరాన నేను చూసిన అభినేత్రిని లేడీస్ వెయిటింగు రూంకి వెళ్ళి అమ్మాయిల ఓట్లకోసం కలిసే అవకాశం కలిగింది.




ఎన్నికల ప్రచారం ముమ్మరంగా సాగుతోంది. జనరల్ ఎలక్షన్లను మరిపించేటంత హడావిడిగా వుంది. కాలేజీ వాతావరణం. వివిధ పదవులకు పోటీ చేస్తున్న అభ్యర్థుల పేర్లు గోడలమీదా, బేనర్లమీదా, ఆఖరికి రోడ్లమీద కూడా రాశారు. కాలేజీలోకి జీపులు, చిన్న కార్లు కూడా ఎన్నికల బేనర్లను కట్టుకొని హడావిడిగా తిరుగుతున్నాయి. క్లాసులు అంతంత మాత్రంగానే జరుగుతున్నాయి. గతంలో అమ్మాయిలను అల్లరిచేసేవాళ్ళు కూడా

ఏదో పఠాన ఎన్నికల ప్రచారంలో పాల్గొనడం చేత బుద్ధిగా మసులుకుంటున్నారు.

ఎప్పుడూ జనం ముందుకురాని రాజకీయ నాయకులు ఎన్నికల ముందు ఇంటింటికీ వచ్చి వోటర్లకు వంగి వంగి నమస్కారాలు చేస్తున్న ధోరణిలో వుంది వాతావరణం.

పోటీ రెండు పార్టీల మధ్య డెమాక్రాటిక్ స్టూడెంట్స్ యూనియన్, స్టూడెంట్స్ ఫెడరేషన్, స్టూడెంట్ కాంగ్రెస్ వున్నా డెమోక్రాటిక్ స్టూడెంట్స్ యూనియన్‌ను సపోర్టు చేస్తోంది. ఇండిపెండెంట్ అభ్యర్థులు ఎవరూ లేరు.

ఒక రోజు సాయంత్రం కాలేజీ స్టూడెంట్స్ అందరూ ఓపెన్ ఎయిర్ స్టేడియం దగ్గర సమావేశమయ్యారు. ప్రిన్సిపాల్ అధ్యక్షత వహించారు. పోటీ చేస్తున్న అభ్యర్థులంతా ఆ రోజున ఉపన్యసించాలి. తాము ఎన్నికయితే చేయ దలచుకున్న దేమిటో విద్యార్థులకు వివరించాలి.

అభ్యర్థులందరూ మాట్లాడుతున్నారు ఒకరి తర్వాత ఒకరుగా. నా ప్రత్యర్థి వాసుదేవరావు మాట్లాడాడు. "నిజంగా కళారంగం ప్రాణం పోసుకోవలసింది కళాశాలల్లోనే" అన్నాడు. అందుకు తాను శాయశక్తులా కృషి చేస్తానన్నాడు.

నేను మాట్లాడవలసిన సమయం వచ్చింది. వేదిక మీదకు వెళ్ళాను. పి. ఆర్. కాలేజీ అధ్యక్షుడు శర్మలా మైకుముందు నిలబడి కొన్ని క్షణాలపాటు సభనంతా కలియచూశాను. ఎందుకో సభను నిశ్శబ్దం ఆవతరించింది. నాకు కొండంత ధైర్యం వచ్చింది. అంతవరకూ ఏం మాట్లాడాలో నేను పెద్దగా ఆలోచించ లేదు. అంతటి నిశ్శబ్దం ఆవరించిన సభను చూసిన తర్వాత ఏదో ఒకటి చెయ్యాలని పించింది నాకు.

"శివాజీ ఏకపాత్రాభినయం చేస్తాను" అని మొదలు పెట్టాను.

ఆ ఏకపాత్రాభినయానికి నాకు పి. ఆర్. కాలేజీలో ప్రథమ బహుమతి వచ్చింది.

ఈనాటికీ నాకు ప్రతీ అక్షరం గుర్తుంది. ఎక్కడా అడ్డూ, అదుపూ లేకుండా పాత్రలో లీనం అయిపోయాను. ఉరకలు వేసే ఆవేశంతో అక్షరం పొల్లు పోకుండా, ఎక్కడా తడబడకుండా శివాజీ పాత్ర నభినయించాను. ఏకపాత్రాభినయం పూర్తికాగానే ముందుగా చప్పట్లు కొట్టింది వేదికమీద వున్న ప్రిన్సిపాల్ గారు. సభ యావత్తూ వారందించిన చప్పట్లనందుకుంది. నా మనస్సు ఆనందంతో ఉప్పొంగిపోయింది.

"అధ్యక్షా! మిత్రులారా!" అన్నాను.

సభలో మళ్ళీ నిశ్శబ్దం ఆవరించింది. నేను ఏం మాట్లాడినా వినడానికి సిద్ధంగా వుంది సభ.

"నేను సాంస్కృతిక కార్యదర్శి పదవికి పోటీ చేస్తున్నాను. సాహిత్యం, లలిత కళలు, సాంస్కృతిక కార్యదర్శి బాధ్యతలు. ఆ బాధ్యత వహించే వ్యక్తికి కావలసిన అర్హతలు రాజకీయ చతురత కంటే స్పందన గల హృదయం, రసాస్వాదనా శక్తి. యివి నాకు కొంతవరకూ వున్నాయని నమ్మకం. చాలకపోతే మీ దగ్గరనుంచి నేర్చుకుందామన్న ఆశ. కళలకు పార్టీ గోడలు కానీ, ప్రాంతీయ సరిహద్దులు కానీ, భాషా విభేదాలు కానీ





లేవు. పుట్టిన ప్రతి మనిషికి హృదయం వుంది. ప్రతి హృదయానికి రసాస్వాదనా శక్తి వుంది. కళలు మనిషి మనుగడలో అంతర్భాగాలు. ఒక జాతి ఔన్నత్యానికి ప్రతీకలు. అర్హుణ్ణి ఎన్నుకోవడం మీ బాధ్యత" అని సభకు నమస్కరించి వేదిక దిగాను.

మళ్ళీ సభలో కరతాళ ధ్వనులు.

మిత్రులంతా నా ఉపన్యాసానికీ, నా ఏకపాత్రాభినయానికీ ముగ్ధులై అభినందించారు.

సభ ముగిసింది.

అందరూ వెళ్ళిపోతున్నారు.

అభినేత్రి సరాసరి నా దగ్గరకొచ్చింది.

"మీరింత ఆర్టిస్టని నేననుకోలేదు" అంది నవ్వుతూ.

ఆ నవ్వులోనూ, ఆమె మెరిసే కళ్ళలోనూ ఎన్నెన్నో అభినందనలు ఇమిడి వున్నాయి.

ఆమె అందం నన్ను ఆకర్షించింది ఒకనాడు. వ్యక్తిగా నేనామెను ఆకర్షించానో లేదో నాకు తెలీదు. కానీ, ఒక నటుడిగా నేనామెను ఆకర్షించానన్న నమ్మకం కలిగింది నాకు.

మరునాడు పోలింగు జరిగింది. చాలా పెద్ద మెజారిటీతో నేను నెగ్గాను. అందరూ నన్ను అభినందించారు. లేడీస్ వెయిటింగు రూంకి వెళ్ళి అభినేత్రి, ఆమె స్నేహితురాళ్ళు ఇచ్చిన సహకారానికి కృతజ్ఞతలు చెప్పాను. గెలుపు మనిషికి ఎంత ఆనందాన్ని ఇస్తుందో, యెంత అణకువను పెంచుతుందో తొలిసారిగా ఆ రోజే తెలుసుకున్నాను.

గురజాడ వర్ధంతి వచ్చింది. ఆ మహాకవి వర్ధంతి ఆ కాలేజీలో ప్రతి సంవత్సరం చాలా బాగా చేస్తారు. ఆ సంవత్సరం కూడా వర్ధంతి ఎంతో ఘనంగా జరిగింది. అభినేత్రి, మరి నలుగురు అమ్మాయిలు 'దేశమును ప్రేమించుమన్నా' అన్న పాటను బృందగానంగా పాడారు. అభినేత్రి స్వయంగా 'పుత్తడి బొమ్మ పూర్ణమ్మ' పాట కూడా పాడింది. ఆమె అంత గొప్పగా పాడగలదని ఆ రోజునే నాకూ, కాలేజీలో అందరికీ తెలిసింది. గత సంవత్సరంలో ఆమె ఏ సాంస్కృతిక కార్యక్రమాలలోనూ పాల్గొనలేదు. మొట్టమొదటిసారిగా వేదిక ఎక్కి అందరినీ ముగ్ధుల్ని చేసింది. పి. ఆర్. కాలేజీలో నేను పాడినప్పుడు జరిగిన రసాభాస గుర్తుంచుకొని నేను పాటల జోలికి పోలేదు. 'ముత్యాల సరాలు' మాత్రం కంఠస్థం చేశాను.

'కన్యాశుల్కం'లోని మొదటి సీను ఒక చిన్న వెంకటేశాన్ని అడ్డుపెట్టుకొని నేను గిరీశం పాత్ర ధరించి రక్తి కట్టించాను.

దాంతో అభినేత్రికీ, నాకూ పరిచయం పెరిగింది.

కార్యక్రమాలు పూర్తయిన తర్వాత అభినేత్రినీ, మిగిలిన అమ్మాయిలనీ యిళ్ళకు దిగబెట్టాల్సి వచ్చింది. అందరినీ దిగబెట్టి చివరకు అభినేత్రిని దాబా గార్డెన్స్‌కు తీసుకువెళ్ళాను. ఆమె దాబా గార్డెన్స్‌లో వాళ్ళ అక్కగారి యింట్లో వుంటోంది. ఇంటి దగ్గర టాక్సీ దిగిన తర్వాత లోపలికి రమ్మని ఆహ్వానించింది నన్ను.

"పొద్దుపోయింది. మరోసారి వస్తానండి" అని చెప్పి నేను తిరిగి హాస్టలుకి వెళ్ళిపోయాను.

ఆ రాత్రంతా నాకు నిద్ర పట్టలేదు.



ఏదో చెప్పరాని ఆనందం. 'మనిషికి మరీ ఆనందం కలిగినా, విషాదం కలిగినా స్థిమితం వుండదు కాబోలు' అనుకున్నాను.

మర్నాడు కాలేజీకి వెళ్ళాను. అభినేత్రి వరండాలో కనిపించింది.

"మీరు గిరీశం పాత్ర చాలా బాగా చేశారట. మా ఫ్రెండ్స్ అందరూ అంటున్నారు. మా అక్క కూడా మీతో చెప్పమంది" అంది అభినేత్రి.

"నిన్న మీ అక్కయ్యగారు కూడా వచ్చారా?"

"ఆఁ. వచ్చింది. ఫంక్షను పూర్తయ్యేసరికి ఆలస్యం అవుతుందని వెళ్ళిపోయింది."

ఆ తరవాత నాకు ఏం మాట్లాడాలో తెలియక "వస్తాను. క్లాసుకి టైం అయింది" అని ముందుకు నడిచాను.

"నేనూ వస్తున్నాగా" అంటూ అభినేత్రి కూడా నా వెనకే వచ్చింది.

ఇద్దరం కలసి అలా క్లాసులోకి వెళ్ళడం నాకు కొంత గర్వంగానూ వుంది, ఓపక్క సిగ్గుగానూ వుంది.

ఆరోజు నుంచీ రోజూ ఏదో సమయంలో క్లాసురూం నుంచి లాబ్‌కి వెళ్ళేటప్పుడో, ఇంటికి వెళ్ళేటప్పుడో అభినేత్రి నన్ను పలకరిస్తూనే వుండేది.

అలా పరిచయం చనువయింది–మొగ్గ విరిసి పువ్వు అయినట్టు.

హెర్బేరియం కోసం రకరకాల మొక్కల్ని సేకరించడానికి తలుపులమ్మ లోయకు ఎక్స్‌కర్షన్ వెళ్ళాం మా క్లాసు వాళ్ళమంతా. ఎత్తైన కొండ ఎక్కాలి. పైనుంచి కిందకు పారుతున్న సెలయేరు అంచునే నడవాలి. అది నలిగిన బాట కాదు. మా లాంటి కాలేజీ విద్యార్థులే ఆ ప్రాంతానికి వెడుతూ వుంటారు. కాకపోతే ఎండిన పుల్లలు ఏరుకునేందుకు ఆ ప్రాంతంలో వున్న కొంతమంది ఆడవాళ్ళు కూడా వస్తూ వుంటారు.

పుట్టినప్పటి నుంచీ తారురోడ్ల మీదా, సిమెంటు రోడ్లమీదా తప్ప అడుగు పెట్టని మా క్లాసు అమ్మాయిలకు ఆ గతుకులలో ఆ కొండ ఎక్కడం కష్టంగానే వుంది. హైహీల్డ్ చెప్పులు విప్పక తప్పలేదు. కుచ్చెళ్ళు చేత బట్టుకొని గతుకుల రాళ్ళ మీద నడవడంలో ఒక్కోసారి ఓ అమ్మాయితూలి పక్కనేవున్న అమ్మాయి భుజాన్ని ఆసరాగా తీసుకుంటోంది. అలా తూలినప్పుడు పడిపోతామేమో అన్న భయంతో అరిచే తియ్యని అరుపు, ఆ అరుపు విని తోటి అమ్మాయిలు నవ్వే నవ్వులు – చూడ్డానికీ, వినడానికీ కూడా బలే సరదాగా వున్నాయి. అలా మేమంతా కలిసి కొండ పైకి ఎక్కుతున్నాం. మాలో కొంతమంది కెమెరాలు కూడా తెచ్చారు. ఫొటోలు తీస్తున్నారు. ఎవరికి నచ్చిన అమ్మాయిని వాళ్ళు ఆ అమ్మాయి చూడకుండా ఫొటో తీస్తున్నారు. కొంతమంది రకరకాల మొక్కల్ని ఏరుకుంటున్నారు.

కొండ సగం దాకా ఎక్కేసరికి అందరికీ అలసటగానే వుంది. అమ్మాయిలయితే తోటకూర కాడల్లా వాడిపోయారు. ముస్తాబులు చాలా వరకు చెదరిపోయాయి. కొందరమ్మాయిలు నడవలేక 'కాస్త ఆగి వెడదామోయ్' అంటూ అక్కడక్కడ ఒక చదునైన రాయిని చూసుకొని చతికిల పడ్డున్నారు. అబ్బాయిలు శక్తినంతా కూడగట్టుకొని అమ్మాయిల ముందు పరుగులు తీస్తూ

బలప్రదర్శన చేస్తున్నారు. నేను మాత్రం నిజంగానే కాళ్ళు లాగి ఓ రాయిమీద కూర్చున్నాను. కాస్త ఎడంగా అభినేత్రి కూర్చుంది. ఆమె ముంగురులు రేగాయి. ముఖాన ముచ్చెమటలు పోశాయి. బొట్టు కాస్త కరిగింది. నెమ్మదిగా లేచి సెల ఏటిలో కాళ్ళూ, చేతులూ, మొహం కడుక్కొని పమిట కొంగుతో వొత్తుకుంది. ఆ క్షణంలో అభినేత్రి అలసిపోయిన అభిసారికలా వుంది.

"దాహంగా వుందర్రా" అంది అభినేత్రి. "ఎదురుగా సెలయేటి తేటనీరు వుండగా దాహంగా వుందని దిక్కులు చూస్తా వేమిటి?" అంది మరో అమ్మాయి.

"అవి తాగకండి. ఈ ప్రాంతంలో మలేరియా వుంది" అంటూ నా భుజాల నున్న వాటరు బాటిలు తీసి ఆమె చేతి కిచ్చాను.

రెండు గ్లాసులనీరు తాగి "థాంక్యూ" అంటూ వాటరు బాటిలు నా చేతికి యివ్వ బోయింది అభినేత్రి.

"నీ దాహం తీరితే సరిపోయిందా?" అంటూ వాటరు బాటిలు నా చేతికి చేర కుండానే మధ్యలోనే అందుకుంది మరో అమ్మాయి. అమ్మాయిలందరూ కలిసి నా వాటరు బాటిలు ఖాళీ చేసేశారు.

"సారీ, మీకు నీళ్లు మిగల్లేదు" అంటూ ఖాళీ బాటిలు నా చేతికందించింది అభినేత్రి.

కాస్సేపు సేద తీర్చుకొని కొండపైకి నడక తిరిగి ప్రారంభించాం. అప్పటికే మా వాళ్ళు కొందరు కొండపైకి చేరిపోయారు. కొంతమంది చెదురు మదురుగా మొక్కల్నీ, ఆకుల్నీ ఏరు కుంటున్నారు.

ఒక ఎత్తైన రాయి ఎక్కాల్సివచ్చింది. ఎలా ఎక్కాలో తెలియక అభినేత్రి దిక్కులు చూస్తోంది. మా క్లాసుమేటు హరి కాస్త చురుకైన వాడు. "నేను చెయ్యందిస్తాను. రండి" అని చేయి సాచాడు అభినేత్రికి.

"ఫరవాలేదులెండి" అని అభినేత్రి తన స్నేహితురాలు విశాల సహాయంతో రాయిని ఎక్కి నడిచింది.

నా కెందుకనో ఆమెను వదిలి గబగబా నడవబుద్ధి కాలేదు. ఆమెతోటే ఏదో పిచ్చాపాటీ మాట్లాడుతూ పక్కనే నడుస్తున్నాను. అభినేత్రి కాదన్నందుకు హరి అహం దెబ్బతింది. వేగంగా ముందుకు నడచి వెళ్ళిపోయాడు. అలా కొంత దూరం నడిచాం.

మళ్ళీ మరోఎత్తు ఎక్కాల్సి వచ్చింది. నేను మామూలుగానే ఎక్కేశాను. అభినేత్రి ఇదివరకటిలాగే నిలబడి దిక్కులు చూస్తోంది.

"ఏం? ఎక్కలేరా?" అన్నాను.

''పడిపోతానేమోనని భయంగా వుంది'' అంది ఆమె.

"ఫరవాలేదు. రండి !" అని చెయ్యి అందించాను.

ఎత్తుయెక్కి, తూలి మరో చేత్తో నా భుజాన ఆనుకుంది. "థాంక్యూ'' అంది.

''నో మెన్షన్'' అన్నాను ముకసరిగా.

ఆమె స్పర్శలో నేను పొందిన అనుభూతి అనిర్వచనీయం. ఆమె నా భుజాన ఆనుకున్నప్పుడు ఆమె ముఖంలో విరిసిన లేత సిగ్గులు అపురూపం. 'మళ్ళీ ఏదైనా ఎత్తైన రాయివస్తే బాగుండును' అనుకున్నాను కానీ రాలేదు. అలా కష్టం మీద కొండపైకి చేరుకున్నాం.

చుట్టూ పచ్చని చెట్లూ, చేమలూ. కింద పచ్చని పొలాలు. ఎక్కడో దూరంగా పాపిడిలాంటి నల్లని రోడ్డు, ఆ రోడ్డుమీద మేము వచ్చిన బస్సులు. ఆ




బస్సులను చూసింది అభినేత్రి.

"మళ్ళీ అంత దూరం నడవాలా మనం ?" అంది దిగులుగా.

"దిగులు పడకండి. దిగడం సులువే" అని ధైర్యం చెప్పాను.

అలసిన ఆమెను చూస్తే అది జాలో యేమో చెప్పలేను కానీ నాకు చాలా బాధగా వుంది. మరెవ్వరూ లేకపోతే ఆమెను ఎత్తుకొని నేను అలసినా ఆమె అలవకుండా కొండపై నుంచి కిందకు దించాలనిపించింది.

అది ఊహ మాత్రమే. ఆచరణకు సాధ్యంకాని వూహ. మొత్తం మీద సాయంత్రానికి అందరం కొండదిగి బస్సు లెక్కాం. రాత్రికి విశాఖపట్నం చేరు కున్నాం. మరుసటి రోజు కాలేజీ లేదు. సాయంత్రం దాకా విశ్రాంతి తీసుకొని ఇక ఊసుపోక హాస్టలు నుంచి బయటికి నడిచాను. అభినేత్రిని చూడాలనిపించింది. డాబా గార్డెన్స్ వైపు వెళ్ళాను. ఆమె ఇంటికి నేను చేరువవుతున్న కొద్దీ ఆమెను ఎలా పిలవాలో, ఎందుకు వచ్చానని చెప్పాలో అర్థం కావడంలేదు. ఒక్క క్షణం మౌనంగా ఆమె ఇంటి ముందు నిలబడ్డాను. ముందు కాంపౌండు వాలు, చిన్న యినుప గేటు. ఓ పక్క వొత్తుగా యెదిగిన బోగంవిలియ చెట్టు. మరోపక్క సన్నజాజులు. ఇంటి సింహద్వారానికి అందమైన నీలిరంగు తెర. ఆ తెర చిరుగాలికి వయ్యారంగా రెపరెపలాడు తూంటే ప్రశాంత సాయంత్రాన కృష్ణానది కదలికలా వుంది.

ఇనపగేటు తెరుచుకొని లోపలికి వెళ్ళాను. గుండె చిక్కబట్టుకొని, చెమాలుతో ముఖం వొత్తుకొని, పెదవులు తడి చేసుకొని "అభినేత్రిగారూ!" అని పిలిచాను.

తెర వొత్తిగించుకొని అభినేత్రి బయటికి వచ్చింది. ఆ సమయంలో నేను అక్కడికి వస్తానని ఊహించలేదు కాబోలు ఆమె.

క్షణం పాటు నివ్వెరపాటు, మరు క్షణంలోనే చిరునవ్వులతో ఆహ్వానం.

"రండి" అంటూ లోపలికి దారి చూపించింది.

గడప ముందే చెప్పులు విప్పేసి దేవి దర్శనానికి ఆలయంలో అడుగుపెట్టే భక్తుడిలా వినయంగా లోపలికి నడిచాను.

"కూర్చోండి" అంది కుర్చీ చూపిస్తూ.

'ఏమిటిలా వచ్చారు?' అని అభినేత్రి అడిగితే ఏమని చెప్పాలా అని ఆలోచించు కుంటున్నాను.

"ఇప్పుడే వస్తాను" అని చెప్పి అభినేత్రి లోపలికి వెళ్ళింది.

'ఈ క్షణానికి గండం తప్పింది' అనుకున్నాను. తలయెత్తి గదంతా కలయ చూశాను. ఇంటికప్పువైపు చూశాను. స్లాబు కాదు. దూలాల మీద కట్టిన తారసడాబా అది. ఆహాలులో పన్నెండు దూలా లున్నాయి ఓ గోడకి నర్స్ యూనిఫారం తగిలించివుంది. మరో పక్క ఎదురుగా వున్న అద్దాల బీరువాలో రకరకాల ఇంగ్లీషు మందులున్నాయి. గదికి ఒక మూలగా కిటికీ పక్కన టేబులు మీద అభినేత్రి పుస్తకాలున్నాయి. ఇంక ఆ గదిలో చూడాల్సినది ఏదీ మిగల్లేదు.

అభినేత్రి కాఫీ కప్పు తెచ్చి నా చేతి కందించింది. కప్పు అందుకొని "మరి మీరు ?" అన్నాను.

"నే నిప్పుడే తాగాను" అందామె.




"నో, అలా అంటేకాదు. ఫిఫ్టీ ఫిఫ్టీ'' అని నేను ఆమె అంగీకారం కోసం ఆగకుండానే సాసరులో సగం కాఫీపోసి ఆమె కందించాను.

ఆమె సాసరు అందుకొని కాఫీ తాగుతూ నన్ను చూసింది. ఆమె కనుల అందాలను చూసి 'ఈమె నిజంగా అభినేత్రే!' అనుకున్నాను.

ఏం మాట్లాడాలో అర్థంగాక గోడకు తగిలించి వున్న నర్స్ యూనిఫారంను చూస్తూ ''ఆ యూనిఫారం ఎవరిది?'' అని అడిగాను.

''మా అక్కది'' అంది ఆమె.

''మీ అక్క నర్సా?"

''అవును. కె. జి. హెచ్. లో"

"పేరు ?''

"వనజ"

''ఇంట్లో లేరా?''

"లేదు. ఈ రోజు నైట్ డ్యూటీ. మీరొచ్చేముందే వెళ్ళింది."

"మీ బావగారు ఏం చేస్తూ వుంటారు?"

"మా అక్కకి యింకా పెళ్ళికాలేదు''

"అలాగా !'' అన్నాను. 'వయస్సెంత?' అని అడగాలనుకున్నాను. సభ్యత కాదేమోనని అడగలేదు.

నేను కూర్చున్న కుర్చీ పక్కన ఓ చిన్న టేబిలు వుంది. దానిమీద నటరాజ విగ్రహం వుంది. ఆ విగ్రహం ముందు గజ్జెలున్నాయి. వాటిని చూశాను.

''నర్తకి మీరా? మీ అక్కా??" అని అడిగాను.

అభినేత్రి నవ్వుతూ "ఇదివరకు మా అక్క, ఇప్పుడు నేను" అంది.

"ఇప్పుడు మీ అక్కగారు మానేశారా?''

"అలాటి మాటే."

"మీ గురువెవరు ?"

"మా అక్కకు మా అమ్మ, నాకు మా అక్క.''

"ఐ సీ. వంశ పారంపర్యంగా వస్తున్న కళ అన్నమాట."

"అవును. ఆటా పాటా మా యింట పుట్టి పెరిగాయి."

"అందుకే ఆ రోజు అంత బాగా పాడగలిగారు కాలేజీలో."

అలా ఇద్దరం ఏవేవో మాట్లాడుకుంటున్నాం. రాత్రి తొమ్మిది గంటలు కావస్తోంది. వాళ్ళ అక్కకు నైట్ డ్యూటీ అని ఆమే చెప్పింది. నేను అలా ఎంత సేపు కూర్చున్నా, ఎంతసేపు మాట్లాడినా ఆమె నన్ను వెళ్ళమనేటట్టు కనపడలేదు. ఆమెతో యేదో ఏకాంతంగా మాట్లాడాలని వున్నా, ఏకాంతం చిక్కినా మాట్లాడటం నాకు చేతకావడంలేదు.

''వస్తాను. రేపు కాలేజీకి వస్తున్నారుగా"అని బయలుదేరాను. వీధిగేటు దాకా సాగనంపింది. రూంకి వచ్చేశాను.

అభినేత్రి సభ్యత, సంస్కారం నన్నెంతగానో ఆకర్షించాయి. అన్నిటికీ మించి ఆమె అందం నన్ను మరీ ఆకర్షించింది. అభినేత్రితో పరిచయం పెరుగుతున్నకొద్దీ కస్తూరి స్మృతి నా మనసులోంచి క్రమక్రమంగా రంగు మాసిపోతోంది. కొంతకాలానికి నా మనస్సు నిండా వున్నది అభినేత్రి మాత్రమే.

* * *

మాచిన్నాన్నగారి అమ్మాయి పెళ్ళని, నన్ను వెంటనే బయలుదేరి రమ్మని మా నాన్నగారు ఉత్తరం రాశారు. నేను అభినేత్రి ఇంటినుంచివచ్చేసరికి సాయంత్రం పోస్టులో వచ్చిన ఉత్తరం రూంలో

పడి వుంది. పెళ్ళి యింక రెండు రోజులే వుంది. ఉత్తరం చదువుకున్న నేను మరునాటి ఉదయమే అభినేత్రికి చెప్ప కుండానే మా వూరికి బయలుదేరాను.

పెళ్ళి రాజమండ్రిలో. పెళ్ళి రేపనగా మేం అంతా రాజమండ్రికి చేరుకున్నాం. ఆడ పెళ్ళివారం కావడంతో పెళ్ళి యేర్పాట్ల హడావిడిలో వున్నామంతా. కుర్చీలు కావలసివచ్చి అద్దెకిచ్చేవాళ్ళు యెవరో వున్నారంటే ఓ సైకిలు తీసుకొని బయలుదేరాను. మెరక వీధిలో నేను సైకిలు మీద వెడుతుండగా పెద్ద వానజల్లు వచ్చింది. సైకిలు పక్కకు తీసుకొని ఒక చూరు కింద నిలబడ్డాను. జల్లు నామీద పడి బట్టలు తడుస్తున్నాయి. ఆ యింటి లోపలినుండి ఒక అమ్మాయి బయటకు వచ్చింది.

"తడిసిపోతున్నారే! లోపలికి వచ్చి కూర్చోండి" అంది.

ఆ అమ్మాయిని చూశాను. ఇరవై సంవత్సరాలు వుండచ్చు. రబ్బరుబంతిలా వుంది. అభినేత్రి అంత అందగత్తె కాదు కానీ మొత్తంమీద అందంగానే వుంది.

"ఫరవాలేదులెండి" అన్నాను.

"ఫరవాలేదు. లోపలికి రండి" అని మొహమాట పెట్టింది.

ఇంక వదిలేలా లేదని ఆమె వెనకే లోపలికి వెళ్ళాను. గది చాలా అంధంగా వుంది. ఓ పక్క విశాలమైన పందిరి పట్టెమంచం, అందమైన పూల దుప్పటి పక్క, బలమైన రెండు దిండ్లు, ఓపక్క సోఫా కంబెడ్డు. గోడకు నిలువుటద్దం. ఓ టేబులు మీద కృష్ణుడి బొమ్మ. గది గుమ్మానికి రంగు రంగుల పూసలు-అదీ ఆ గది అలంకరణ.

తిను బండారాలు కూడా పెడితే మొదటి రాత్రికి ఏర్పాటు చేసిన గదిలా వుంటుందది. ఆమె టర్కీటవలు తెచ్చి "తల తుడుచుకోండి" అని అందించింది.

ముఖం, తల తుడుచుకొని సోఫామీద కూర్చున్నాను. ఫ్లాస్కులో కాఫీ కప్పులో పోసి "ఇలా చలి చలిగా వున్నప్పుడు వేడి వేడి కాఫీ తాగితే బావుంటుంది. తీసు కోండి" అంటూ అందించింది ఆమె కాఫీ కప్పు నా చేతికి.

కాఫీ సిప్ చేశాను.

ఆమె నన్నే చూస్తోంది.

ఆమె కళ్ళల్లోకి సూటిగా చూడలేక చూపులు దించేసుకున్నాను.

ఆమె గలగలా నవ్వింది.

'ఎందుకలా నవ్వుతున్నావు?' అన్నట్టు చూశాను ఆమెను. అర్థం చేసు కున్నట్టుంది.

"ఆడవాళ్ళు అలా సిగ్గుపడితే బాగుం టుంది కానీ, మగాళ్ళకింత సిగ్గు బావుం డదు" అంది ఆమె నవ్వుతూ.

నేను మాట్లాడలేదు. కాఫీ తాగేసి ఖాళీ కప్పు టేబిలు మీద పెట్టాను.

"మీ బుగ్గలు నున్నగా వున్నాయి" అంది.

నేను ఉలిక్కిపడి అనుకోకుండా నా బుగ్గలు నేనే పాముకున్నాను. ఆమె మళ్ళీ నవ్వింది. నవ్వితే ఆమె చూడ ముచ్చ టగా వుంది.

"మీ పేరు?" అని అడిగింది.

"నారాయణరావు" స్కూలు కుర్రా డిలా చెప్పాను.

"వైట్ షర్టు, గ్రీన్‌పాంటూ మీకు చాలా బావున్నాయి"

నా వేషం నేను చూసుకున్నాను.

ఆమె మళ్ళీ నవ్వింది. ఆమె నవ్వుల





అంతరార్థమేమిటో నాకు అర్థం కావడం లేదు.

"తల రేగిపోయిఁది. దువ్వనా?"

నా గుండె దడదడలాడింది. నేను దువ్వమని అడక్కుండానే టేబిలు మీద వున్న దువ్వెన తీసుకుని ఆమె నా తల దువ్వుతోంది. సరిగ్గా నా ముఖం మీదకు ఆమె వక్షోజాలు దండయాత్ర చేస్తున్నట్లు అనిపించింది. పలచని పమిట లోంచి జాకెట్టు బొత్తాలు స్పష్టంగా కనపడుతున్నాయి. జాకెట్టులోని బ్రా, బ్రాలోని వయసుపొంగులు నా ముఖానికి సరిగ్గా అంగుళం దూరంలో వున్నాయి. ఆమె నా తల దువ్వుతూ వుంటే అవి గమ్మత్తుగా కదులుతున్నాయి. నేను వద్దని వారించలేకపోయాను. నేను వదులుతున్న వూపిరికి ఆమె పల్చని పమిట చలిస్తోంది. నా వూపిరి నాకే వేడిగా అనిపించింది. సందిట్లోకి తీసుకోవాలనిపించిందామెను. ధైర్యం చాలలేదు.

"మీ పేరు ?" అని అడిగాను.

"సత్యవతి"

తరువాత ఏమిమాట్లాడాలో తోచలేదు.

"మీరు ఏం చేస్తూవుంటారు ?" అంది.

"చదువుకుంటున్నాను."

"ఏ క్లాసు ?"

"బి.యస్‌సి."

"బియ్యే కంటే ఎక్కువా తక్కువా?"

"రెండూ సమానమే."

"అయితే పెద్ద చదువే."

నేను బదులు చెప్పలేదు. చీరకూ, జాకెట్టుకూ మధ్యనున్న పల్చని ఆమె కడుపును చూస్తున్నాను. పండు తమలపాకులా వుంది. తల దువ్వి దువ్వెన టేబిలు మీద పెట్టడానికి వెనక్కి తిరిగింది. ఆమె ఎత్తైన పిరుదులు వయ్యారంగా కదిలాయి. ఆమె వచ్చి సోఫాలో నా పక్కనే కూర్చుంది. భుజం భుజం తగులుతున్నాయి. ఆమె చేతిని నా తొడ మీద వేసింది. సన్నని పొడవైన వేళ్ళు తీర్చిదిద్దినట్లున్న కొనదేరిన గోళ్ళు. గోళ్ళకి ఎర్రటి రంగు. ఆమె చేతిని నా చేతుల్లోకి తీసుకోవాలనిపించింది. ధైర్యం చేశాను. ఆమె అడ్డు చెప్పలేదు. నా ఒళ్ళో వాలిపోయింది. నా ఒళ్ళంతా వేడెక్కిపోయింది. ఆమెను గట్టిగా కౌగలించుకున్నాను. ఆమె పెదవులు నాపెదవులను వెదకి పట్టుకున్నాయి. నాకు వూపిరాడటం లేదు. ఆమె లేచి మంచం దగ్గరికి నన్ను నడిపించింది. ఇద్దరం మంచం మీద వాలిపోయాం.

నా ఇరవై యేళ్ళ జీవితంలో అది నాకు తొలి అనుభూతి.

పి.ఆర్. కాలేజీలో కస్తూరితో మాట్లాడాను. పరిచయం మాటలకు మించి పెరగలేదు. విశాఖపట్నంలో అభినేత్రితో పరిచయం పెరిగింది. చనువు యేర్పడింది. చనువు యేర్పడడానికి దాదాపు యేడాది పట్టింది. అలాంటిది వాన దయవల్ల సత్యవతితో పరిచయం, చనువు, తియ్యని అనుభవం క్షణాల మీద ఒకటి తరువాత ఒకటి.

'సత్యవతి ఎంత కలివిడి అయినది' అనుకున్నాను. తడిసిన బట్టల్ని సర్దుకుంటూ "ఎప్పుడైనా రావచ్చు మీరు. తలుపులు మూసుకొని వున్నప్పుడు మీకు తట్టడం మొహమాటమైతే సెంటర్‌లో నిలబడి రిక్షావాణ్ణి పంపండి. భీమవరం సత్యవతి అంటే వాళ్ళందరికీ తెలుసు" అంది.

అప్పుడు నాకర్థమయింది. సత్యవతి

ఒక వ్యభిచారిణిఅనీ, నేను చేసింది వ్యభిచారమనీ.

నేనేదో అపచారం చేసినట్టు అనిపించింది. అయినా సత్యవతి దగ్గర నేను పొందిన సుఖం, అనుభవం తలచుకున్న కొద్దీ తీయగానే తోచాయి. ఆ రోజంతా ఏదో తప్పు చేసిన వాడిలా బాధపడుతూనే వున్నాను. అయినా ఒక్కసారి మళ్ళీ సత్యవతి దగ్గరకు వెళ్ళాలని అనిపిస్తూనే వుంది. కానీ తెగించి వెళ్ళలేదు.

పెళ్ళి కాగానే తిరిగి విశాఖపట్నం బయలుదేరాను.

అదీ నా తొలి ప్రేమ మజిలీ.




రాజమండ్రి నుంచి మెయిలు బయలుదేరింది. నేను విండో పక్క సీట్లో కూర్చున్నాను. రైలు ముందుకు పరిగెడుతూంటే కనుచూపు మేరలో వున్న తాటి చెట్లు వెనక్కి పరిగెడుతున్నట్టు అగుపిస్తున్నాయి. ఎంత వద్దనుకున్నా మనస్సు సత్యవతి వైపే పరిగెడుతోంది. జీవితంలో మొదటిసారి ఒక వ్యభిచారిణిని కలిశానన్న అసంతృప్తి, ఏదో చెడిపోయానన్న ఆవేదన.

సత్యవతి నన్ను డబ్బు అడగ లేదు. డబ్బిచ్చి అలాంటి సుఖాన్ని కొనుక్కుంటేనే కదా వ్యభిచారం! అసలు సత్యవతికి నేనంత తొందరగా ఎలా లొంగిపోయాను? సత్యవతి నన్ను బలవంతం చేసిందా ?? ఛ ! అదేంమాట !! సత్యవతి నన్ను కావాలనుకుని ఉండవచ్చు. నన్ను కూడా నాకు ఆమె కావాలనిపించేలా చేసింది. ఏ దాపరికం లేకుండా తనను నా కర్పించుకుంది. నన్ను తనకు అర్పించుకునేలా చేసింది. మా యిద్దరి మధ్యా వ్యాపారం ఏమీ లేదు. నా నుంచి ప్రతిఫలం ఏమీ కోరలేదామె. దీన్ని వ్యభిచారం ఎందుకనుకోవాలి ? ప్రేమనుకుంటే తప్పేమిటి ? తొలి చూపులోనే ప్రేమ కలగ కూడదా! ప్రేమించిన వాళ్ళు కలియకూడదా ?? ఇదరిలో ఒకరు చచ్చిపోతేనే ప్రేమా ? పోనీ ప్రేమ కాదు. మరేమిటి ? లస్ట్ ! అంటే వాంఛ ! ప్రేమించిన వాళ్ళకు వాంఛలుండవా ? ఎంత ప్రేమించినా, ఎన్నాళ్ళు ప్రేమించినా పరాకాష్ఠ వాంఛ తీర్చుకోవడమే కదా ! కాకపోతే కొంత మంది విషయంలో ఇది సులువుగా సాధ్యమవుతుంది. కొంత మంది విషయంలో కాలం గడిచిపోతుందే కాని గమ్యం చేరడం జరగదు. అదిగాకపోయినా నేను ఆలోచించేది సత్యవతి నన్నేదో మోసం చేసిందనా? సత్యవతి నాకు మళ్ళీ మళ్ళీ కావాలనా?? సిల్లీ ! ఈ విషయం గురించి ఇంత సేపు ఆలోచించేకంటే వీలైనంత త్వరగా మరచిపోవడం మంచిదేమో. కానీ, మరపురావడంలేదే...ఇలా ఏవేవో ఆలోచనలు విశాఖపట్నం చేరేదాకా, చేరిన కొన్నాళ్ళదాకా నా మెదడును తొలుస్తూనే వున్నాయి.

అదృష్టవశాత్తు గతాన్ని మరిపించడానికి నాకో కొత్త వ్యాపకం దొరికింది. కాలేజీ వార్షికోత్సవాలు దగ్గర పడ్డాయి. దానికోసం నాటకం రిహార్సల్సు, అభినేత్రి భరత నాట్యం, మోనోయాక్షన్ కాంపిటీషన్స్, వక్తృత్వ పోటీలు...మళ్ళీ హడా




విడిలో పడిపోయాను.

కస్తూరిలాగే సత్యవతి కూడా నా మనసులోంచి తొలగిపోతోంది. అభినేత్రి పూర్తిగా చోటు చేసుకుంటోంది.

ఆ రోజే కాలేజీ వార్షికోత్సవాలు. ముందుగా మా నాటక ప్రదర్శన అయి పోయింది. మేకప్ తీసేసి ఆడిటోరియం లోకి వచ్చేశాను. అభినేత్రి నృత్యం చాలా అద్భుతంగా వుంది. ఆమె హావ భావాలు, పదవిన్యాసం, వివిధ భంగిమలు ప్రేక్షకుల మన్ననలను అందుకున్నాయి. నేను నిజంగా ముగ్ధుడినై పోయాను. అభినేత్రి అందగత్తె. గాయని. నర్తకి. ఇన్నీ ఒకచోట పోతపోసి అపర కళా సరస్వతిని, సకల కళా శారదను అభి నేత్రిగా సృష్టించాడా బ్రహ్మ అనిపిం చింది. ఆమెతో సాంగత్యం ఈ కాలేజీ చదువులతోనే ఆగిపోకూడదు. జీవన సాంగత్యం కావాలి. ఆమెతో పొందు కలకాలం కోరుకోదగ్గ అపురూప విందు. ఎలాగైనా ఆమెను నా దాన్ని చేసు కోవాలి. కాదు, నన్ను తనవాడిని చేసు కోమని ఆమెని అర్థించాలనుకున్నాను.

మరునాడు సాయంత్రం ఆమె ఇంటికి వెళ్ళి 'బీచికి వెళదాం రమ్మని'అన్నాను. ఒక్క క్షణం ఆలోచించి 'సరే. పదండి' అని ఆమె నా వెంట బయలుదేరింది. అదృష్టవశాత్తూ ఆ రోజున కూడా వాళ్ళ అక్క ఇంట్లో లేదు. ఇద్దరం బీచికి చేసు కున్నాం. జనసమర్దం లేని చోటుకి వెళ్ళి ఒక పెద్దరాయి పక్కన కూర్చున్నాం. పైనున్న ఆకాశం మమ్మల్ని చూస్తోంది. దిగంతంలోంచి మమ్మల్ని చూడ్డానికే అన్నట్టు అప్పుడే నిండు పున్నమి చంద్రుడు ఆకాశంలోకి వచ్చాడు. సముద్రం వెన్నెల వెండి కాంతులలో కేరింతలు కొడుతోంది. మా పక్కనే వున్న నల్లరాయి మాత్రం జనానికీ, మాకూ మధ్య పెట్టని గోడలా వెలిసింది.

నేను ఆమె పాదాలనే చూస్తున్నాను. నిన్న రాత్రి ఆమె నృత్యం చేయడంతో ఆమె పాదాలమీది పారాణి ఆనవాళ్ళు ఇంకా పూర్తిగా చెరిగిపోలేదు, వేదికమీద కెంపులు పొదిగినట్లు మెరిసిపోతూ సెలయేటి తుంపరుల అలజడిలా కదలిన ఆమె చరణాలు ఇప్పుడిప్పుడే శశికిరణా లను ఆరగిస్తూ స్థిమితంగా సేద తీర్చు కుంటున్నట్లున్నాయి.

"ఏమిటీ! పాదాలను చూస్తున్నారు ?" అంది అభినేత్రి.

నేను నవ్వాను. సమాధానం ఎంతో అందంగా చెప్పాలని నా తాపత్రయం.

"నవ్వుతున్నారు దేనికి ?" అని మళ్ళీ ప్రశ్నించింది అభినేత్రి.

"మాటలు దొరక్క"

"దేనికి ?"

"మీ పాదాలు ఎంత బావున్నాయో చెప్పడానికి"

ఈసారి ఆమె నవ్వింది.

"నిజం అభినేత్రీ! రవి కిరణాలలా మెరిసిపోతున్న నీ చరణాల ముందు ఈ శశికిరణాలు వెలవెల పోతున్నాయి" అని అనుకోకుండా ఆమె పాదాలను ముద్దు పెట్టుకున్నాను.

"భలేవారే" అని అభినేత్రి తన పాదా లను వెనక్కి తీసుకుంది.

"కబుర్లు చెప్పుకుందుకా, కవిత్వం చెప్పడానికా ఇక్కడికి తీసుకొస్త ?" అందామె కిలకిలా నవ్వుతూ.

"ఇలాంటి ఏకాంత ప్రదేశంలో నీ లాంటి కాంత కళ్ళముందు మెరుస్తుంటే ప్రతి మాటా ఒక కవితే" అంటూ ఆమె

ఒళ్ళో వాలిపోయాను. ఆమె నడుము చుట్టూ చేతులు చుట్టి ఆమె బొజ్జమీద ముద్దు పెట్టుకున్నాను. ఆమె నవ్వుతూ "నాకు చక్కిలిగింతలు" అంది. నా ముఖం ఆమె బొజ్జమీద నుండి ఆమె ముఖం మీదకు ఎగ్రాకింది. ఈసారి ఆమె నన్ను తన సందిట్లోకి తీసుకొని అక్కున చేర్చుకుంది. అర్ధ నిమీలిత నేత్రాలతో వికసిత కుసుమంలాంటి ఆమె ముఖాన్ని చూశాను. ఆమె కన్నులు మూసుకుంది. మూసిన కన్నులనే ముద్దాడాను. పెదవులు వణుకుతున్నాయి. వణుకుతున్న ఆమె పెదవులను నా పెదవులతో అదిమిపట్టి వణకనీయలేదు. ఆమె వెచ్చటి నిట్టూర్పులు నా కంఠం మీదుగా హృదయంలోకి దూసుకు పోతున్నాయి. 'కాలం ఆగిపోతే బావుండును' అనిపించింది. మేమిద్దరం అలా చాలా సేపు వుండిపోయాం. వెన్నెల పందిరి కింద, యిసుక తిన్నె పాన్పుమీద ఇద్దరం అలసిపోయాం. అయినా ఆమె చెయ్యి నా చేతుల్లోనే వుంది. వదలబుద్ధి కావడంలేదు. కలకాలం అలాగే కలిసి వుండిపోవాలి అనిపించింది. వెన్నెల వెలుగులో ఒకరి కళ్ళల్లోకి ఒకరం చూసుకున్నాం. చెదిరిన ఆమె ముంగురులను సవరించాను. ఆమె ముఖంలో సిగ్గు అలల దొంతరలు పొంగి నా గుండెలమీద విరుచుకు పడ్డాయి.

"ఇంత తీయని కాలం నేను బతికినంత కాలం జ్ఞాపకం వుంటుంది అభినేత్రీ!" అన్నాను.

"కలకాలం ఇంత తీయని కాలమే అయితే!" అంది అభినేత్రి.

"అది ఈ దేవి నా కిచ్చిన వరం అనుకుంటాను" అన్నాను.

"పొద్దు పోయింది. ఇక వెడదామా?"

"ఎక్కడికి?"

"ఇంటికి"

"నాకు ఇల్లు లేదు"

"మీ రూంకి మీరు, మా ఇంటికి నేను" అంటూ లేచింది అభినేత్రి.

ఆమెను ఇంటి దగ్గర దిగబెట్టాను. నేను తిరిగి హాస్టలుకి వస్తూ 'నాన్నగారితో మాట్లాడి అభినేత్రిని నా దాన్ని చేసుకోవాలి. నా జీవిత కాలం అంతా అభినేత్రి సాంగత్యంలో తీయని కాలంగా సాగిపోవాలి' అనుకున్నాను.

ఇది నా రెండవ ప్రేమ మజిలీ!




కాలేజీకి వెళ్ళాను. అభినేత్రి కనిపించింది. ఒకరి కళ్ళల్లోకి ఒకరం చూసుకున్నాం. ఇదివరలో అభినేత్రి కనిపిస్తే నవ్వులతో పలకరించుకునేవాళ్ళం. ధైర్యంగా మాట్లాడగలిగేవాణ్ణి. కానీ సముద్ర తీరాన ఆమెను కలిసిన తర్వాత ఆమెను పలకరించాలంటే ఎందుకో సిగ్గు. ఆమెకూడా అలాగే సిగ్గుపడింది నన్ను చూసి. చుట్టూ వున్న వాళ్ళంతా మమ్మల్నే చూస్తున్నారని మా అనుమానం. మా పరిచయాన్ని పసికట్టేసి మమ్మల్నిద్దర్ని గోడలమీదకి ఎక్కించేసారేమోనన్న భయం. అందుకే ఇదివరలో కంటే కాస్త ఎడం ఎడంగా ముభావంగా వుంటున్నాం యిద్దరం.

అభినేత్రిని చూడాలని లేకకాదు, మాట్లాడాలని లేకకాదు, ఇదివరలో అభినేత్రి కనిపిస్తే ప్రాణం లేచి వచ్చినట్లుండేది. ఆమె చిరునవ్వు నవ్వితే మనసు వెన్నెట్లో స్నానం చేసినట్లుండేది. ఆమె పలకరిస్తే పరవశమే. కానీ ఇప్పుడు అభినేత్రి నుంచి నేను కోరుకునేవి ఆమె దర్శనం, చిరునవ్వు, పలకరింపు కావు. ఏకాంతంలో మళ్ళీమళ్ళీ కలవాలనే కోరిక, నిశ్శబ్దంలో ఆమె కళ్ళల్లోకే చూస్తూ కాలాన్ని మరిచిపోవాలన్న ఆశ, ఆమె తనువులో తనువై తనివితీరా మైమరచి పోవాలన్న ఆకాంక్ష. కానీ ఎలా ?

"మళ్ళీ ఎప్పుడు ఎక్కడ ఎలా కలుసుకుందాం?" అని ఆమెను అడగాలనుకునే వాడిని రోజూ. అవకాశం చిక్కేదికాదు. అవకాశం చిక్కినా అందరి కళ్ళూ మా మీదే వున్నాయనిపించేది. ఒకనాడు వుండబట్టలేక ఆమెకై నేననుభవిస్తున్న విరహాన్ని, పరితాపాన్ని గేయంగా రాశాను. ఆ గేయాన్ని ఒక పుస్తకంలో పెట్టి ఆమె కందించాను.

'ఏమిటి' అన్నట్టు తెల్లబోయి చూసింది.

"డెబ్భై అయిదో పేజీ" అన్నాను ముక్తసరిగా.

ఒక్కక్షణం కూడా ఆమె ముందు నిలువకుండా వెళ్ళిపోయాను. ఆ రాత్రంతా ఆమె గురించే ఆలోచనలన్నీ. 'రేపు ఉదయాన్నే ఆ గేయానికి బదులుగా అభినేత్రి సమాధానం ఏమై వుంటుంది' అన్న ఆలోచనలతోనే మనసు గుడిగుడి కుంచం తిరుగుతోంది. నా రూంమేటు భూషణం మాత్రం పుస్తకంలో ముఖం దాచుకొని మనసు నిండా కాగితాల మీద అచ్చు గుద్దిన పువ్వుల్నీ, ఆకుల్నీ, కొమ్మల అడ్డ కోతల్నీ, నిలువు కోతల్నీ కుక్కేసుకుంటున్నాడు. అలా బోటనీ టెక్స్టుని రుబ్బేస్తున్నాడు. ఉదయం ఆరుగంటలకి లేస్తాడు. రాత్రి పన్నెండు గంటలకి పడుకుంటాడు. క్లాసు, లెక్చర్లు, పుస్తకాలు వాడి జీవితం. పట్టాల మీద రైలు బండిలా అలా రోజులు దొర్లించేయడమే తప్ప బయటి ప్రపంచం వాడికక్కరలేదు. వాడి ప్రపంచం వాడిది. నేనూ వాడి లాంటి విద్యార్థినే. విశాఖపట్నం వచ్చింది చదువు కోసమే. అనుకోకుండా అభినేత్రి నా జీవితంలో అడుగు పెట్టింది. నేనూ ఆమె జీవితంలోకి అడుగుపెట్టాను. విద్యార్థిగా చదువుకోవాలి అన్న జ్ఞానం నాకుంది. అది నా బాధ్యత. కానీ మనిషిగా అభినేత్రి గురించి ఆలోచించినంత తీక్షణంగా పుస్తకాల మీదా, చదువు మీదా మనసు నిలవలేక పోతోంది.

బాధ్యతను నిర్వర్తించటమంటే మనిషి స్వతసిద్ధంగా బరువుగానే భావిస్తాడేమో! చెయ్యాల్సిన పని ఎగ్గొట్టడం, చేయకూడని పనిని చేయడం మనిషి నైజమేమో! అదే అసలు మనిషికీ, మరకీ తేడా అనుకుంటాను. మర తాను ఏ పని చేయడానికి సృష్టించబడిందో ఆ పనిని మాత్రమే చేస్తుంది. మరో పని చేయదు, చేయలేదు. కానీ మనిషి అలా కాదు మనిషి మనసు ఏవేవో ఆలోచిస్తుంది. ఏవేవో చెయ్యాలనుకుంటుంది. చెయ్యాలనుకున్నవి చేయగలిగినప్పుడు ఆనందంతో ఉప్పొంగి పోతుంది. చేయలేక పోయినప్పుడు ఓటమితో క్రుంగిపోతుంది. కొందరు మనుషులు మరలుగా బతికేయగలరు. అలా బతకగలగడానికి క్రమ

శిక్షణ కావాలి. క్రమశిక్షణతో ఏకాగ్రతను పెంపొందించుకోవాలి. అప్పుడు పట్టాల మీద రైలులా, సూటిగా దొర్లుకుపోగలడు మనిషి. కానీ నాకు అలా బ్రతకడం చేతకావడంలేదు. పరీక్షలు దగ్గర పడుతున్నా మనసు పుస్తకాల మీదకంటే అభినేత్రి మీదే నిలిచిపోతోంది. కళ్ళేలు పట్టిలాగినా, బలవంతంగా పుస్తకం చేత పట్టుకున్నా ఏకాగ్రత కుదరటంలేదు మనసుకి.

భూషణానికీ, నాకూ తేడా ఏమిటి ? వాడలా పుస్తకం పురుగుగా బతకగలగడానికీ, నేను అభినేత్రి నీడలా అతుక్కుపోవడానికి కారణం ఏమిటి?? -ఈ ప్రశ్నలకి సమాధానాలు దొరకడంలేదు. అలా ఏదో పిచ్చిపిచ్చిగా ఆలోచించుకుంటూ వుండగా రాజమండ్రిలో కలిసిన సత్యవతి గుర్తుకొచ్చింది. సత్యవతిని, అభినేత్రిని తక్కెట్లో పెట్టి తూస్తోంది మనసు. సత్యవతి కోసం నేను శ్రమపడలేదు. వర్షం సహకరించింది. సత్యవతి ఆహ్వానించింది. ఆమెకు అది ఎన్నో అనుభవమో తెలీదుకానీ నాకు మాత్రం అది తొలి అనుభవం. ఆ అనుభవాన్ని ఏ నాటికీ మరిచిపోలేను. పెళ్ళి అన్న పేరుతో కట్నకానుకలూ, లాంఛనాలూ, యింకా ఎన్నెన్నో ఒప్పందాలు చేసుకొని వంశవృక్షాల పవిత్రతనూ, ఘనతనూ బేరీజులు వేసుకొని అగ్నినీ, మిగిలిన పంచభూతాలనూ సాక్షులుగా పెట్టుకుని "బతికినంత కాలం నీతోనే బతుకుతాను. ఇద్దరం కలిసే బతుకుదాం" అని ప్రమాణాలు చేసుకొని తాళి కట్టించుకున్న భార్య ఇవ్వాల్సిన తొలి అనుభవాన్ని ఏ ఒప్పందాలూ లేకుండా, ఏ సాక్షులూ లేకుండా "నాకు నువ్వు, నీకు నేనే సాక్షి" అన్నట్లు నిరాడంబరంగా ఒక తీయని అనుభవాన్ని అందించింది సత్యవతి. ఆమె బజారు మనిషే కావచ్చు. ఆమె అందించే అనుభవం అంగట్లో అమ్మకానికి పెట్టిన అనుభవమే కావచ్చు. కానీ, ఆమె నాకు అమ్మలేదు. నేను కొనలేదు. మనస్ఫూర్తిగా ఏ విధమైన ఒప్పందాలూ లేకుండా అందించింది ఆ తొలి అనుభవం. ఎంత కాదనుకున్నా అదీ ఒక అనుభవమే. ఆమె కూడా ఒక మనసు గల మనిషే.

కానీ, అభినేత్రి దగ్గర నేను పొందిన అనుభవాన్నీ, సత్యవతి దగ్గర పొందిన అనుభవాన్నీ పోల్చిచూస్తే సత్యవతి దగ్గర పొందిన అనుభవం ఊపిరాడనివ్వని ఉప్పెన. అభినేత్రితో అనుభవం ఒక మలయమారుతం. అయినా సత్యవతి కంటే అభినేత్రి అంటేనే ఎందుకో మమకారం. ఈ రాత్రికి రాత్రి రాజమండ్రి వెళ్ళిపోతే సత్యవతి తలుపులు తెరిచే వుంటాయి. మనసారా ఆహ్వానిస్తుంది. ఇదివరకటి కంటే ఈసారి ఎంతో చనువుగా అరమరికలు లేకుండా ఆనందాన్నందిస్తుంది. కానీ మనసు అటు మొగ్గటం లేదు. కలవడానికీ, మాట్లాడడానికీ అవకాశం దొరక్కపోయినా అభినేత్రినే మరీ మరీ కావాలనుకుంటోంది మనసు. ఇద్దరికీ ఏమిటి తేడా? బహుశా సత్యవతి ఎదురు చూడకుండా దొరికిన అనుభూతి కావడం, అభినేత్రి ఏడాదిపాటు ఎదురు తెన్నులు చూశాక ఎదను పులకించిన అనుభవం కావడమేనేమో. అంతే కాకుండా ఆమె అందరికీ అందుబాటులో వున్న మనిషి అనీ, అభినేత్రి నా ఒక్కడికే అందిన వనిత అనీ నా మనసు వూహించుకోవ





డమేనేమో.

ఇలాంటి ఆలోచనలతో ఆ రాత్రంతా కలత నిద్రే. మనసు తెరమీద సత్యవతీ, అభినేత్రుల బొమ్మలు వస్తూ పోతూ వున్నాయి.

తెల్లవారింది. కాలేజీలో అభినేత్రిని కలిశాను. నేనిచ్చిన పుస్తకం నాకు తిరిగి ఇచ్చేస్తూ "వందో పేజీ" అని చెప్పి వెళ్ళి పోయింది.

ఆ పుస్తకం అందుకొని క్లాసుకి వెళ్ళకుండా రూంకి వచ్చేశాను. పుస్తకం తెరిచాను. వందో పేజీలో చిన్న వుత్తరం. "సాయంత్రం ఇంటికి రండి."

అది చదివిన మరుక్షణం నుంచీ సాయంత్రం కోసం ఎదురు చూస్తున్నాను. గడియారంలో నిమిషాల ముల్లు గంటకో నిమిషం కదులుతోంది. ఆకాశం మబ్బుల్తో నిండి వుండడంచేత సూర్యుడు ఎక్కడ వున్నాడో తెలియడం లేదు. నా గడియారం తప్పేమోనని ఒకసారి రూం లోంచి బయటకొచ్చి కేంటీనులో గడియారం చూశాను. అది అయిదు నిముషాలు స్లో తిరుగుతోంది. అస్థిమితం అంటే ఏమిటో ఆ రోజు తెలిసింది నాకు.

నాలుగ్గంటలయింది. కాలేజీ లాంగ్ బెల్ మోగింది. నేను టవల్ తీసుకొని స్నానానికి వెళ్ళాను. స్నానం చేసి తల తుడుచుకుంటూ బాత్‌రూంలోంచి బయట కొచ్చాను. అప్పటికే నా రూంమేటు భూషణం రూంకొచ్చి, బట్టలు మార్చుకొని, పుస్తకం చేతబట్టుకొని కూర్చున్నాడు. నేను బాత్‌రూంలోంచి బయటికి రాగానే భూషణం నన్నుచూసి "నారాయణరావు! నారాయణరావు! ఏమిటోయ్ అది?" అన్నాడు. నన్ను నేను చూసుకున్నాను. టవలుతో తల తుడుచుకుంటున్నాను కానీ ఒంటిమీద బట్టల్లేవు. నాలిక కొరుక్కొని "సారీ" అంటూ టవలు మొలచుట్టూ చుట్టుకున్నాను.

'అభినేత్రీ! నన్ను పిచ్చివాణ్ణి చేస్తున్నావు కదా' అనుకున్నాను మనసులో. త్వరగా ముస్తాబై అభినేత్రి ఇంటికి బయలుదేరాను. దారిలో రూంలో జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది. ఉలిక్కిపడి నన్ను నేను జాగ్రత్తగా చూసుకున్నాను. నాలో నేనే నవ్వుకున్నాను. అలా నవ్వుకొంటూంటే పక్కవాళ్లు పిచ్చివాళ్ళనుకుంటారేమోనని మళ్ళీ జాగ్రత్త పడ్డాను.

అభినేత్రి ఇంటికి చేరుకున్నాను ఆఖరికి. ఆమె నా కోసం ఎదురు చూస్తోంది.

"ఇంకా రాలేదేమిటా అని చూస్తున్నాను" అందామె.

ఎదురు చూసే ఆడది వుండడం మగవాడికి నిజంగా ఒక వరం అనిపించింది అప్పుడు.

"సాయంత్రం రమ్మన్నావు కదా! సాయంత్రం అంటే అయిదు గంటలూ సాయంత్రమే, ఆరు గంటలూ సాయంత్రమే" అన్నాను.

"భలేవారే. సాయంత్రం అంటే కాలేజీ అయిపోగానే అని నా వుద్దేశం" అంటూ నన్ను లోపలికి తీసుకు వెళ్ళింది.

"మీ అక్కగారికి ఇవాళకూడా నైట్ డ్యూటీయేనా?"

"అక్క అసలు వూళ్ళో లేదు" అంది కొంటెగా నవ్వుతూ.

ఆ నవ్వు 'ఈ రాత్రంతా నీదె' అన్నట్టుంది.

"థాంక్యూ" అన్నాను.

"ఎందుకు?"

"ఎందుకో నేనే చెప్పాలా?"

"చెబితే విందామని!"

"నీ పరోక్షంలో ఏవేవో ఆలోచిస్తాను. నువ్వు కనపడగానే ఏవేవో మాట్లాడాలను కుంటాను. తీరా నువ్వు నా కళ్ళముందు కనబడేసరికి అన్నీ మరచిపోతాను"

ఆమె గలగలా నవ్వింది.

"నన్నే మర్చిపోకండి."

"అన్నీ మర్చిపోయాను. జ్ఞాపకమల్లా నువ్వే."

"అదృష్టవంతురాలిని"

"కాదు, అదృష్టవంతుడిని నేను" అంటూ ఆమె కుడి చేతిని నా చేతిలోకి తీసుకొని ముద్దు పెట్టుకున్నాను.

ఆమె నవ్వుతూ నా తలను తన ఎడం చేతో చిందర వందర చేసింది అల్లరి భామలా. ఆమె కొంటెతనం నన్ను రెచ్చగొట్టింది. ఆమె కుడిచేతిని వదలి ఆమెను నా సందిట్లోకి తీసుకోబోయాను.

"ష్! ఏమిటది? తలుపులు తెరిచే వున్నాయి" అని వారించింది.

"మూసేయి!"

"ఇంకా చీకటి పడలేదు."

"తలుపులు మూసేస్తే అంతా చీకటే"

"ఎవరైనా వస్తే?"

"వచ్చే వాళ్ళున్నారా?"

"ఊ!"

"ఎవరు?"

"చిరుగాలి!" అంది నవ్వుతూ.

"అమ్మదొంగా! చిరుగాలి మనకంత రాయం కాదులే" అంటూ నేను నిలబడి ఆమెను నడుం చుట్టూ చెయ్యి చుట్టి లోప లికి నడిపించ బోయాను. ఆమె నన్ను మృదువుగా వదిలించుకొని తలుపులు మూసింది. ఇంక నేను ఆగలేక ఆమెను అమాంతంగా ఎత్తుకొని లోపలికి నడిచాను.

"అటు వంటిల్లు!"

"పడక గది ఎటు?"

"ఇటు!" అని సిగ్గుతో దారి చూపించింది.

ఆ రాత్రంతా ఆ ఇంట్లో...ఆ ఇంట్లోని పడకగదిలో మేమిద్దరమే. ఒకరి సందిట్లో ఒకరం బందీలై, ఒకరి వేడికి ఒకరు కరిగి ఒకరిలో ఒకరం కలిసిపోయాం.

అది అరమరికలు లేని రాత్రి. మనసులు విప్పి మాట్లాడుకొన్న రాత్రి. నేను సజీవ తరువును. ఆమె లలితలావణ్య లత. నేను సాగరాన్ని. ఆమె నన్ను జేరిన నది. నేను ప్రవాహాన్ని. ఆమె నన్నింటిన అల. నేను తుమ్మెదను ఆమె మకరందం. ఆమె ప్రకృతి. నేను కాలాన్ని. మే మిద్దరం కలిసి సృష్టికే జీవం. ఆమె స్వేచ్ఛ. నేను స్వాతంత్ర్యం. మాఆనందానికి అవధులు లేవు. హరివిల్లులోని రంగుల్లా, గాలిలోని పరిమళాల్లా, యెవరు ఏమిటో, ఎవరు ఎవరో తెలియకుండా ఇద్దరం పర వశించిపోయాం.

ఏవేవో మాట్లాడుకున్నాం. ఆమె అడక్కపోయినా నేనే ఎన్నెన్నో బాసలు చేశాను. ఆమె నన్ను నమ్మింది. మా భవిష్యత్తు గురించి నేనూహించిన ఊహలు నిజాలను చేయాలని నాలో నేనే నిశ్చ యించుకున్నాను.

రాత్రి గడిచింది.

వెలుగు రాకుండానే అభినేత్రిని వదల లేక వదలలేక చివరకు వదిలి బయటకు వచ్చాను.

"మన పరిచయం, స్నేహం మీరు ఎదగడానికే తోడ్పడాలి కానీ, మీరు పెడదారి పట్టడానికి కారణం కాకూడదు. మీకు నేనివ్వనిది, మిమ్మల్ని కాదని దాచినది నాదగ్గరేమీ మిగల్లేదు. నాకోసం ఆలోచిస్తూ చదువు పాడుచేసుకోవద్దు. బాగా చదవాలి. ఫస్ట్ క్లాసులో పాసు

కావాలి. పెద్దవారు కావాలి" అని ఆమె ఇచ్చిన సలహానే పదే పదే తలచుకుంటూ ఆమె కోసమే అన్నట్లు శ్రద్ధగా చదివాను. పరీక్షలు రాశాను.

పరీక్షలు పూర్తికాగానే అభినేత్రితో చెప్పి 'త్వరలోనే వస్తాన'ని మాటిచ్చి మావూరికి వెళ్ళిపోయాను.




నేను పరీక్షలు రాసి ఇంటికొచ్చానని తెలియగానే రెండుమూడు రోజుల్లో మా వెంకటపతి మావయ్యా మా వూరొచ్చేశాడు. వచ్చినవాడు వచ్చినట్టుండక మా నాన్నని "ఎప్పుడు ముహూర్తం పెట్టిద్దామంటావ్?" అంటూ సరాసరి నా పెళ్ళి సంగతి కదిపాడు.

మా మామయ్యకి ఒక్కగానొక్క కూతురు లక్ష్మి. మానాన్నకు నేనొక్కణ్ణే. లక్ష్మి పుట్టినప్పటినుంచీ పెద్దలంతా నా పెళ్ళామే అనేవారు. ఆ సంబంధం జరగదని మా పెద్ద వాళ్ళెవరికీ అపనమ్మకాలు లేవు. మా మామయ్య కూడా మా అంత ఆస్తిపరుడు కాకపోయినా ఉన్నవాడే. కాంట్రాక్టులు చేసి బాగా సంపాదించాడు. లక్ష్మి ఇంటర్ మీడియట్ దాకా చదివి మానేసింది. చిన్నప్పటినుంచీ నేను వేసవి శలవుల్లో మా మామయ్యగారింటికి వెళ్ళేవాడిని. కాలేజీ చదువులు మొదలెట్టాక వెళ్ళినా ఎక్కువరోజులు వుండటం లేదు కానీ చిన్నప్పుడు శలవులు అన్నిరోజులూ అక్కడే వుండేవాణ్ని. లక్ష్మితో కలిసి ఆడుకుంటూ వుండేవాడిని. బాగా ఊహ తెలిశాక లక్ష్మి నా పెళ్ళాం అని అనడం మూలంగా కాస్త రాకపోకలు తగ్గించాను. లక్ష్మి కూడా నాతో మాట్లాడడానికి సిగ్గుపడేది.

చూడ్డానికి బాగానే వుంటుంది లక్ష్మి. కాకపోతే ఒక్కత్తే కూతురు కావడంతో గారాన్ని మరిగి కాస్త పట్టుదల, తన మాటే నెగ్గాలన్న అహం పెంచుకొంది. నేనంటే తన కిష్టమే. కానీ లక్ష్మి మీద అంతగా మమకారాన్ని నేను పెంచుకోలేదు. కస్తూరినీ, అభినేత్రినీ చూడాలని నేను పడే తహ తహ మాట్లాడాలని పడే ఆరాటం లక్ష్మిపట్ల నాకెప్పుడూ కలగలేదు. కారణం-ఈమె నా కళ్ళ ముందు వుండడమేనేమో. అలా అని లక్ష్మిలో ఆకర్షణలేదని కాదు. వయసు, వయసుకు తగిన అందం, మాట పొందిక, నా పట్ల అభిమానం అన్నీ వున్నాయి ఆమెకు.

'బావా! బావా !' అంటూ నాతో బాగానే మాట్లాడేది.

మా మామయ్య ముహూర్తాల సంగతి ఎత్తేసరికి నా గుండె గతుక్కుమంది. నాన్న చటుక్కున ఒప్పేసుకుంటాడేమోనని భయపడ్డాను.నాన్న తెలివిగానే సమాధానం చెప్పాడు.

"ముందు నీ అల్లుణ్ని ఒప్పించుకోవయ్యా, ముహూర్తాలెంత సేపు?" అన్నాడు వ్యవహారిక ధోరణిలో.

"అబ్బాయి ఎందుకు కాదంటాడు? లక్ష్మిఅంటే వాడికిష్టమే" అని మా అమ్మ మా మామయ్యకి వత్తాసు పలికింది.

వ్యవహారం శృతి మించి రాగాన పడు




తోంది.

"సరే! ఇవాళకుంటున్నావుగా. రాత్రికి మాట్లాడు కుందాం," అని చెప్పి మా నాన్న బయటకి వెళ్ళిపోయాడు. మా మామయ్య నా దగ్గరకి చేరాడు.

"స్కూటరుకి ఆర్డరిచ్చాను, నెల రోజుల్లో వస్తుందని చెప్పాడు. ఇక పోతే నీ బట్టల సంగతి నాకు తెలీదు. సూట్లే కావాల్లో, బూట్లేకావాలో నువ్వే సెలక్టు చేసుకో కావలసిన డబ్బు పట్టుకెళ్ళి కొనుక్కో. శలవులే కదా. రేపు నాతో రాకూడదూ ? మీ అత్తయ్య చూడాలం టోంది నిన్ను" అన్నాడు అంతా నిశ్చయమైపోయినట్లే.

నాకు పచ్చి వెలగకాయ గొంతుక్కి అడ్డు పడ్డట్లయింది. మామయ్యకి ఏం చెప్పి వదిలించుకోవాలో అర్థం కావడం లేదు. ఏ వంకా దొరకడంలేదు. నా మన సంతా అభినేత్రి మీదే వుంది. అలా అని చెప్పి లక్ష్మి మీద నాకు అయిష్టం లేదు. అంటే ప్రేమ వుందని కాదు. ఆమెను ప్రేమించలేదు కాబట్టి ప్రేమలేదు. ఇది వరకు ఎప్పుడో నాకు లక్ష్మితో పెళ్ళి అయిపోయి వుంటే, ఆమెనే ప్రేమించే వాడినేమో! ఈ పాటికి ఆరాధిస్తూ వుండే వాడినేమో ! చదువుల పేరిట లక్ష్మికి నేను దూరం కావడం మూలంగాను; పరిస్థితులు, పరిసరాలు, కొత్త పరిచయాలు నన్ను ప్రభావితుణ్ణి చేయడంమూలంగాను, నాలో మార్పు వచ్చింది. లక్ష్మిలో లేని దేదో అభినేత్రిలో నాకు కనిపిస్తోంది.

అభినేత్రి నన్నుఎంతగానోఆకర్షించింది. ఆమె లేకుండా నా జీవితాన్ని వూహించు కోలేక పోతున్నాను. ఆమె ఆటా, పాట, మాట తీరూ, అందం నా మనసును ఆకట్టుకున్నాయి. ఇప్పుడు మనసు చంపు కొని నా పెద్ద వాళ్ళను మన్నించడ మెలాగో తెలీటంలేదు. చేత కావడం లేదు. అందుకే "ఇప్పుడప్పుడే పెళ్ళికేమితొందర మామయ్యా! నేను ఎం. ఎస్ సి. కూడా చదువుదామను కొంటున్నాను" అన్నాను.

"పెళ్ళైనంత మాత్రంచేత లక్ష్మిని నీ వెనకాల పంపించేస్తానేమిటయ్యా ? చదువు పూర్తయ్యేకే మిగిలిన గొడవలు అన్నీను" అన్నాడు మామయ్య.

ఇంక వదిలేలా లేడనుకున్నాను. 'లక్ష్మిని నేను చేసుకోను'అంటే మామయ్య కంటే అమ్మే ఎక్కువ బాధ పడుతుంది. ఏదోవిధంగా నాన్నకే చెప్పాలనుకున్నాను నా మనసులోని మాట. కానీ నాన్నంటే భయం. అడిగితే చెప్పగలను కానీ నా అంతట నేనుతెగించి చెప్పలేను. సమయం కోసం ఎదురు చూస్తున్నాను. అదృష్ట వశాత్తు నాన్న జమా బందీ గొడవలో వుండడం చేతా, నేను మామయ్య వెంట వాళ్ళ వూరు రాననడంచేతా మళ్ళీవస్తానని చెప్పి మామయ్య వెళ్ళి పోయాడు. ఆ క్షణానికి గండం అలా గడిచింది.కానీ అది దిన దిన గండమే.

నాన్నకి జమాబందీ పూర్తయింది. ఖాళీ చిక్కింది. పెళ్ళి విషయం మాట్లాడ టానికి తాను ఎప్పుడు రావలసినదీ ఉత్తరం రాయమంటూ మామయ్య దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది నాన్నకు. ఆ ఉత్తరం చదువుకొని నన్ను పిల్చాడు నాన్న.

"లక్ష్మి పెళ్ళి గురించి మామయ్య తొందరపడుతున్నాడు.ఈ వేసం కాలంలో ముహూర్తం పెట్టించెయ్యమంటావా ?" అన్నాడు.

కాసేపు నేనేమీ మాట్లాడ లేదు.

"మాట్లాడ వేమిటీ? లక్ష్మి అంటే నీ కిష్టమేనా ?" కుండ బద్దలు కొట్టినట్టు అడిగాడు నాన్న.

"మేనరికం చేసుకుంటే పుట్టే పిల్లలు అంత ఆరోగ్యంగా వుండరట" అన్నాను. నాన్న నన్ను శల్య పరీక్ష చేసినట్టు చూశాడు ఒక్క క్షణం.

"నువ్వు చదువుతున్నది డాక్టరు కోర్సా ?" అన్నాడు, వెటకారంగా.

"పేపర్లో చదివాను."

"పేపరు వార్తలు నమ్మకూడ్లేదు. వర్షం వస్తుందన్న రోజున ఎండకాస్తుంది. ఎండకాస్తుందన్న రోజున వర్షం వస్తుంది" అని కొట్టి పారేశాడు.

ఇంక అసలు విషయం చెప్పక తప్ప లేదు నాకు. అభినేత్రి సంగతి చెప్పాను. ఆటా పాటా వచ్చని కూడా చెప్పాను.

"ఆడేవాళ్ళు, పాడేవాళ్ళు మన కెందు కురా! సంసారం చేసుకునే పిల్లకావాలి గాని" అన్నాడు నాన్న.

"మన పల్లెటూళ్ళలో అయితే ఆడ వాళ్ళు కాస్త ఘోషాలో వుంటారు కానీ పట్నాల్లో పెద్దింటి పిల్లలు సంగీతం, డాన్సు నేర్చుకుంటారు నాన్నా," అన్నాను.

"అయితే ఇప్పుడు లక్ష్మిని చేసుకో నంటావా ? చిన్నప్పటి నుంచీ అనుకున్న సంబంధం ! అసలు దానికి ఏం లోటని?"

"లోటని కాదు. నాకు ఆ అమ్మాయి అంటేనే ఇష్టం. ఇష్టంలేని పెళ్ళి చేసుకొని లక్ష్మి ఏం సుఖపడుతుంది, నేనేం సుఖ పడతాను?" అని నాన్నముందు నుంచి వెళ్ళిపోయాను.

నాన్న కాస్త లోక జ్ఞానం ఉన్న మనిషి. మర్నాడు "వాళ్ళ అడ్రస్ ఇయ్యి, ఎవరో ఏమిటో కనుక్కొస్తాను" అన్నాడు నన్ను పిల్చి.

"నేనూ రానా?"

"నువ్వక్కర్లేదోయ్. నువ్వు ఎవర్ని బడితే వాళ్ళని ప్రేమించగలవు కానీ నువ్వు ప్రేమించిన దానినల్లా ఈ ఇంటి కోడలుగా నేను చేసుకోలేను. ఆ పిల్లెవరో, కులగోత్రా లేమిటో, జాతక మేమిటో కనుక్కొస్తాను" అన్నాడు కోపంగా.

అడ్రసు ఇచ్చాను. నాన్న విశాఖ పట్నం వెళ్ళాడు. అభినేత్రిని చూసి కాదనలేదని నా నమ్మకం. నిజానికి కులగోత్రాల సంగతి నేనూ అడగలేదు. ఆమెకు జాతకం వుందో లేదో తెలీదు. నాన్న ఎప్పుడొస్తాడా అని వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తున్నాను.

మర్నాడు రాత్రికి వచ్చేశాడు నాన్న. నాతో ఏమీ మాట్లాడలేదు. ఆ రాత్రి భోజనాలయిన తర్వాత మా అమ్మ వుండగా నన్ను పిలిచాడు. వెళ్ళి బుద్ధిగా కూర్చున్నాను.

"అభినేత్రి అంటే ఎవరనుకుంటు న్నావ్!" అని అడిగాడు సూటిగా నన్ను.

"నీ కిదివరకే తెలుసా ?" అన్నాను.

"తెలీదు నీ కోసం వెళ్ళి తెలుసు కున్నాను," అని నాతో మాట్లాడటం మానేసి "వెనక తిమ్మ రాజుగారని తాసీల్దారుగారొచ్చేవారు. మనింట్లో కూడా భోంచేశారు ఒకటి రెండుసార్లు. గుర్తుందా నీకు?" అని అడిగాడు అమ్మని.

"తెలీకపోవడం ఏమిటీ, ఎర్రగా పొడుగ్గా వుండేవారు కదా" అంది మా అమ్మ.

"ఆ! ఆయనగారే తిమ్మరాజుగారు. ఆ తిమ్మరాజుగారి ముండ కూతుళ్ళు నీ సుపుత్రుడు ప్రేమించిన అభినేత్రి,




వాళ్ళక్క నరసమ్మాను.

"ఛ ! ఛ ! దొరక్క దొరక్క అలాంటి పిల్ల దొరికిందా వీడికి!" అంది మా అమ్మ ఛీత్కారంగా.

"అసలు ఆ మనిషి ఎవరనుకున్నావు"

"ఎవరో నాకేం తెలుసండీ ? ఈయన గారిని చూశాను తప్ప దాన్నెప్పుడు చూశాను నేను ?"

"ఎవరో కాదు, మండపేటలో తిలకం అని భామావేషం కట్టే మనిషుండేది. దాని కూతురే తిమ్మరాజుగారి ఉంపుడు కత్తె" అని మా అమ్మకు వివరించి, నన్ను చూస్తూ "లేనిపోని ఆశలు పెట్టుకోకు. ఆటువంటికులం గోత్రం లేని పిల్లని నీకిచ్చి నేను పెళ్ళి చేయను. మనకి కాస పరువు ప్రతిష్ఠ వున్నాయి. నువ్వు లక్ష్మినే చేసుకోవాలి. త్వరలోనే ముహూర్తం పెట్టిస్తాను"

నువ్వేమీ పిచ్చి పిచ్చి వూహలు పెంచుకోకు. విశాఖ పట్నం కూడా వెళ్ళకు" అని శాసించాడు.

మా నాన్న మాట శాసనమే. నాకు తెలిసి ఆయన అబద్ధం ఎప్పుడూ ఆడలేదు. మాట తప్పలేదు. అభినేత్రి గురించి ఆయన సేకరించిన వివరాలు నిజమా, అబద్ధమా అని ఆలోచించాల్సిన పనిలేదు. అక్కా, చెల్లెలు మగదిక్కు లేకుండా ఒంటరిగా వుండడానికి కారణం యిదే అయ్యుంటుంది. అందుకే వాళ్ళక్కకి కూడా పెళ్ళి కాలేదు. ఇప్పుడు నేనేం చెయ్యాలి? నాన్నని కాదని అభినేత్రిని పెళ్ళాడటమా? లేక అందరి తృప్తికోసం లక్ష్మికి తాళి కట్టడమా?ఆ సమస్య నన్ను వేధిస్తూనేవుంది. పెళ్ళి ఏర్పాట్లుజరుగుతూనే వున్నాయి. చివరికొక నిర్ణయానికొచ్చాను. నా మనసును అభినేత్రి పగ్గాలుపట్టి తన వైపు లాగుతున్నా ఆమె గురించి నాన్న చెప్పిన మాటలు విన్న తర్వాత అభినేత్రి వైపు మొగ్గడానికి ధైర్యం చాలడం లేదు. పరువు ప్రతిష్ఠల పంజరంలో పెరిగిన వాణ్ణి. వయసు చపలత్వంలో కస్తూరిని, ఆవేశంలో సత్యవతిని, సౌందర్యారాధనలో అభినేత్రిని ఆశించాను. సత్యవతిని, అభినేత్రిని అనుభవించాను. అభినేత్రి కూడా తన గురించి ఎప్పుడూ చెప్పలేదు. నా గురించి అడగనూ లేదు. మొట్టమొదటే అభినేత్రి తన గురించి చెప్పివుంటే నేను ఎలా ప్రవర్తించేవాడినో? ఇప్పుడు అభినేత్రిని కాదని లక్ష్మి మెళ్ళో తాళి కట్టడం ఒక రకంగా అభినేత్రిని మోసం చేయడమే. కానీ తన సంగతి చెప్పకుండా కథ నింతదూరం తీసుకురావడం అభినేత్రి నాకు చేసిన మోసం కాదా? బహుశా అలా నన్ను కలియడం ఆమె దృష్టిలో తప్పు కాదేమో! పెళ్ళి సంగతి ఆమె అసలు ఆలోచించలేదేమో— అలా నా మనసుకు నేను నచ్చచెప్పుకుంటున్నాను.

మనిషి మనోప్రవృత్తి చాలా చిత్రమైనది. ఏ వాతావరణంలో బతికే జంతువు ఆ వాతావరణానికి అలవాటు పడ్డట్టుగా మనిషి కూడా తాను తప్పు చేసినా అవసరం అయినప్పుడు దాన్ని ఒప్పుగా మనసుకు నచ్చచెప్పుకుంటుంటాడు. అభినేత్రి ఒక వేశ్య కుటుంబంలో పుట్టిన పిల్లని నాన్న చెప్పడంచేత ఇలా ఆలోచించాను. ఆమె ఒక సంప్రదాయ కుటుంబంలో పుట్టిన పిల్లయితే నేను చేసింది అన్యాయమే కదా! నిజానికి అభినేత్రి తప్పేముంది? ఆమె తల్లి ఎవరో తాసిల్దారుకి ఉంపుడుకత్తె కావడం అభినేత్రి తప్పుకాదు కదా! అభినేత్రి తప్పు అంటూ




చేసే నాతోనే చేసింది. నేనే చేయించాను. కానీ, ఆ తప్పును ఒప్పుగా సరిదిద్దేంత ధైర్యం నాకు లేదు.

లక్ష్మితో నా పెళ్ళి అయిపోయింది. నేను దేనికీ అడ్డు చెప్పలేదు. అభినేత్రికి శుభలేఖ మాత్రం పంపించాను. ఆమె వస్తుందని కాదు-నా మీద ఆశలు వదులుకోమని తెలిపే సమాచార లేఖ అది. చిత్రమైన విడాకుల పత్రం! ఆమె నుంచి గ్రీటింగ్స్ కూడా రాలేదు. వచ్చివుంటే చాలా బాధపడేవాడినేమో!

నేను పై చదువులకు వెళ్ళాలని చెప్పినా అభినేత్రి సంఘటన మూలంగా పెళ్లైన మర్నాడే కార్యం ముహూర్తం కూడా పెట్టేశారు.

శోభనం రాత్రి. నవలల్లో హీరోల్లాగా, సినిమాల్లో నాయకుడిలాగా నేను జుట్టు పీక్కోలేదు, తాగలేదు. విషాద గీతాలూ, విరహగీతాలూ ఆలపించలేదు. లక్ష్మి మనసును నొప్పించలేదు. పెద్ద నిజాయితీపరుడిలా నా గతం నీకు చెప్పాలంటూ లక్ష్మిముందు నా గతించిన ప్రేమ మజిలీలను వర్ణించలేదు. కానీ, గతానుభవాల ఆసరాతో లక్ష్మిని మురిపించాను. అనాఘ్రాణిత పుష్పం లక్ష్మి. గతంలో ఆఘ్రాణించడమంటేనే తెలియని అమాయక భ్రమరం నేను అని ఆమెను నమ్మించాను. ఆమెనమ్మింది.నన్నే నమ్ముకుంది.నమ్మకం వమ్ము చేయడం ఇష్టంలేక పెళ్ళి ప్రమాణాలను స్మరించుకుంటూ ఇద్దరం హనీమూన్‌కి బయలుదేరాం.

సంప్రదాయం నుంచి నేర్చుకున్న లక్ష్మి చేసే సపర్యలు నన్ను గెలుచుకున్నాయి. ఆమె చూపే ప్రేమ, అభిమానం, గౌరవం నన్ను ఆమె వాడిగా చేశాయి. అన్యోన్యం అన్న పదానికి అర్థం మేమిద్దరమే అన్నట్టు గడుపుతున్నాం. నా గురించి తెలియని లక్ష్మికి నా మీద నమ్మకం పెరుగుతోంది. నా గురించి తెలిసిన మా అమ్మా నాన్నలకు మా అన్యోన్యాన్ని చూశాక నా మీద అపనమ్మకం కరిగిపోయింది. నన్ను పై చదువులకు పంపడానికి మా నాన్న అడ్డు చెప్పలేదు.

బి.యస్.సి. సెకండ్ క్లాస్‌లో పాసయ్యాను. ఎం.ఎస్.సి. చదవడానికి సాగర్ యూనివర్సిటీకి బయలుదేరాను. వెళ్ళేముందు లక్ష్మి కన్నీరు పెట్టుకుంది.




నాకు సాగర్ యూనివర్సిటీలో ఎం. ఎస్. సి. కెమిస్ట్రీకి సీటు దొరికింది. చేరాను. యూనివర్సిటీ కాంపౌండులోనే హాస్టల్సు ఉన్నాయి. హాస్టల్లోకూడా సీటు దొరికింది. నాతో బాటు యింకా తెలుగు వాళ్ళు ఒక వంద మంది దాకా చేరారు. అందరూ పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సుకి వచ్చినవారే. ఇంకా మళయాళీలు, తమిళులు, కన్నడిగులు కూడా వున్నారు. పోస్టు గ్రాడ్యుయేటు కోర్సుల్లో అక్కడ ఉత్తరాది వారి కంటే, దక్షిణాది వారే ఎక్కువ మంది.

సాగర్ యూనివర్సిటీకి, సిటీకి నాలుగు మైళ్ళ దూరం. యూనివర్సిటీ పక్కనే 'మక్రోనియా' అని ఓ చిన్న


చతుర ... 55

రైల్వేస్టేషను వుంది. అక్కడకు వెళ్ళి ట్రైను ఎక్కి సిటీకి వెళ్ళవచ్చు. లేదా రోడ్డు దారిన కూడా వెళ్ళవచ్చు. రోడ్డు దారిన వెళ్ళాలంటే టాంగాల మీదవెళ్ళాలి. ఆ టాంగాలు గమ్మత్తుగా వుంటాయి. మొదట్లో టాంగా ఎక్కి ప్రయాణం చేయడం సరదాగా వుండేది. యూనివర్సిటీలో చేరిన నాటినుంచీ కూడా నేను చాలా శ్రద్ధగా చదువుకుంటున్నాను. లెక్చరర్లు క్లాసులు, ప్రాక్టికల్సు అయిపోవడంతోటే ఎక్కువ సేపు లైబ్రరీలోనే కాలక్షేపం చేసేవాడిని.

నెల రోజులు గడిచాయి. ఆ నెల రోజుల్లోనే లక్ష్మినుంచి మూడు వుత్తరాలు వచ్చాయి. ప్రతి వుత్తర్వానికీ ఆలస్యం చేయకుండా వెంటనే సమాధానం రాసేవాడిని. ఆమె కూడా వెను వెంటనే సమాధానాలు రాసేది. లక్ష్మి ఉత్తరాలు గమ్మత్తుగా వుండేవి.

నామీద తాను కనే కలలన్నీ పూసగుచ్చినట్టు రాస్తూ వుండేది. చదువు ధ్యాసలో మునిగిపోవడంతో నాకు అంతగా కలలు వచ్చేవి కాదు. రాత్రి ఏ వొంటి గంటకో పడుకుంటే మత్తుగా నిద్ర పట్టేది. మళ్లీ ఉదయం ఏడు గంటలకు తయారై లైబ్రరీకి వెళ్ళిపోయే వాడిని. అన్ని కలలు నా గురించి లక్ష్మి కంటూ వుంటే బాగోదని సరదాగా 'నువ్వో నా కలలోకి వచ్చావు. మనిద్దరం కలిసి ఇక్కడ కాపురం వుంటూనే చదువు కుంటున్నానట' అని రాశాను ఓ సారి. వెంటనే తిరుగు టపాలో జవాబు వచ్చింది. 'అమ్మనీ, నాన్ననీ ఒప్పించి రమ్మంటే నేను వచ్చేస్తాను. అత్తయ్యనీ,మామయ్యనీ మాత్రం మీరు ఒప్పించుకోవాలి' అని.

ఉత్తరం చదివి నవ్వుకున్నాను. అంత పనీ చేస్తుందేమోనని 'దసరా శలవలకి నేను వచ్చినప్పుడు ఆ విషయం మాట్లాడుకుందాం. ఈ లోపునే తొందరపడకు. ఇంకెంత ? రెండు నెలలేగా !' అని జవాబు రాశాను. లక్ష్మి దూకుడు కాస్త తగ్గింది.

యూనివర్సిటీలో చిత్రమైన వాతావరణం. ప్రతి విద్యార్థీ కష్టపడి చదివి క్లాసు తెచ్చుకోవాలని తాపత్రయ పడుతూ వుంటాడు. ప్రొఫెసర్ల ముందు చాలా అణకువగా వుంటారు. ఏదో విధంగా ప్రొఫెసర్ల దృష్టికి తాను బాగా చదువుతున్నట్లు తేవాలని ఆరాటపడతారు. నేను నిజంగానే కష్టపడి చదువుతున్నాను. ఒక నెల రోజులు గడిచిన తర్వాత ప్రొఫెసరు మిశ్రా టెస్ట్ కండక్టు చేశారు. నేను ఫస్టున వచ్చాను. నన్ను చాలా మెచ్చుకున్నారు. అదే రోజున నేను లైబ్రరీలో వుండగా ఎందుకో ప్రొఫెసరు మిశ్రా వచ్చారు. వారిని చూడగానే నేను లేచి నమస్కారం చేశాను. లైబ్రరీలో ఎవరూ గట్టిగా మాట్లాడే వారు కాదు. నన్ను కూర్చోమని సైగ చేసి, ఆయన నా పక్కనే కూర్చున్నారు. ఏదో పుస్తకం తీసుకొని రిఫర్ చేశారు.

ఇంతలో మాకు కాస్త యెడంగా కూర్చున్న ఓ అమ్మాయి ప్రొఫెసరు దగ్గర కొచ్చి, దగ్గరగా ఒంగి ఆయన చెవిలో ఏదో మాట్లాడింది. ఆయన సమాధానం చెప్పారు. అటు చూడ్డం మర్యాద కాదని నా కళ్ళను పుస్తకం మీదేవుంచాను. వాళ్ళిద్దరూ ఏం మాట్లాడు కున్నదీ నాకు వినబడ లేదు. ఆ తర్వాత "మిస్టర్ రావ్!?" అన్నారు నెమ్మదిగా ప్రొఫెసరు.

తల ఎత్తి చూశాను.

"షి ఈజ్ మిస్ ఇందిర. రిసెర్చి స్కాలర్. షి విల్ హెల్ప్ యూ" అన్నారు.

"థాంక్యూ సర్," అన్నాను.

ఆమె అందంగా నవ్వింది.

ఆ నవ్వులో ఎంతో ఓర్పు, మంచితనం అన్నిటికీ మించి స్నేహం కనిపించాయి. 'హైలీ కల్చర్డ్' అనుకున్నాను.

ఆ తరువాత నేను లైబ్రరీలో వుండ గానే ఎప్పుడు ఇందిర కనబడినా విన యంగా నమస్కరించే వాడిని. ఆమె కూడా ప్రతి నమస్కారం చేసేది.

"ఎనీ ప్రాబ్లం ?" అని అడిగేది.

"నో ప్రాబ్లం!" అని బదులు చెప్పే వాడిని.

నా సబ్జక్టుకు సంబంధించిన పుస్తకాలు కొన్ని నాకు యిచ్చింది ఇందిర. వాటిలో ఏ అధ్యాయాలు నేను తప్పకుండా చదవాలో కూడా వివరించింది. తను ఎం. ఎస్. సి చదివేటప్పుడు రాసుకున్న నోట్సు కూడా యిచ్చింది. ఆమె సలహాలు నా కెంతగానో ఉపక రిస్తున్నాయి. ఆమె అంటే నాకు గౌరవం, అభిమానం పెరిగాయి.

దసరా శలవులకు నేను ఇంటికి బయలుదేరాను. సాగర్‌లో రైలెక్కి బీనా వరకు వచ్చి, ట్రైను మారి జనతా ఎక్స్ ప్రెస్‌కానీ, జి. టి. ఎక్స్‌ప్రెస్ కానీ ఎక్కాలి. తెలుగు వాళ్ళందరం తంబగా బయలుదేరాం. యూనివర్సిటీలో చేరడా నికి వచ్చినపుడు ఎవరంతట వాళ్ళం విడి విడిగా వచ్చాం. తిరిగి వెళ్ళేటప్పుడు అందరం కలసి వెడుతున్నాం. ప్రయా ణం చాలా సరదాగా వుంది. రైల్లో పేకాట, అందరూ కలసి ఏవేవో కబుర్లు చెప్పుకోవడం, ప్రయాణం జాలీగా సాగి పోతోంది. నాకు అందరూ పరిచయమే. కారణం సాగర్‌లో 'ఆంధ్రా మెస్' ఒకటి పెట్టుకున్నాం. దాని సెక్రటరీని నేనే. నెల మొత్తంలో అయిన ఖర్చు అందరం సమంగా పంచుకునే వాళ్ళం. అందరూ నా రూంకి వచ్చి బిల్లులు కట్టాలి. అలా అందరూ నాకు తెలుసు. కొంతమంది కాజీ పేటలో దిగిపోయేవారు. కొందరు విజయ వాడలో దిగేవారు. నేనూ, మరి కొంత మంది విజయవాడలో ట్రైను మారి రాజ మండ్రి వైపు వెళ్ళేవారం. తిరిగి వచ్చే టప్పుడు కూడా అందరం కూడబలుక్కునే వచ్చే వాళ్ళం.

దసరా శలవులకి ఇల్లు చేరుకున్నాను. ఒక్కరోజు మా ఇంటి దగ్గరుండి రెండవ రోజున అత్తవారింటికి వెళ్ళాను. ఆ పది హేను రోజులూ లక్ష్మితోటే కాలక్షేపం.

లక్ష్మి ఒక్క క్షణం నన్ను వదిలేది కాదు. పుస్తకం తెరిస్తే లాగేసుకునేది. యూనివర్సిటీ విశేషాలు చెప్పమనేది. లేకపోతే కాకినాడో, రాజమండ్రో కొత్త సినిమాలు చూడ్డానికి పోదాం రమ్మనేది, లక్ష్మి కోరిన ఏ కోరికనూ నేను కాదన లేదు. పదిహేను రోజులూ యిట్టే గడిచి పోయాయి. మా మామయ్య నాకు సూటు కుట్టించాడు.

శలవులు ముగించుకుని యూనివర్సి టీకి వచ్చేశాను. మళ్ళీ ఇదో లోకం! చదువులో పడ్డాను. ప్రొఫెసరు మిశ్రా, మిస్ ఇందిర, లైబ్రరీ, క్లాసులు... సాధా రణ యాంత్రిక జీవితం. స్టూడెంట్ లైఫ్ అలాగే వుంటే నిజంగా బోరేనేమో! కానీ ! ఒక్కొక్క కొత్త విషయాన్ని తెలుసుకున్నపుడు ఏదో తృప్తి.

చలికాలం వచ్చింది. సాగర్‌లో చలి




ఎక్కువ. సాయంకాలం అయిదు గంటలకి స్టూడెంట్స్ అందరం సూట్స్ వేసుకొని యూనివర్సిటీ హాస్టళ్ళ నుంచి మెయిన్ గేటు వరకూ నడిచి వెళ్ళేవాళ్ళం. దాదాపు ఒక మైలు దూరం. ఆ రోడ్డుకి ఇటూ, అటూ ఎతుగా ఎదిగిన ఆకాశమల్లె చెట్లు వుండేవి. సాయంకాలానికి ఆకాశమల్లెలు రోడ్డుమీద రాలేవి. నల్లని రోడ్డుమీద మెరిసే ఆ తెల్లని పూలబాట చుక్కల నింగి నేలకు దిగినట్లు వుండేది. ఆ పూల బాట మీద నడవడం సరదాగా వుండేది.

ఆ రోడ్డునే, దారిలో ఓ పక్క 'ఉమెన్స్ హాస్టల్' వుండేది. అదే వేళకు హాస్టలు నుంచి అమ్మాయిలు కూడా ఆ రోడ్డున నడవడానికి వచ్చేవారు. అలా అందరూ కలిసి మెయిన్‌గేటు దాకా వెళ్ళేవారం. మెయిన్‌గేటు దగ్గర మలయాళీ హోటలు ఒకటుంది అక్కడ మంచి దోసె, కాఫీ దొరికేవి. అందరం అక్కడ టిఫిన్ చేసేవారం. ఉత్తరాది విద్యార్థులు కూడా ఆ టిఫిన్‌కి అలవాటు పడ్డారు. ఆ రోడ్డున అలా మేమూ, అమ్మాయిలూ నడుస్తూ వుంటే చూడ ముచ్చటగా వుండేది. రంగు రంగుల వింటర్ కోటుల అమ్మాయిలు, సూట్సులో అబ్బాయిలు పల్చని పొగమంచులో సాయంత్రపు వేళ అలా నడుస్తూ వుంటే యవ్వనం ఆ దారిన ప్రవహిస్తున్నట్లుండేది. ఆ అందాలను చూసినప్పుడు నిద్రపోయిన నా కవితావేశం మేల్కొనేది. ఏదో రాయాలనిపించేది. అక్కడ వుండగానే నాలుగైదు కథలు రాసి పత్రికలకు పంపించాను, ప్రచురితమయ్యాయి. అవి చదువుకున్న లక్ష్మి పొంగిపోతూ నాకు ఉత్తరాలు రాసింది.

ఒకరోజున నేను అలా నడుస్తూ వుండగా మిస్ ఇందిర నన్ను పిల్చింది. వెళ్ళాను. నాతో మాట్లాడుతూనే నడుస్తోందామె. ఇద్దరం గేటుదాకా అలా కలిసే వెళ్ళాం. ఒక టేబిలు మీదనే ఇద్దరం టిఫిన్ చేశాం. అందరూ మమ్మల్నే చూస్తున్నారు. ఆమె పక్కన అలా నడవడం నాకు చాలా గర్వంగా వుంది.

యూనివర్సిటీలో వున్న చాలామంది అమ్మాయిలకంటే ఇందిర అందంగా వుండేది. అందానికే మెరుగులుదిద్దే అందం ఆమెది. ఆమె చీర కట్టు, ఆమె నడక తీరు చూసేకొద్దీ చూడాలనిపించేది. సన్నంగా వున్నా అందులోనే ఏదో లావణ్యం వుండేది. ఆమె నడుస్తూ వుంటే ఎక్కుపెట్టిన విల్లు కదిలినట్టు అనిపించేది. చూపులు అప్పుడే విల్లును వదిలిన తూపులంత తీక్షణంగా వుండేవి. బాబ్డ్ హెయిర్. వీటన్నిటితోటి అధునాతనం పుట్టిపడేటట్టు వుండేది.

ఆమె పక్కన నడవడానికీ ఆమెతో మాట్లాడానికీ ఏ స్టూడెంటయినా సరదాపడడంలో ఆశ్చర్యం లేదు. కానీ, ప్రొఫెసరు మిశ్రా దయవల్ల ఆ అవకాశం నాకే దక్కింది.

నాకు వొంట్లో బాగులేక నాలుగు రోజులపాటు లైబ్రరీకి వెళ్ళలేదు. ఈవెనింగ్ వాక్‌కీ వెళ్ళలేదు. ఇందిరను చూడాలని వున్నా చూడలేకపోయాను.

ఒకరోజు మధ్యాహ్నం తలుపు ఎవరో తట్టారు. తలుపు తీసేవున్నా తడుతున్నారెవరా అని మంచం మీద పడుకున్న నేను గుమ్మం వైపు చూశాను. గుమ్మంలో ఇందిర నిలబడి వుంది. ఆమె సభ్యత నాకు నచ్చింది. గబగబాలేచి లోపలికి రమ్మని ఆహ్వానించాను. ఆమె

కుర్చీలో కూ ర్చు ం టూ "జ్వరమట", అంది.

"అవును" అన్నాను.

"నాకిప్పుడే తెలిసింది. మీతో కూడా వుండే ఆ రెడ్డి నడిగితే చెప్పాడు. చూడా లనిపించి వచ్చేశాను" అందామె.

నేను చాలా గర్వంగా ఫీలయ్యాను. ఒక రిసెర్చ్ స్కాలరు, అందులోనూ అందగత్తె సరాసరి నా రూంకి చూడ్డా నికి వచ్చిందంటే నాకు చాలా ఆనందంగా వుంది.

"థాంక్యూ" అన్నాను.

"ఇప్పుడెలా వుంది?" అంటూ నా మెడమీద చెయ్యి ఆన్చి టెంపరేచరు చూసింది ఇందిర.

"నార్మల్‌కి వచ్చింది" అన్నాను.

జ్వరం వస్తే షేవు చేసుకోవడం కూడా మానేయాలా ?" అం దా మె నవ్వుతూ.

నేనూ నవ్వాను.

"అయితే రేపటికి జ్వరం పూర్తిగా తగ్గిపోతుంది. ఈవెనింగ్ వాక్‌కి వస్తారు" అంది.

"నీరసంగా వుంటే రాలేను."

"నేనొచ్చి తీసుకెడతాగా! ఎంత దూరం వెళ్ళ గలిగితే అంత దూరమే వెళ్ళి వచ్చేద్దాం"

'మీరు పక్కనుంటే ఎంత దూర మైనా నడవగలను' అందామనుకున్నాను. కానీ ధైర్యం చాలలేదు.

"ఓకే" అని మాత్రం అన్నాను.

"మరి నేనొస్తాను" అని లేచిందామె.

"టీ తీసుకెళ్ళండి!" అన్నాను.

మా రూమ్స్‌లో స్టౌ, టీ తయారు చేయడానికి కావలసిన సామగ్రి అందరికీ వుండేవి.

"మీరు తయారుచేసి యిస్తారా ?" అంది చిలిపిగా.

"ఇవ్వకూడదా ?"

"వద్దులెండి. నేనే తయారుచేస్తాను. అసలే నీరసం అంటున్నారు" అంటూ స్టౌ ముట్టించి టీ తయారుచేసింది. అంత సేపూ ఆమె నా ముందే కూర్చొని తీయగా మాట్లాడుతూంటే జ్వరం పూర్తిగా తగ్గిపోయినట్టనిపించింది.

నా చేతికొక కప్పు అందించి, తనో కప్పు తీసుకుంది. ఇద్దరం టీ తాగాం.

'ఈవెనింగ్ వాక్‌కి ఈ సాయంత్రమే రాగలను' అని చెబుదామనుకున్నాను. కానీ చెప్పలేదు.

"వస్తాను" అంటూ లేచింది.

"ఈవెనింగ్ వాక్‌కి వె డ తా రా ఈవేళ ?" అన్నాను.

"ఏం ?"

"నాకూ రావాలనుంది !"

ఆమె నవ్వేసింది.

"ఈ రోజుకి విశ్రాంతి తీసుకోండి. రేపు వెడదాం. ఈ రోజు నేనూ వెళ్ళను" అని అదోలా చూసింది నా ముఖంలోకి.

"థాంక్యూ !" అన్నాను నవ్వుతూ.

ఆమె నవ్వులో నేనంటే ఆమెకు ఎంత అభిమానమో నాకులీలగా స్పష్టమయింది. నా నవ్వులో ఏ భావాలను ఆమెచదివిందో నాకు తెలీదు.

ఆమె నా రూం నుంచి వెళ్ళిపోయిన తర్వాత చాలాసేపు నాకేదో అర్థంకాని ఆనందం. ఎగిరి గెంతాలనిపించింది. ఎంతో గర్వంగా ఫీల్ అయ్యాను. అది ఖచ్చితంగా గర్వం అనికూడా చెప్పలేను. నాకు ఒంట్లో బాగాలేదని తెలిసి ఒక అం ద మై న అమ్మాయి నన్ను చూడ్డానికి రావడం,

 

నేను తనవెంట వచ్చేదాకా ఈవెనింగ్ వాక్‌కి తాను కూడా వెళ్ళనని మాట యివ్వడం తలుచుకుంటే ఏదో తృప్తి. ఆనందంతో మనసు కేరింతలు కొడు తోంది. నాతోటి వాళ్ళతో పోల్చుకుంటే నాలో ఏదో ఆధిక్యం వుందనీ, నేను ఎంతో అదృష్టవంతుడిననీ అనిపించింది. ఆ నాటి పగలూ, రాత్రీ ఆమె ఆలోచనలతోటే గడిపాను.

తెల్లవారింది. ఒళ్లు మువ్వలా వుంది. 'జ్వరం వస్తే షేవ్ చేసుకోకూడదా ?' అన్న ఇందిర మాటలు గుర్తుకొచ్చి వెంటనే షేవ్ చేసుకున్నాను. త్వరగా స్నానంచేసి లైబ్రరీకి వెళ్ళాను. నేను లైబ్రరీకి వెళ్ళింది చదవడానికి మాత్రం కాదు. ఇందిర వస్తే చూడాలన్న ఆశతో వెళ్ళాను. పదిగంటలదాకా కాలేజీలోనే కూర్చున్నాను. కాలేజీకి ఫస్టు బెల్ అయింది. ఇందిర రాకపోవడంతో కాస్త నిరుత్సాహ పడ్డాను. కాలేజీకి వెళ్ళాలని పించక రూంకి వచ్చి పడుకున్నాను. ఎంతకీ సాయంకాలం కావడంలేదు. సాయంకాలమైతే ఆమె నా రూంకి వచ్చి తీసుకు వెడతానన్న మాట మళ్ళీ మళ్ళీ నెమరు వేసుకుంటూ ఆమె రాకకోసం ఎదురుచూస్తున్నాను. కష్టంమీద గడి యారం అయిదు గంటలు కొట్టింది. నా కళ్లు గుమ్మం వైపే వున్నాయి. అయిదు న్నర అయింది. ఇంకా ఇందిర దర్శనం లేదు. అప్పుడే కొంతమంది స్టూడెంట్స్ తయారై ఈవెనింగ్ వాక్‌కి బయలు దేరు తున్నారు. ఎందుకో ఆమె యింక రాదని పించింది నాకు. నిరాశగా నిట్టూర్చి, మంచం మీద నడుం వాల్చాను. కాస్త చలిగా వుండడంతో రగ్గు మెడదాకా కప్పు కుని మొహం మీద చేతులు ముడుచుకుని కళ్లు మూసుకున్నాను. కళ్ళు మూసు కున్నానే కానీ, మనస్సు ఇందిర రాక కోసం ఎదురుచూస్తూనే వుంది.

తలుపు చప్పుడయింది. కళ్ళుతెరిచాను. ఎదురుగా ఇందిర !

"జ్వరం తగ్గలేదా ?" అంది.

"తగ్గిందండీ" అంటూ కప్పుకున్న రగ్గును తొలగించి లేచి కూర్చున్నాను. ఆమె నన్ను చూసి,

"తయారయ్యే పడుకున్నారన్న మాట" అంది నవ్వుతూ.

"మీరు ఎంతకీ రాకపోవడంతో నిజంగా జ్వరం మళ్ళీ వచ్చినట్టే అని పించింది" అన్నాను.

"రాలేదుకదా !" అంది ఆత్రంగా.

"లేదులెండి" అంటూ లేచి యిద్దరం కలిసి ఈవెనింగ్ వాక్‌కి బయలు దేరాం.

"పొద్దున నేను లైబ్రరీకి వచ్చాను" అన్నాను.

"సారీ! నేను రాలేదు" అందామె.

'ఎందుకని?' అన్నట్టు చూశాను.

"మీరు వస్తారనుకోలేదు" అందామె.

నేను వస్తానంటే ఆమె తప్పకుండా వచ్చేదన్న మాట. నేను రానని రాలేదన్న మాట. అలా ఎదురు చూసే మనిషి వుండడం ఎంత అదృష్టమోఅనుకున్నాను. అలా మాట్లాడుకుంటూ ఆకాశ మల్లెలు పరిచిన రోడ్డుమీద యిద్దరం నడుస్తున్నాం. హోటల్ దాకా నడిచాం. హోటల్‌లో కూర్చొని "ఏం తీసుకుందాం ?" అని అడిగాను.

"నాకు కాఫీ" అందామె.

"దోసె తీసుకోండి. ఇష్టం కదా!"

"ఎందుకనో తినాలనిపించడం లేదు. కాఫీ చాలు"




"ఎందుకని ?"

"ఫీవరిష్‌గా వుంది"

"మరి జ్వరంగా వుంటే చలిలో బయటికి ఎందుకొచ్చారు?"

ఆమె నా వైపు చూసింది. నవ్వింది. "వస్తానని మాటిచ్చాగా!"

ఆమె ఆ మాట అన్న తర్వాత ఎన్నడూ ఎవరికీ చెప్పనంత యిదిగా నా కృతజ్ఞతను చెప్పాలనుకున్నాను. కానీ నాకు మాటలు రాలేదు. చూపులతోటే చెప్పుకున్నాను.

ఇంతలో సప్లయర్ వచ్చాడు. రెండు కాఫీ ఆర్డరిచ్చాను. కాఫీ తాగేదాకా యిద్దరం మౌనంగానే వున్నాము. ఇద్దరం హోటల్‌నుంచి బయటకి వచ్చాం.

"జ్వరం బాగా ఎక్కువగా వుందా ?" అన్నాను.

"ఫర్వాలేదు. అంత ఎక్కువ లేదు లెండి" అందామె.. నన్ను ఆమె తాకి జ్వరం ఎలా వుందో చూసినట్టు నేనూ ఆమెను తాకి ఆమె ఒళ్ళు ఎంత వేడిగా వుందో చూస్తే బావుండుననిపించింది. కానీ చుట్టూ జనం వుండడంచేతనో, నాకంత ధైర్యం లేకనో ఆమెను తాకలేక పోయాను. ఒకవేళ ఆమెకు జ్వరం ఎక్కువయితే మర్నాడు లైబ్రరీలో కని పించదేమో అనుకున్నాను. ఉండబట్టలేక "రేపు ఉదయం లైబ్రరీకి రాగలరా ?" అని అడిగాను.

"నేను ఈ మాత్రం జ్వరానికి కదల కుండా పడుకోలేను" అంది ఆమె.

"అయితే తప్పకుండా వస్తారన్న మాట"

"నడిచే ఓపిక వుంటే రావడం ఖాయం"

"నాకు జ్వరం రావడం మూలంగా నాలుగురోజులు మనం కలవలేకపోయాం. మళ్ళీ మీకు జ్వరం వస్తే మరో నాలుగు రోజులు కలవలేమేమోనని..."

"నేను కనిపించకపోతే హాస్టలుకి రావచ్చుగా !"

"రావచ్చుననుకోండి. కానీ ఎప్పుడూ మీ హాస్టలుకి రాలేదు కదా అని"

"మీకు జ్వరం అని తెలిసి చూడ్డానికి నిన్న నేను వచ్చాను, కానీ అంత క్రితం నేను మాత్రం మీ హాస్టలుకి వచ్చానా ?" అందామె.

ఆమె మాటలో రాదలుచుకుంటే ఎక్కడికైనా రావచ్చు అన్న భావం ధ్వనించింది నాకు.

'నిజంగా మీకు అంత జ్వరమే వస్తే నేను రాకుండా వుండగలనా, చూడకుండా వుండగలనా ?' అందామనుకున్నాను. అలా అనడానికి బదులు "మీకు జ్వరం రాకూడదు. మీరు రేపు ఉదయం లైబ్రరీకి రావాలి" అని మాత్రం అన్నాను.

ఆమె పకపకా నవ్వింది.

"మీరు ఆజ్ఞాపిస్తే జ్వరం రావడం మానేస్తుందా" అంది కొంటెగా.

నేను బదులు చెప్పకుండా తల వంచు కున్నాను.

"మీరు ఆజ్ఞాపిస్తే జ్వరం వచ్చినా నేను వస్తాను" అందామె.

ఆమె కళ్ళల్లోకి చూశాను. 'ఔ' నన్నట్లు కనురెప్పలతోటే చెప్పింది.

అది కొంతమంది ఆడవాళ్ళల్లో చాక చక్యం. మగవాడిని ఇంద్రుణ్ణి చేసి తమ ముందు నిలుపుకుంటారు. అతను ఎటు వంటి వాడయినా, తమ మనసుకు నచ్చిన వాడయితే అందలం ఎక్కిస్తారు. మాటల లోనూ, చేతలలోనూ తమను తాము

అర్పించుకొని తమ వాణ్ణి చేసుకుంటారు. ఆ అర్పణ ఆరాధన అనుకొని మగవాడు ఆ క్షణంలో తననే అర్పించుకుంటాడు. ప్రేమకు బందీ అవుతాడు.

నా కంటే ఎక్కువ చదువు కున్నదీ, రిసెర్చి స్కాలరూ, పైగా నాకు తెలియని విషయాలను తెలియచెప్పుతున్నదీ ఇందిర. మొదటి నుంచీ ఆమెను గౌరవించడానికే అలవాటు పడ్డాను కానీ చనువు తీసుకొనేందుకు అలవాటు పడలేదు. అలాంటిది ఆమే స్వయంగా నన్ను ఆజ్ఞాపించేవాడు గానూ, నా ఆజ్ఞను ఆమె శిరసావహించేది గానూ మాట్లాడడంతో నేను పట్టరాని సంతోషంతో వుక్కిరి బిక్కిరి అయ్యాను.

ఆమె తన హాస్టలుకు వెళ్ళిపోయింది. నేను నా రూంకి వచ్చేశాను. ఇచ్చిన మాట ప్రకారం మరునాడు ఉదయం ఆమె లైబ్రరీకి వచ్చింది. ఇద్దరం కలిశాము. పక్క పక్క కుర్చీల్లో కూర్చొని "జ్వరం తగ్గిపోయిందా ?" అంటూ ఆమె చేతిని తాకాను. ఆమె నన్ను చూసి నవ్వి "చేయి తాకితే జ్వరం తెలీదు. మెడో, చెక్కిలో తాకాలి" అంది.

"దూరంగా వున్నారు కదా!"

"దగ్గరకి రావచ్చుకదా."

"చుట్టూ జనం వున్నారు కదా !"

"దాన్నే గిల్టి కాన్షస్ అంటారు" అందామె.

నాకు తల కొట్టేసినట్లయింది. ఆమె గురించి నా వూహలు, ఆలోచనలు తప్పేమోననిపించింది. ఆమె నన్ను స్నేహితుడిగా చూస్తూంటే నేను ఆమెపట్ల నాకుగల స్నేహానికి ఏదో ప్రతిఫలాన్ని కోరుతున్నట్టు అనిపించింది ఆ క్షణంలో. నిజంగానే నేను సంకుచితంగా ఆలోచిస్తున్నానేమో ననుకున్నాను. ఆ రోజు నుంచీ మనసునిండా ఇందిరను చూడాలన్న కోరిక వున్నా ఇందిర కనిపించినప్పుడు ఇదివరలోలా చనువు తీసుకోలేక పోయేవాడిని. ముభావంగా వుండేవాడిని. ఆమె ఒక లెక్చరరుగానూ, నేను స్టూడెంటుగానూ మసులుకుందుకు ప్రయత్నించేవాడిని. దానికి కారణం లేకపోలేదు. ఆమే, నేనూ ఒకే కాలేజీలో క్లాసుమేట్స్ అయివుంటే చనువు తీసుకునేందుకు జంకేవాడిని కాదు. నేను యూనివర్సిటీలో పోస్ట్‌గ్రాడ్యుయేటు స్టూడెంటుని. ఆమె రిసెర్చి స్కాలరు. పైగా నన్ను మా ప్రొఫెసరు ఆమెకు పరిచయం చేశారు. నా ప్రవర్తన ఆమెను ఏ మాత్రం నొప్పించినా ఒక్కమాట అటు ప్రొఫెసరుతో చెప్పితే నాకు థర్డుక్లాసు రావడం ఖాయం. యూనివర్సిటీ వాతావరణం అలాంటిది ఆ రోజుల్లో కాలేజీ చదువుల్లో వున్నంత స్వేచ్ఛ యూనివర్సిటీ చదువుల్లో వుండేది కాదు. అందుకని ఏ ఎండకా గొడుగు పట్టడం బతుకుతెరువు తెలిసిన వాళ్ళ లక్షణం కాబట్టి ఇందిర నాకు చనువు ఇచ్చినా రెండడుగులు దూరంగానే వుంటూ వచ్చాను.

ఆమె మాత్రం నా చదువు విషయంలో సర్వవిధాలా సహకరిస్తోంది. తాను స్వయంగా కొన్ని ఎస్సేలు కూడా రాసి ఇచ్చింది. ఒక రోజున నేను లైబ్రరీనుంచి బయటకు వస్తూవుండగా ఇందిర ఎదురయ్యింది. "పూర్తిగా చదువులో మునిగిపోయినట్లున్నారు!" అంది. నేను నవ్వాను సమాధానంగా.

"అలసిపోయిన శరీరానికి విశ్రాంతి ఎంత అవసరమో పనిచేసే మెదడుకి వినోదం కూడా అంతే అవసరం"

అందామె. నేను నవ్వుకొని "మెదడు అలసిపోయేటంతగా నేను చదవడం లేదు లెండి" అన్నాను.

"మీరంటే సరిపోయిందా? మీరెంత కష్టపడి చదువుతున్నారో మీ ముఖమే చెబుతోంది. సిటీలో మంచి సినిమా ఆడుతోంది, మంచి ఎంటర్‌టైనరట. రాత్రికి వెడదాం," అందామె, నేను కాదనలేక పోయాను.

ఉమెన్స్ హాస్టలు దగ్గర టాంగాలు వుండవని నాకు తెలుసు. నా చెప్పు చేతల్లో వుండే టాంగా ఒకటుంది. అది బాబూలాల్ టాంగా. బాబూలాల్ టాంగా యూనివర్సిటీ కాంపౌండులోనే వుంటుంది. ఆ గుర్రం కాంపౌండులో మేస్తూవుంటుంది. బాబూలాల్ మూడు పూట్లా మా ఆంధ్రా మెస్‌లో భోంచేస్తూ వుంటాడు. వాడికి నేనంటే గురుభావం. వాడి టాంగా మీదే వారానికి రెండుసార్లు నేను సిటీకి వెళ్ళి మా మెస్‌కి కావలసిన సామాగ్రి కొని తెచ్చేవాడిని. అంచేత బాబూలాల్ నా సొంత మనిషిలా వుంటూ నా గది దగ్గరే పడుకునే వాడు. వాడికో పెద్ద చరిత్ర వుంది. అంత్రకితమే అంటే అయిదారేళ్ళ క్రితం ఓ మర్డర్ చేశాట్ట వాడు. నేరం రుజువు కాలేదట.శిక్షతప్పించుకొనిహాయిగా బతికేస్తున్నాడు. అంచేత యూనివర్సిటీలోని రీడర్సు, ప్రొఫెసర్సు కూడా వాడిని 'బాబూలాల్‌జీ' అని గౌరవంగా పలకరిస్తారు. చాలామంది విద్యార్థులు కూడా వాడంటే జంకుతారు. కానీ వాడు నాకు నమ్మినబంటు. దానికి కారణం నా కారణంగా ఆంధ్రామెస్‌లో వాడు తినే తిండే! "రాత్రి సినిమాకి వెళ్ళాలి. టాంగా తయారుచెయ్యి" అని చెప్పాను బాబూలాల్‌కి. చెప్పిన వేళకి టాంగా సిద్ధం చేశాడు. నన్ను రమ్మని పిలిచాడు. నేను టాంగా ఎక్కి కూర్చున్నాను. యూనివర్సిటీ నుంచి నాలుగు మైళ్లు వెడితేకానీ సిటీ రాదు. రోడ్డుకి అటూ ఇటూ చిట్టడవులు. మధ్యప్రదేశ్ అది. బందిపోటు దొంగలు స్వేచ్ఛగా విహరించే ప్రదేశం; బయలుదేరింది సెకండు షో సినిమాకి. నాకు బెరుకు బెరుకుగానే వుంది. కానీ బాబూలాల్ మీద నాకు నమ్మకం. మొలలో కైజారు, మెడలో జంధ్యంలా సైకిలు చైను వాడి నిత్యాభరణాలు. పైగా చేయెత్తు మనిషి. గుర్రం ఒంటి మీద దెబ్బ వెయ్యకుండా మాటలతో నడిపిస్తాడు.వాడి భాష దానికి బాగా తెలుసు. ఆ నమ్మకంతో ధైర్యంచేసి బయలుదేరాను. టాంగాను వుమెన్స్ హాస్టలు దగ్గర ఆపుచేసి, ఇందిరను పిలుచుకు రమ్మని బాబూలాల్‌నే పంపాను. వాడంటే వార్డెన్‌కి భయమే. బాబూలాల్ వెళ్ళి ఇందిరను పిలుచుకు వచ్చాడు.

టాంగా సిటీవైపు బయలుదేరింది. ఆ రోడ్డున దీపాలు లేవు. ఏదైనా లారీయో, బస్సో వస్తే లైట్లు కనబడుతాయి. లేకపోతే కటిక చీకటి, మిణుగురు పురుగుల వెలుగు అక్కడక్కడ చెట్లల్లోంచీ, పొదల్లోంచీ కనిపిస్తోంది. కీచురాళ్ళ ధ్వని వినిపిస్తోంది. గుర్రపు డెక్కల చప్పుడు లయబద్ధంగా వినవస్తోంది. ఇందిర ఏవో కూనిరాగాలు తీస్తోంది. టాంగా చక్రం ఏదైనా గోతిలో పడినప్పుడు ఇందిర నా మీదకి వాలుతోంది. సినిమా వేళకి సిటీ చేరుకున్నాం. "తుంసా నహీదేఖా" సినిమా. ఇందిర, నేనూ రిజర్వ్డు టిక్కెట్లు తీసుకున్నాం. బాబూలాల్‌ని బెంచీ టిక్కెట్టుకి పంపించాము. సినిమా




చూస్తూన్నంత సేపూ ఇందిర ఏదో మాట్లాడుతూనే వుంది. నేను 'వూ' కొడుతూనే వున్నాను. మొత్తం మీద సినిమా చూశాం. మధ్యలో ఒకసారి వోరగా చూశాను. ఆమె నన్నే చూస్తోంది. నా చూపులు తిప్పుకున్నాను. ఆ తరువాత కావాలనే నా చూపులను ఆమె చూపులతో కలపలేదు. తిరిగి మళ్ళీ టాంగాలో బయలు దేరాం.

బాగా చలిగా వుంది. టాంగా వేగంగా కదులుతూవుంటే చలిగాలి తాకిడికి వణుకు పుడుతోంది. నేను వేసుకున్న కోటు చలిని ఆపలేక పోతోంది. ఇందిర కూడా అదే పరిస్థితిలో వుంది.

"బాగా చలిగా వుందికదూ!" అందామె

"అవును. మేట్నీకి వేళ్ళాల్సింది"

"ఎందుకనో నాకు మేట్నీ అంటే ఇష్టం వుండదు."

"మీకు చలి అంటే ఇష్టమా?"

"మీ కిష్టం లేదా?"

"ఇష్టమేమిటండి బాబూ! ఒళ్లు గడ్డ కట్టుకు పోతూంటే..." అని అరచేతులు రుద్దుకొని చెంపలకు కాచుకున్నాను.

"అలా తగ్గదు చలి..."

"మరి?"

"మంటేసుకోవాలి!"

"టాంగాలోనా కాలిపోదూ?"

ఆ మాటకామె నవ్వింది.

"దగ్గర దగ్గరగా కూచుంటే అంతచలి అనిపించదు," అంటూ ఇందిర నాకు చేరువయింది.

ఆమె ప్రొఫెసరు పరిచయం చేసిన రిసెర్చి స్కాలరు కాకపోతే నేనూ మరింత చేరువై ఆమెను దగ్గరకు తీసుకొని వెచ్చగానే వుండేవాడిని. కానీ నా భవిష్యత్తు గుర్తుకు వచ్చేసరికి నేను తెగించలేక పోయాను. నాలో చలనం లేకపోవడం చూసి ఇందిర మరికాస్త చేరువై "అలా ముడుచుకు కూర్చుంటే చలి మరీ ఎక్కువవుతుంది. కాస్త ఇటు జరిగి ఒళ్ళూ ఒళ్ళూ తగిలేలా కూర్చుంటే కావలసినంత వేడి" అంది. చుట్టూ చీకటి. ఎదర బాబూలాల్, వెనక ఇందిరా, నేనూ. వాతావరణం ప్రోత్సాహ కరంగానే వుంది. కానీ ధైర్యం చాలటం లేదు.

ఆమె ఒక్కసారి ఆవులించి "నాకు భలే హాయిగా వుంది. నిద్రముంచుకొస్తోంది" అంటూ ఆమె తలను నా భుజం మీద వాల్చింది. గాలికి కదిలే ముంగురులు నా ముఖానికి తగులుతున్నాయి. ఆమె మెత్తని చెక్కిళ్ళకు నా కోటు గుచ్చుకుంటోంది. ఇక నేను వుండబట్టలేక నా చేతిని ఆమె భుజానికి చుట్టి కొద్దిగా దగ్గరకి లాక్కున్నాను. మరో చేతితో ఆమె చెక్కిలిని నిమిరాను. నా చేతి చల్లదనానికి ఉలిక్కిపడి ఆమె నాలో ఒదిగి పోయింది. ఆమె వెచ్చని శ్వాసలు నా గుండెలకు తాకి నా తనువు నంతా వేడి చేశాయి. ఆమె నన్ను వదల లేక పోతోంది. నేనామెను వదల లేక పోతున్నాను. ఆమె వీపునంతా నిమిరాను. ఆమె సన్నని నడుము చుట్టూ చేతిని చుట్టి మరింత దగ్గరికి తీసుకున్నాను. ఆమె నా ఒడిలో వాలి పోయింది. అంతలో టాంగా యూనివర్సిటీ కాంపౌండులోకి ప్రవేశించింది.

"మీ హాస్టలు వచ్చేసింది" అన్నాను ఆమె చెవిలో.

"అప్పుడేనా!" అందామె నా ఒడిలోంచి లేవకుండానే

"ఎవరైనా చూస్తే బాగోదు"

"ఇంత రాత్రివేళ చలిలో ఎవరూ

బయటకి రావులెండి"

టాంగా ఆగింది.

"దిగండి యింక !" అన్నాను.

అయిష్టంగా నా ఒళ్ళోంచిలేచి, బద్ధకంగా ఒళ్ళు విరుచుకొని టాంగా దిగింది ఇందిర.

"థాంక్యూ, గుడ్‌నైట్ !" అని నాకు చెప్పి హాస్టలు గేటు వైపు నడిచింది ఆమె. టాంగా నా హాస్టలు వైపు మళ్ళింది. ఆ సంవత్సరం అంతా అలా అప్పుడప్పుడూ మేం కలుసు కుంటూనే వున్నాం. ఇద్దరం కూడా ఒకరినొకరం చూడకుండా వుండలేక పోయేవాళ్ళం.

పరీక్షలు వచ్చాయి. ఎం. ఎస్ సి. ప్రీవియస్ పరీక్షలు చాలా బాగా రాశాను. నేను అంత బాగా పరీక్షలు రాయడానికి కారణం చాలా వరకూ ఇందిర ప్రోత్సాహ సహకారాలే.

వేసవి శలవలకు అందరం బయలు దేరుతున్నాం. లైబ్రరీ దగ్గర ఇందిర నన్ను కలిసింది.

"మీ వాళ్ళందరినీ వెళ్ళి పోనీయండి. ఒక్కరోజు ఆగి మనిద్దరం కలిసి బయలు దేరుదాం" అందామె.

"మరి నా టిక్కెట్టు రిజర్వు అయి పోయింది ! ఫలానా రోజుకి వస్తున్నానని ఇంటికి వుత్తరం రాశాను కూడా," అన్నాను.

"అన్న రోజుకే వెళ్ళకపోతే మీరు తప్పిపోయారని వెతుక్కుంటారా మీ వాళ్ళు ?" అంది ఆమె కొసల నుంచి కోపంగా.

కోపంలో ఇందిర మరీ అందంగా వుంది. అలా బతిమాలించుకోవడంలో ఏదో అనుభూతిని పొందాను నేను.

"ఏమీ అనుకోకండి. మా స్నేహితు లందరితోటీ నేను వస్తున్నానని చెప్పాను. సడన్‌గా రావడం లేదంటే నిరుత్సాహ పడతారు. ఏవేవో వూహించుకుంటారు. నేను తిరిగి వచ్చేటప్పుడు రెండు రోజులు ముందు బయలు దేరుతాను. ఏ ట్రైనుకి వచ్చేదీ వుత్తరం రాస్తాను. నాగపూర్‌లో మీరు కలవచ్చు" అని నచ్చ చెప్పడానికి ప్రయత్నించాను.

"ఓ. కే. మిస్టర్ నారాయణరావు! నచ్చిన వాళ్ళని మనం ప్రేమించగలం, కానీ మనల్ని ప్రేమించే మనిషి దొరకటం వరం" అని ఆమెకదిలింది.

"ప్లీజ్ ! ఈ ఒక్కసారికి నా మాట వినండి. ఉత్తరాలు రాస్తూ వుండండి. మీ వుత్తరం కోసం ఎదురు చూస్తూ వుంటాను" అన్నాను.

ఆమె నా కళ్ళల్లోకి సూటిగా చూసి "థాంక్యూ" అంది ఎంతో తృప్తిగా.




వేసవి శలవలకు వచ్చి లక్ష్మితో దాంపత్య జీవితాన్ని గడుపుతున్నాను. లక్ష్మి చూపుతున్న అనురాగం, అభిమానం నా మనసును అన్ని జ్ఞాపకాలకూ దూరం చేసి కడిగిన ముత్యంలా చేశాయి. మనసా, వాచా, కర్మగా లక్ష్మికి నేను భర్తను, ఆమె నాకు భార్య. అనుకోకుండా ఒక రోజున నేను మా వూరికి వచ్చిన మ రు నా డే ఇందిరకు రా సి న

వుత్తరానికి ఇందిరనుంచి సమాధానం వచ్చింది, అది సాధారణ వుత్తరం కాదు. అపురూపమైన ప్రేమలేఖ.

మనసులు కలిసిన వారి తనువులు దూరంగా వున్నప్పుడు మనసు పడే ఆరాటాన్ని, తపననీ పీలైనంత వాడిగా, వేడిగా మాటలలో పొదివిన లేఖ అది. ఇందిర అనుభవిస్తున్న విరహాన్ని ఉత్తరంలో చదువుకొని కొన్ని క్షణాలపాటు నా మనసునిండా ఆమెనే నింపుకున్నాను. ఆ పగలంతా ఆమె ఆలోచనే. ఆ రాత్రి రోజూలా లక్ష్మితో కలిసి మెలిసి వుండలేక పోయాను. నా మనసు ఎందుకో బాగా లేదనుకొని లక్ష్మి నిద్రపోయింది. నేసింకా మెళకువగానే వున్నాను. నా కుడి జబ్బమీద చెక్కిలి ఆన్చి ఆమె చేతిని నా గుండెలమీద వేసి ఆదమరచి నిద్రపోతున్న లక్ష్మిముఖంలోకి చూశాను. నేను తన పక్కనే వున్నానన్న ధైర్యం, జీవితాంతం అలాగే వుంటానన్న నమ్మకం ఆమె నిర్మల ముఖంలో నాకు కనిపించాయి. అంత నమ్మకంతోటీ, విశ్వాసంతోటి లక్ష్మి నా పక్కన వుండగా మరో స్త్రీ గురించి నా మనసు అర్రులు చాచడం తలచుకుంటే నామీద నాకే అసహ్యం వేసింది. ఆమెవైపు వొత్తిగిలి మనసారా ఆమెను హృదయానికి చేర్చుకున్నాను.

ఇందిరికిచ్చిన మాట ప్రకారం ఆమె నుంచి వచ్చిన ప్రతి వుత్తరానికి ఆమెకు తృప్తి కలిగేలా సమాధానాలు రాస్తూనే వున్నాను. శలవలు గడిచిపోతున్నాయి. యూనివర్సిటీకి వెళ్ళాల్సిన రోజులు దగ్గర పడుతున్నాయి. రెండు రోజులు ముందుగా బయలుదేరుతానని ఇందిరకిచ్చిన మాట గుర్తుకొచ్చి ఏ రోజున బయలు దేరేది ఉత్తరం రాద్దామని కూర్చున్నాను. లక్ష్మి తలంటు పోసుకుని, పట్టు చీర కట్టుకొని నా దగ్గరికి వచ్చింది. నా చేతికి అక్షింతలు ఇచ్చి పాదాలకునమస్కరించింది. నెత్తిన అక్షింతలు వేశాను.

"ఏమిటీ హడావుడి అంతా?" అన్నాను.

"నోము పట్టాను" అంది లక్ష్మి.

"ఏం నోము?"

"గ్రామ కుంకుమ నోము."

"అంటే?"

"ఊళ్ళోని అందరుముత్తయిదువులకు పసుపు కుంకుమ పంచి పెట్టాలి."

"దేనికి?"

"అలా పంచిపెడితే పంచిపెట్టిన వారి పసుపు కుంకుమలు కలకాలం వుంటాయట"

ఆమె మాటలు విన్న తర్వాత ఎందుకనో నా కళ్ళు చెమ్మగిల్లాయి. ఆమె ముఖంలోకి చూశాను. నిష్కళంకమైన ఆమె భక్తి విశ్వాసాలు, అనురాగ అభిమానాలు నన్ను కదిలించి వేశాయి. మరో ఆలోచన నాకు రాలేదు. ఇందిరకు ఫలానా రోజుకు వస్తానని రాద్దామనుకున్న ఉత్తరం రాయలేకపోయాను. కానీ మరో ఉత్తరం రాశాను. "నాకు జ్వరం. ఎప్పుడు బయలు దేరేదీ చెప్పలేను" అని మాత్రం రాశాను.

కూడదన్న పని చేయడం మనిషి స్వభావం. కూడని పనిచేసి దాన్ని కప్పిపుచ్చుకోవడానికి అబద్ధమాడడం. సాధారణం.కానీ, నీతి తప్పకుండా ఒక గాడిలో బతకడం ఒక తపస్సు. తపస్సు అందరికీ సాధ్యపడేది కాదు. తప్పు చేయడం సాధారణంగా చాలా మంది చేసేది. కొందరు చేసిన తప్పు తెలుసుకుంటారు. అయినా తిరిగి చేయకుండా వుండలేరు.

కొందరు చేసిన తప్పును తెలుసుకొని దిద్దుకొని బుద్ధిగా బతకగలుగుతారు. అది నిగ్రహం వున్న వాళ్ళకే సాధ్యం. నిగ్రహం సాధనతో వచ్చేది. నిగ్రహం లేనివాళ్ళు వ్యసనాలకు బానిసలవుతారు. నిగ్రహం వున్నవాళ్ళు వ్యసనాలను బానిసలుగాచేసుకుంటారు. కాసీనేనేకోవకు చెందినవాడినో నాకు అర్థం కాదు. నాది నీటి లాంటి మనసు. ఏ పాత్రలో పోస్తే ఆ పాత్ర ఆకారానికే యిమిడిపోతుంది. 'ఇదీ నా ఆకారం' అంటూ నాకులేదు. కళ్ళముందు లక్ష్మి వుంటే నేను లక్ష్మి మనిషిని. లక్ష్మి నా సర్వస్వం. అంత క్రితం అభినేత్రి నా సర్వస్వం. ఇప్పుడు లక్ష్మిని వదిలి ఇందిరను చేరువైతే ఇందిర మనిషినే అయిపోతాను. ఇందిర గురించే ఆలోచిస్తాను. 'ఇది నా బలహీనతా? లేక వాళ్ళ వాళ్ళ బలమా?' అని ఆలోచించుకుంటే అగమ్యగోచరంగా వుంటుంది. 'ఆలోచించకుండా వుండడమే మనిషికి



హాయి' అనిపించింది. ఆలోచించకపోతే మనిషికీ, పశువుకీ తేడా యేమిటి? అని విజ్ఞత హెచ్చరించింది. ఇంక ఆపైన ఆలోచించే వోపికలేక నాకు 'జీవితం చాలా చిన్నది. తప్పొప్పుల బేరీజు వేసు కోడానికే జీవితాన్నంతా వ్యయం చేసే బతుకే అక్కౌంటు పుస్తకం అయిపో తుంది. నా జీవితాన్ని నేను నడుపుతాను అనుకోవడంకంటే జీవితం నడిపినట్లు నడవడమే మనిషికి సుఖమేమో. నిజానికి కర్మ సిద్ధాంతం కూడా అదేనేమో! నువ్వు ఏమౌతావో, ఏం కావాలో యెప్పుడో రాసిపెట్టి వుంటుంది. అది పూర్వజన్మ కర్మఫలం. నువ్వు నిమిత్త మాత్రుడిగా తల వంచడమే అన్న వాదనను నమ్మితే బతుకు నడిపినట్లు బతకడమే మనిషి చేయగలిగింది'-అని సరిపెట్టుకున్నాను.

అలా కొంత మనో సంఘర్షణను అనుభవించి సాగర్‌కు ప్రయాణ మయ్యాను. యూనివర్శిటీ తెరిచిన నాలుగవ రోజుకు సాగర్ చేరుకున్నాను. అప్పటికే నా క్లాసుమేట్సు అందరూ చేరుకున్నారు. మర్నాటి వుదయమే తయారై లైబ్రరీకి వెళ్ళాను. నేను లైబ్రరీలోకి అడుగు పెట్టగానే ఇందిర కూడా వచ్చింది. ఆమె నన్ను చూడలేదు. నేనే కల్పించుకొని "నమస్తే" అంటూ చేతులు జోడించి నిలబడ్డాను. నన్ను ఆపాద మస్తకం పరిశీలనగా చూసి "నమస్తే" చెప్పింది. మారు మాటాడ కుండా లోపలికి వెళ్ళిపోయింది. నేను ఆమె వెనకనే వెళ్ళి నాకు సంబంధించిన పుస్తకాలు వుండే రాక్ దగ్గర ఓ కుర్చీలో కూర్చున్నాను. ఆమె నాకు కాస్త ఎడంగా కూర్చుంది. ఆమెను నేను చూస్తున్నా ఆమె నన్ను చూడటంలేదు. చూడక పోవడం కాదు. చూడదలుచుకోలేదను కుంటాను. ఎలా పలకరించాలో నా కర్థం కాలేదు. పలకరిస్తే ఎలాంటి సమాధానం వస్తుందోనన్న భయం. అలాంటి సంది గ్ధంలో నాకు పులమారింది. దగ్గుపొర వచ్చింది. ఎంతకీ ఆగకపోవడంతో తక్కిన వాళ్ళకి యిబ్బంది కలిగించడం యిష్టంలేక బయటకి వెళ్ళిపోయాను. బయటకు వెళ్ళి గొంతు క్లియరు అయ్యేదాకా దగ్గి జేబు రుమాలు తీసుకొని కన్నీటిని వత్తుకు న్నాను.

"ఏమైంది?" అంటూ వచ్చింది నా వెనకనే ఇందిర. సమయం దొరికింది కదా అనుకున్నాను.

"మొన్నటి దాకా న్యుమోనియా. డాక్టరింకా రెస్టు కావాలని చెప్పాడు. కానీ వచ్చేశాను" అని తల వంచుకొని చెప్పాను.

తనను చూడకుండా వుండలేక వచ్చేశా ననుకుంది ఇందిర.

"ఇప్పుడు కులాసాగా వుందా?" అని అడిగింది ఆప్యాయంగా.

"ఫరవాలేదు" అన్నాను ముక్తసరిగా.

"అలా విపులంగా ఉత్తరం రాయొ చ్చుగా!"

"మీరు కంగారు పడతారేమోనని రాయలేదు"

"ఒక వ్యక్తి మీ కోసం కంగారుపడు తుందని గుర్తుంది మీకు. చాలు"

"మర్చిపోతే కదా గుర్తు వుండడం అన్న సమస్య"

ఆమె ముఖం విప్పారింది. మాట్లాడ కుండా వున్న ఆమెను ఎందుకు మళ్ళీ పలకరించకుండా వుండలేకపోయానో,




అబద్ధం ఆడి ఆమెను ప్రసన్నం చేసుకో డానికి ఎందుకు ప్రయత్నించానో నాకే తెలీదు. అదంతా ఒక ఆట. నాకు దూరంగా వుంటే ఏమోకానీ, కళ్ళముందు వుండి ఇందిర కోపంగా మూతి బిగించు కొని కూర్చుంటే నాకు తోచలేదు. తోచకపోవడమే కాదు. ఏదో కొంత బాధ అనిపించింది కూడా! అలా ఇద్దరం కలిసి పోయాం మళ్ళీ.

ఓ వారం గడిచాక ఇందిర మళ్ళీ 'సినిమాకు వెళదాం' అంది. ఇద్దరం బాబూలాల్ టాంగాలో సిటీకి బయలు దేరాం.

సినిమా చూశాం. మేం హాలులో వుండగానే వర్షం ప్రారంభమైంది. బయటకు వచ్చేసరికి కుండపోతగా వర్షం, ఈదురు గాలి.

బాబూలాల్ వచ్చి "ఇంత వర్షం లోనూ, గాలిలోనూ బయలుదేరడం మంచిది కాదు. గాలికి చెట్లు దారికడ్డంగా పడిపోయుండచ్చు. పడచ్చు కూడా" అని సలహా ఇచ్చాడు.

"అవును. మొన్ననే న్యూమోనియా నుంచి కోలుకున్నారు. తడవడం మంచిది కాదు. ఏదైనా హోటలులో ఈ రాత్రికి ఉండి వర్షం వెలిశాక ఉదయాన్నే వెళ్ళడం మంచిది" అని ఇందిర కూడా సలహా ఇచ్చింది.

ఇద్దరం కలిసి బాబూలాల్ టాంగాలో దగ్గర్లో వున్న హోటల్ చేరుకున్నాం. డబుల్ రూం తీసుకున్నాం. కొద్దిగా తడిశాం. హోటల్ వాడిచ్చిన టవల్సుతో ఒత్తు కున్నాం. రూం వెచ్చగానే వుంది. రెండు మంచాలూ కలిసే వున్నాయి. వేరు చేయ మని ఇందిర అడగలేదు. చెరో మంచం మీద నడుం వాల్చాము.

బయట వర్షం యింకా కురుస్తూనే ఉంది. ఇందిర మాట్లాడుతూనే వుంది. నాకు నిద్ర రాకపోయినా కావాలని కళ్ళు మూసుకున్నాను.

"ఇంత హాయిగా వర్షం కురుస్తూంటే నిద్రెలా వస్తోంది మీకు?" అంది ఇందిర నా ముఖంలోకి ముఖం పెట్టి.

నేను కళ్ళు తెరిచి "బయటకి వెళ్ళి తడుద్దాం అంటారా?" అన్నాను.

"అలా తడవడం నాకు చాలా సరదా"

"ఇంకా నయం వర్షంలో వానాలప్ప తిరుగుదాం అన్నారు కాదు"

"రియల్లీ ఐ లైకిట్" అంటూ నా ముక్కు పట్టుకొని ఆడించింది.

అలా ఆమె నన్నొక పసివాడిలా ట్రీట్ చేయడం సరదాగానే వుంది నాకు. బయట ఒక ఉరుము ఉరిమింది. గమ్మ త్తుగా అరిచి నన్ను కౌగలించుకుంది.

"అంత భయమా?" అన్నాను.

"మీరు పక్కనుండబట్టి అరిచి వూరు కున్నాను. లేకపోతే ఏడుస్తూ కూర్చునే దానిని. వర్షం అంటే సరదా కానీ ఉరుము లంటే చచ్చేంత భయం నాకు" అంది.

"ఆ ఉరుముల్లోంచి వచ్చే మెరుపులు చూడ్డానికి ఎంత అందంగా వుంటాయో తెలుసా?"

"ఉరుములకి దడిసి ఇలా మీ మీదకి వాలిపోయిన నా కంటేనా?" అందామె మత్తుగా నవ్వుతూ.

ఆ క్షణంలో ఇందిర నిజంగా మెరుపు తీగలాగే వుంది. ఆమె నడుమును నా సందిట్లోకి తీసుకున్నాను. ఆమె చెంపలు కెంపుల కాంతులు! ఆమె కళ్ళల్లో ఎర్ర గులాబీలు! ఆమె నవ్వులు రవ్వల వెలుగులు! మైమరపించే వెచ్చటి నిట్టూ

వ్వులు–ఆమె అణువణువూ వరూధిని. కానీ నేను ప్రవరాఖ్యుణ్ణికాను. నారాయణ రావుని. పాత్ర ఆకారానికి ఇమిడిపోయే నీటిని. ఆమెలో ఇమిడి పోయాను.

ఆ వర్షం రాత్రి తీయగా, హాయిగా గడిచిపోయింది. చలి మా కౌగిళ్ళ వెచ్చదనంలో ఆవిరై పోయింది. ఆమె ముఖం వెన్నెలలో జలకాలాడిన విరిసిన మల్లెలా విరబూసింది.

అది ప్రారంభం.

అనుకోకుండా ఆ రాత్రి అంత తీయగా సాగిపోయింది. కానీ ఆ తరువాత కావాలనుకొని, ఇద్దరం కూడబలుక్కొని పరీక్షలు దగ్గర పడేలోపున మరో నాలుగు రాత్రిళ్ళు మా రాత్రిళ్ళుగా గడిపాము.

తొలిరేయి గడిచిన తరువాత మరునాడు యూనివర్సిటీలో ఒకరిని చూసి ఒకరం సిగ్గు పడ్డాం. ఒకరి ముఖంలోకి ఒకరం తేరబారి చూడలేక పోయేవాళ్ళం. అలాంటిది రాను రాను చుట్టూ వున్న జనాన్ని కూడా పట్టించుకోకుండా కలిసి మెలిసి తిరగసాగాం. ఇద్దరికీ ధైర్యం వచ్చింది.

ఎం.ఎస్‌సి. ఫైనల్ పరీక్షలు రాశాను. ఫస్టు క్లాసు వస్తుందని గట్టి నమ్మకం. మరునాడు మా ఊరికి బయలుదేరు తున్నాను. అదే రోజున ఇందిర కూడా బయలు దేరుతోంది. నెల క్రితమే ఆమె థీసిస్ సబ్మిట్ చేసింది. నేను యూనివర్సిటీలో వున్నన్నాళ్ళూ నాతోనే వుండాలనీ, నాతో కలిసే యూనివర్సిటీ వదిలి వెళ్ళాలని ఆగిపోయిందామె. ఇద్దరం రైలెక్కాం. బీనా స్టేషనులో గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ కాచ్ చేశాం. నాగపూరులో యిద్దరం దిగి పోయాం. ఇదంతా ఇందిర ఆదేశాను సారమే జరుగుతోంది.

నాగపూరు సిటీలోకి వెళ్ళి ఒక హోటలులో దిగాం. ఆ రాత్రంతా ఆఖరి రాత్రన్న భావనతో ఆమెతో చాలా స్వేచ్ఛగా, ఆనందంగా గడిపాను. ఇక మళ్ళీ ఇందిర కలవదన్న ఆలోచన వస్తే నాకు ఏడుపు వచ్చేస్తోంది. ఆమె సంస్కారానికి మరో రూపం. సభ్యతకు ప్రతిరూపం. అన్నిటికీ మించి అందం, ఆకర్షణ ఆమెకు జన్మతహా వచ్చిన ఆభరణాలు. ఆమెతో సాంగత్యం ఒక అపురూప వరం.

అలసి నా గుండెలమీద తల ఆన్చి సేద తీర్చుకుంటున్న ఇందిర ముఖంలోకి చూస్తూ అలా ఆలోచించుకుంటున్నాను.

"మీరు యింటికి వెళ్ళింతర్వాత నన్ను మర్చిపోరు కదా" అందామె. ఆమె కళ్ళు అప్పటికే చెమ్మగిల్లాయి.

"ఛ! ఏమిటది! నేను బతికినంత కాలం నిన్ను మర్చిపోలేను" అన్నాను ఆమె కళ్ళను వొత్తుతూ.

"థాంక్యూ" అందామె బరువుగా నిట్టూర్చి.

ఇద్దరి మధ్యా కొన్ని క్షణాలు నిశ్శబ్దం.

"మీ పెద్దవాళ్ళతో మాట్లాడి, ఒప్పించి త్వరగా మీరు నన్ను మీ దాన్ని చేసుకోవాలి. నాకు అమ్మానాన్నా లేరు. అన్నగారింటో వుంటున్నాను" అందామె. నా గుండె గతుక్కుమంది.

ఎలా బదులు చెప్పాలో, ఏమని బదులు చెప్పాలో నాకు తోచ లేదు. మౌనంగా వుండిపోయాను.

"మాట్లాడరేమిటి?" అని అడిగిందామె లేచి కూర్చుని.




"ఏమిటి ?" అన్నాను.

"ఏమిటేమిటి ? మనం పెళ్లి చేసుకోవాలి" సూటిగా చెప్పిందామె.

"పెళ్ళా ?"

"ఏం చేసుకోరా ?"

"నాకు పెళ్ళి అయిపోయిందికదా !"

ఆమె నెత్తిన పిడుగు పడ్డట్లయింది నా మాట.

"అయిపోయిందా ? మీ అప్లికేషనులో అన్‌మేరీడ్ అని ఎందుకు రాసుకున్నారు" అని నిలదీసి అడిగింది.

"అప్లికేషను పెట్టేనాటికి పెళ్ళి కాలేదు" అన్నాను. ముద్దాయిలా.

నిజానికది నాకు పెళ్ళయ్యాక పెట్టిన అప్లికేషనే.

ఆమె రెచ్చిపోయింది.

"పెళ్ళయిన వాడివి ముందుగా చెప్పక్కర్లేదూ ? పెళ్ళికాక నీ నుంచి ఏం ఆశించి యింతకాలం నిన్ను ప్రేమించాను ? ఇంత మోసగాడివి అనుకోలేదు. యు ఆర్ ఏ క్రూక్. చీట్. నిలువెల్లా విషమే నువ్వు. నన్ను మోసం చేశావు. నా జీవితాన్ని నాశనం చేశావు" అంటూ విరుచుకు పడింది ఇందిర.

"మీకు పెళ్ళయిందా అని నువ్వెందుకు అడగలేదు ?" అందామనుకున్నాను. కానీ అనలేక పోయాను. ఓదార్పుగా "నిన్ను రెండో భార్యగా చేసుకుంటాను" అన్నాను.

"షటప్ ! నేను రెండో భార్యగా ఎవరికీ కాలేను. రెండవ మగవాడుగా నా కెవరూ అక్కర్లేదు. తలుచుకుంటే నా జీవితాన్ని నాశనం చేసిన నిన్ను సర్వనాశనం చేయగలను. ఒక్క మాట నేను ప్రొఫెసరుతో చెబితే నీకు థర్డుక్లాసే వస్తుంది. ఈ గదిలోనే నిన్ను హత్య చేయగలను. నన్ను బలవంతంగా తీసుకొచ్చి రేప్ చేశావని అరెస్టు చేయించగలను. కానీ నిన్ను నేను ఏమీ చేయదలచుకోలేదు. ఎందుకో తెలుసా ? ఒకనాడు నిన్ను మనసారా ప్రేమించిన పాపానికి. జరిగిందంతా శాపంగా భరించదలచుకున్నాను. నీకు నేను అపకారం చేయలేను. చేతకాదు. ప్లీజ్ గెటవుట్ !" అని భోరున ఏడవడం మొదలు పెట్టింది ఇందిర.

ఆమెను ఎలా ఓదార్చాలో తెలియక నా సూట్‌కేసు తీసుకొని రూంలోంచి బయటకి నడిచాను. ఆ క్షణంలో నేను నారాయణరావుని కాను. మొదటిసారి హత్యచేసిన హంతకుడిలా వణికిపోతున్నాను. గది గుమ్మం దాటుతూ ఒక్కసారి వెనక్కి తిరిగి చూశాను. ఆమె నన్ను చూడలేదు. మా స్నేహం అలా ముగుస్తుందని నేననుకోలేదు. ఆమెకు ఆవేశం తగ్గిన తర్వాత బాధకాస్త మరిచిపోయాక, ఎప్పుడైనా ఎక్కడైనా కనబడితే క్షమార్పణ చెప్పుకోవాలి అనుకున్నాను.

ఇది నా మూడవ ప్రేమ మజిలీ.




చదువు పూర్తి చేసుకొని యూనివర్సిటీ నుంచి మా వూరికి వచ్చేశాను. కొన్నాళ్ళపాటు మనసంతా యూనివర్సిటీ

వాతావరణం చుట్టూనే తిరుగుతూ వుండేది. ప్రొఫెసర్లు, క్లాసులు, లైబ్రరీ, ఆంధ్రా మెస్, ఈవెనింగ్ వాక్, ఆకాశ మల్లెలు పరచిన రోడ్డు ఆ రోడ్డున ఇందిరా, నేనూ నడుస్తూ గడిపిన సాయంత్రాలు, స్నేహితులూ పదే పదే జ్ఞాపకం వచ్చేవి. లక్ష్మి నా పక్కనే వున్నా గతంలో కలిసిపోయిన వాతావరణాన్నీ, జ్ఞాపకాల్నీ మరిచిపోలేక పోతున్నాను. ఒకవేళ మరిచిపోవడానికి ప్రయత్నించినా, లక్ష్మి ఇంటర్మీడియట్ దాకా చదువుకున్న అమ్మాయి కావడంచేత ఎంతో కుతూహలంగా యూనివర్సిటీ విషయాల గురించి అడుగుతూ వుండేది. ఇందిరకు, నాకు వున్న పరిచయం తప్ప అన్ని విషయాలూ లక్ష్మికి చెప్పేవాడిని. నేను మాట్లాడుతూవుంటే లక్ష్మికి వినడం సరదా. నేను తన ముందు కూర్చుని మాట్లాడుతూ వున్నప్పుడు రేడియో కట్టేసేది. నన్ను పసివాడుగా చూసుకునేది. పొద్దున్న లేచింది మొదలు రాత్రి పడుకునే దాకా నా సంరక్షణలోనే ఆమె కాలక్షేపం. ఆ ఆదరణ, అభిమానం అన్నింటికీ మించి నా పట్ల చూపే ప్రేమ లక్ష్మికి నన్నెంతగానో దగ్గరకు చేర్చాయి. ఆమె ప్రేమలో కొండంత భక్తి కూడా వుంది. ఆమెకు నేనే ప్రపంచం. నేనే సర్వస్వం. నా సాంగత్యం ఆమెకు ఒక తపస్సు. లక్ష్మిలో తాపసిని చూశాను. ఆమె పట్ల నాకు కూడా ప్రేమతోబాటు గౌరవం పెరిగింది.

'ప్రేమ' అన్న పదం గతంలో చాలా సార్లు వాడాను. కంటికి కనిపించనిది, చేతికి దొరకనిది, మనసుకు అనిపించేది మాత్రమే ప్రేమ. పి.ఆర్. కాలేజీలో వున్నప్పుడు కస్తూరితో కొంచెం పరిచయం పెరిగాక ఆమెను ప్రేమిస్తున్నానేమో అనుకున్నాను. విశాఖపట్నంలో అభినేత్రిని ప్రేమించాననుకున్నాను. అనుకోవడమేమిటి, ప్రేమించాను. ప్రేమించానని అభినేత్రితో చెప్పాను. ప్రేమంటే అభినేత్రికీ, నాకూ మధ్యగల అనుబంధమే అనుకున్నాను. ఆ అనుబంధం, ప్రేమ పెళ్ళిదాకా రాకుండా రేవుకు చేరలేని పడవలా ప్రవాహం మధ్యలోనే మునిగిపోయింది. పడవ మునిగినా ప్రయాణీకులు వొడ్డుకు చేరినట్టు ప్రేమ మునిగినా నేను వేరే వొడ్డుకు చేరుకున్నాను. 'లక్ష్మి తీరాని'కి చేరుకున్నాను. అభినేత్రి ఏ తీరానికైనా చేరిందో, పడవతోబాటు మునిగిపోయిందో నాకు తెలీదు. తెలుసుకోవడానికి ప్రయత్నం కూడా చేయలేదు. నాదీ అన్న తీరం నాకొకటి అగ్నిసాక్షిగా ఏర్పడిన తర్వాత కూడా అగ్నిసాక్షిని కోర్టులోని అబద్ధం సాక్షిలా పెద్ద లెక్కలోకి తీసుకోకుండా సాగర్‌లో ఇందిరతో ప్రేమలో పడ్డాను. ఆమె కనిపించకపోతే ఆరాట పడ్డాను. ఆమెను కలియడానికి హైరాన పడిపోయాను. తీరా ఆమె పెళ్ళి చేసుకోమంటే నాకు పెళ్ళైపోయిందని చెప్పాను. 'నెత్తి వాచేలా చివాట్లు పెడితే తలవంచుకున్నాను. అలా ఆమె చివాట్లు పెట్టి వుండకపోతే ఇందిరను ఈ నాటికీ స్మరించుకుంటూనే వుండే వాణ్నేమో. ఆమె నోటికొచ్చినట్లు నన్ను నిందించడంతో ఆమెపట్ల నాకు ప్రేమ తగ్గి కోపం పెరిగింది. తప్పంతా నాదేనన్నట్లూ, తన నేదో మోసం చేసినట్లూ వాగుతుందా?– ఎంత రిసెర్చి స్కాలరయితే మాత్రం! ఆడదానికి అంత అహంకారమా? అని




మగవాడుగా ఆలోచించాను. అలా ఆలోచించ బట్టే ఇందిర పట్ల నేను పెంచుకున్న ప్రేమ క్రమక్రమంగా పల్చబడింది. లక్ష్మి నాపట్ల చూపే ప్రేమ రోజు రోజుకీ పెరిగి నన్ను ఆమెకు మరింత సన్నిహితం చేశాయి.

ఇంతకీ ఏది ప్రేమో నాకు అర్థం కావడం లేదు. రోడ్డునపోయే నన్ను లోపలికి పిలిచి రూపాయి కూడా ఆశించకుండా సత్యవతి సుఖపెట్టింది. ఆమె వ్యభిచారిణే కావచ్చు. ఆ క్షణంలో నేనామెను ప్రేమించక పోయినా ఆమె చూపింది ప్రేమే ననిపించింది. ఇంతకీ ఎవరిది నిజమైన ప్రేమ? సత్యవతిదా? అభినేత్రిదా? ఇందిరదా? లక్ష్మిదా? తాళి కట్టించుకున్న వ్యక్తి చూపినదే ప్రేమా? మిగిలిన వాళ్ళది కాదా? అసలు ప్రేమకీ, కామానికీ తేడా ఏమిటి? ఏమో! నేను మాత్రం అందరినీ సమంగానే ప్రేమించాను! ఎవరి ధ్యాసలో వున్నప్పుడు వారిని మనసా, వాచా, కర్మణా ఆరాధించాను, అభిమానించాను, ప్రేమించాను! అది ప్రేమకాదు వాంఛ, తృష్ణ, కామం అని పేర్లు పెడితే అవన్నీ కట్టుకున్న భార్య నుంచి కూడా నేను కోరుకున్నాను.

ఇంత తర్జన భర్జన 'ప్రేమ' గురించి జరిగిన తర్వాత ఒక్కటే అనిపిస్తుంది నాకు. నేను 'ప్రేమ' అనుకున్నది ప్రేమకాదేమోనని!

'ప్రేమ' – సాంఘిక కట్టుబాట్లను, సాంప్రదాయపు సంకెళ్ళను, కులమతాల గుప్పెళ్ళను అధిగమించి, తల ఎత్తుకొని గొప్ప తేజస్సుతో వెలిగే అపూర్వ శక్తి. ప్రతిఫలం ఆశించనిదీ, భయం ఎరుగనిదీ ప్రేమ. కానీ అటువంటి ప్రేమానుభూతి నేనెరుగను. నా ప్రేమ పిరికిది, పరిస్థితులకు లొంగిపోయేది. సాంఘిక కట్టుబాట్లకు తల వంచినది, తల ఎత్తడం ఎరుగనిది. మరి నా ప్రేమ 'ప్రేమ' ఎలా అవుతుంది? అలా అని ఖచ్చితంగా కామం అని నేనలేను. అందాన్ని చూస్తే చలించే మనసు నాది. ఆరాధించే అభిరుచి నాది. అందుకని నా మనసుకు స్వతసిద్ధంగాగల చాంచల్యమే ఈ చర్యలకు కారణం.

అలా అని లక్ష్మిపట్ల నాకు ప్రేమ లేక పోలేదు. ఆమె అంటే అభిమానం, అనుబంధం, ప్రేమ–అన్నీ వున్నాయి. అన్నిటికీ మించి ఆమె అంటే ఏదో విధమైన పవిత్రభావన, గౌరవం. బహుశా వివాహబాంధవ్యం ప్రసాదించిన వరాలేమో అవి.

ఎం.ఎస్‌సి. రిజల్ట్సు వచ్చాయి. ఫస్టు క్లాసులో పాసయ్యాను. ఇందిర నా మీద పగతీర్చుకోలేదు అనుకున్నాను. ఆ ఆలోచన రాగానే ఎందుకో ఆమెపట్ల కాస్త గౌరవం పెరిగింది. చివరిసారిగా ఆమె "ఒక మగవాడికి రెండవ ఆడదానిగా వుండను. నేను రెండవ మగవాడికి చెందను" అన్న మాటలు గుర్తుకొచ్చాయి. పదేళ్ళ తరువాత ఎప్పుడైనా, ఎక్కడైనా ఇందిర అగుపించి, "నేను ఈనాటికీ పెళ్ళి చేసుకోలేదు" అని నా ముందు నిలబడితే ముద్దాయిగా ఆమె ముందు నేను నిలబడక తప్పదు. చేతులెత్తి మొక్కకుండా వుండలేను.

అలా గతాన్ని స్మరించుకుంటూనే ప్రస్తుతంలో జీవిస్తున్నాను. ఏవేవో ఉద్యోగాలకు అప్లికేషన్లు పెడుతున్నాను. లక్ష్మితో అనుక్షణం అన్యోన్యంగా గడుపుతున్నాను.

హైదరాబాద్‌లో ఒక పెయింట్స్ ఇండస్ట్రీలో కెమిస్టుగా ఉద్యోగం వచ్చింది నాకు. అది కొత్తగా ప్రారం

భించిన ఇండస్ట్రీ. ఉద్యోగంలో చేరాను. ఆరంభంలో వున్న ఇండస్ట్రీ కావడంతో లేబరేటరీని స్థాపించడం, అభివృద్ధి పరచడం మొదలైన బాధ్యతలు నాపైన బడ్డాయి. పెయింట్స్ తయారు కావడానికి కావలసిన కెమికల్స్, ఇతర పదార్థాలు ముందుగా లేబరేటరీలో పరీక్షించాలి. తయారైన పెయింట్స్‌ను పరిశోధించాలి. నాణ్యతను పరీక్షించాలి. ఇవన్నీ ఉత్పత్తి ప్రారంభం అయిన తర్వాత చేయవలసిన



పనులు. ఉత్పత్తి ప్రారంభానికి ముందు లేబరేటరీని అన్ని సదుపాయాలతోటి ఏర్పాటు చేయడం, నాకింద పని చేయ డానికి మరో ఇద్దరు కెమిస్టులను, ఇద్దరు లాబ్ అసిస్టెంట్లను నియమించడం జర గాల్సివుంది. కొత్తగా ఒక ఇండస్ట్రీకి కావలసిన లేబరేటరీని ఏర్పరచడం అంటే చాలా పెద్ద పని. బుక్సు రిఫరు చేసి, వేరే ఇండస్ట్రీసుకి వెళ్ళిచూసి, లేబరేటరీకి రూపు రేఖలు దిద్దే పనిమీద వున్నాను. దాదాపు రోజుకి పన్నెండు గంటలు ఫ్యాక్టరీలోను, నాలుగైదు గంటలు ఇంటి లోను పనిచేయాల్సి వచ్చేది. కొత్తగా హైదరాబాద్ రావడంతో లక్ష్మిని కూడా తీసుకురాలేదు. ఫ్యాక్టరీ గెస్టుహవుసులోనే ఒంటరిగా వుంటున్నాను. నౌకరు క్యారియర్ తీసుకు వస్తున్నాడు. మనస్సుకి మరో వ్యాపకానికి అవకాశమూ లేదు, వ్యవధిలేదు. రాత్రింబవళ్ళు ఫ్యాక్టరీ పనే. నాతోబాటు నా కింద పనిచేస్తున్న కెమి స్టులు, లాబ్అసిస్టెంట్లు కూడా నా అంత



శ్రద్ధగానూ పనిచేస్తున్నారు. ఆడుతూ, పాడుతూ కాలక్షేపం చేసే విద్యార్థి జీవితానికీ, ఒక యజమాని కింద జీతానికి పనిచేసే బాధ్యతగల వుద్యోగి జీవితానికీ ఎంతో తేడా వుందనిపించింది. జీవితంలో పైకి రావడానికి చదువు ఎంతో ముఖ్యమో చదివిన తరువాత దొరికిన వుద్యోగంలో బాధ్యతా నిర్వహణ అంతకంటే ముఖ్యం. అనుకున్న లక్ష్యాన్ని నిర్దేశించిన కాలంలో సాధించాలి. లేకపోతే ప్రయివేటు కంపెనీలలో పైకి రావడం కష్టం. సరైన గుర్తింపు శక్తి సామర్థ్యాలు కలవాళ్ళకీ, శ్రమించడానికి వెనకాడని వాళ్ళకే లభిస్తుంది.

ఆరు మాసాల్లో అన్ని హంగులతోటి లేబరేటరీ తయారయింది. మరో మూడు మాసాల్లో ఫ్యాక్టరీ ఉత్పత్తి ప్రారంభించింది. ఆ తరువాత వేరే యిల్లు తీసుకొని మా వూరు నుంచి లక్ష్మిని తీసుకొచ్చి కొత్త కాపురం పెట్టుకున్నాం. ఫ్యాక్టరీకి దగ్గరలోనే ఇల్లు. ఫ్యాక్టరీ వాళ్ళు ఫోను, స్కూటరు ఇచ్చారు. మా ఫ్యాక్టరీ యజమాని గుజరాతీ. నన్ను చాలా ప్రేమగా చూసుకునేవాడు. నాకు చాలా ప్రాముఖ్యం ఇచ్చాడు. అదంతా నా మీద ప్రేమే అనుకోవడం పొరబాటు. ఫ్యాక్టరీ ఉత్పత్తి చేసే రంగుల యొక్క ఫార్ములాలు నా దగ్గరుంటాయి. అది వ్యాపార రహస్యం. రహస్యాన్ని రహస్యంగా కాపాడవలసిన బాధ్యత నాది. ఒకవేళ ఆ రహస్యాన్ని వెల్లడిచేసే మా ఫ్యాక్టరీ తయారుచేసే రంగులనే మరొకరు తయారు చేయవచ్చు. అప్పుడు మా ఫ్యాక్టరీ రంగులకు డిమాండు తగ్గుతుంది. అందుకని వ్యాపారంలోని కిటుకు తెలిసిన వ్యక్తి కావడంచేత మా ఫ్యాక్టరీ యజమాని నన్ను చాలా బాగా చూసుకునే వాడు. రెండు సంవత్సరాలలోనూ జీతం బాగా పెంచాడు. అన్ని సదుపాయాలూ ఏర్పాటు చేశాడు. తన వెంట క్లబ్బులకి, ఇతర వినోదాలకి కూడా తీసుకు వెళ్ళేవాడు. కానీ నాకంటే అతను వయస్సులో చాలా పెద్దవాడు కావడం చేతా, నా యజమాని కావడం చేతా అతని ముందు నేను డ్రింక్ తీసుకునే వాడిని కాదు. చాలాసార్లు పార్టీల్లో ఆఫర్ చేసినా అలవాటు లేదని చెప్పే వాడిని. ఒక రోజున ఇద్దరం ఒక పార్టీ నుంచి తిరిగి వస్తున్నాం.

"మిస్టర్ నారాయణరావ్! నిజంగా డ్రింక్స్ మీకు అలవాటు లేదా? నా ముందు తీసుకోవడం మర్యాద కాదనా?" అన్నాడు మా యజమాని.

"నిజంగా నాకు అలవాటు లేదండీ."

"అది దురలవాటనా?"

నేను మాట్లాడలేదు. అప్పటికే ఆయన డ్రింకు తీసుకొని వున్నాడు.

"ఇంకా నువ్వు చిన్నవాడివి. చాలా భవిష్యత్తు వుంది నీకు. ఏ అలవాటైనా మితి మీరితే తప్పుకాని లిమిట్సులో వుంటే ఫరవా లేదు. మన బిజినెస్ ఫీల్డులో ఇలాంటి చిన్న చిన్న ఫార్మాలిటీసు తప్పవు. అవసరం కూడా. నువ్వు డ్రింక్ తీసుకోకుండా మరొకరికి ఆఫర్ చేస్తే తీసుకునే వాళ్ళు మొహమాట పడతారు. అందుకని అవసరం కోసం కొన్ని అలవాట్లు చేసుకోక తప్పదు. ఉదాహరణకి కాఫు మనకి అలవాటుందా మొదట్లో? అలాగే సూట్లూ, బూట్లూ... ఇవన్నీ అవసరానికి అలవాటు చేసుకున్నవే. పెద్దవాడిగా చెబుతున్నాను. బలవంతం ఏమీలేదు" అని ఓ చిన్న

 

ఉపన్యాసం ఇచ్చాడు ఆయన.

బదులుగా "నెమ్మదిగా ట్రై చేస్తాను సార్!" అన్నాను.

"దట్స్‌గుడ్ !" అన్నాడాయన.

ఆరోజు అలా గడిచిపోయింది. రాను రాను ఆయన కోరిక మేరకు నేనూ 'ఎద గక' తప్పలేదు.

ఆయనతో కలిసి ఆ ఫ్యాక్టరీ ఛీఫ్ కెమిస్టుగా రెండు సంవత్సరాలబాటు పని చేశాను. ఆ రెండు సంవత్సరాలలో లక్ష్మి, నేనూ ఏడెనిమిది సార్లకంటే సినిమాకు కూడా వెళ్ళి వుండం. ఎక్కువసేపు లక్ష్మితో కాలక్షేపం చేయడానికి నాకు టైం లేదు. కానీ మా ఇంట్లో అధునాతన మైన అన్ని సదుపాయాలూ వున్నాయి. చక్కటి ఫర్నీచరు, ఫ్రిజ్, రేడియో గ్రాం, ఎయిర్‌కండిషన్డ్ బెడ్‌రూం, ఫోన్ లాంటివన్నీ వున్నాయి. నాకు కారు కూడా ఇచ్చింది ఫ్యాక్టరీ. ఇవన్నీ ఫ్యాక్టరీ ఏర్పరచిన సదుపాయాలే. లక్ష్మికి ఇంట్లో ఇన్ని సదుపాయాలు వున్నా ఆమెతో నేను ఎక్కువసేపు గడపలేక పోతు న్నందుకు ఆమెకు బాధగానే వుండేది. కానీ నా పనుల వొత్తిడి, బాధ్యతలు అలాంటివి. యజమాని చూపే అభిమానం మూలంగా దేన్నీ కాదనలేక పోయేవాడిని. లక్ష్మి కూడా నోరు తెరిచి ఏనాడూ తన ఇబ్బందిని చెప్పుకోలేదు నాతో. "మొగ వాళ్ళయిన తర్వాత తొంభై పను లుంటాయి" అని సరిపెట్టుకోవడం అల వాటు చేసుకుంది. ప్రతి రోజూ ఎంత రాత్రయినా ఇంటికి వెళ్ళిపోయేవాడిని. అదే ఆమెకు పెద్ద తృప్తి. నా మీద కొండంత నమ్మకం. నా గతం ఆమెకు తెలీదు. ప్రస్తుతంలో నాకు మచ్చలేదు. మచ్చలేని ప్రస్తుతమే ఆమెకు తెలుసు కానీ నా గతం తాలూకు మరకలు ఆమెకు తెలియవు.

నేను లాబ్‌లో పనిచేస్తున్నప యజమాని ఇంటర్‌కమ్‌లో పి ఆయన రూంకి వెళ్ళాను. ఆయన రుగా పాతికేళ్ళ వయస్సుగల ఒక మైన అమ్మాయి కూర్చొని వుంది. చూడగానే మా యజమాని "క మిస్టర్ నారాయణరావ్! ఈమె నా మన రాలు. అంటే నా కూతురు కూతురు స్టేట్స్‌లోనే పుట్టింది. స్టేట్స్‌లోనే పె గింది. పేరు షీలా" అని పరిచయం చేశాడు ఆ అమ్మాయిని. ఆమె "హౌడు యుడు మిస్టర్ రావ్ !" అంటూ షేక్ హాండు ఇచ్చింది. అప్పటికే నేను కొంత ఎదిగాను కాబట్టి నేనూ చేయి కలిపాను.

"హైదరాబాదు అంతా చూడాలట. నాకు ఓపిక లేదు. నువ్వు తీసికెళ్ళి చూపించు" అని నాకు చెప్పి "ఇతను మన ఛీఫ్ కెమిస్టు, నారాయణరావు. హి విల్ ఎకంపనీయూ" అని షీలాకు చెప్పాడు. ఇద్దరం నగరం మీద పడ్డాం. రెండు మూడు రోజులు ఉదయం బయలు దేరి సాయంత్రం దాకా గోల్కొండ, చార్‌మినార్, జూ, పబ్లిక్‌గార్డెన్స్ వగైరా అన్నీ తిరిగేవాళ్ళం. మధ్యాహ్నం పూట ఏదో పెద్ద హోటల్లో లంచ్ తీసుకునే వాళ్ళం. లంచ్‌లో కూడా షీలా డ్రింక్స్ తీసుకునేది. నాతో కార్లో తిరిగేటప్పుడూ, హోటలుకి వెళ్ళినప్పుడూ ఓపెన్‌గా స్మోక్ చేసేది. మొదటి రోజున నాకు కొత్తగానూ, వింతగానూ వున్నా రెండవ రోజునుంచీ అలవాటయిపోయింది. కారు దిగి రోడ్డు క్రాస్ చేసేటప్పుడూ, నడిచేటప్పుడూ నా చేతికి ఆమె చేతిని జోడించి నడిచేది. అదీ అలవాటయి

ది. అలా మేమిద్దరం ఒక వారం పాటు కలిసి తిరిగాము. ఆమె భోజనం, భోజనంతో బాటు – ఆదోలోకం. మా ఇద్దరికీ పరి బాగా పెరిగింది. నన్ను చాలా ంగా చూసేది.

క రోజున ఇద్దరం కారు వెనక లో కూర్చున్నాం. "అయామ్ టైర్డ్" ంటూ నా మీద వాలింది శీలా. నేను దనలేదు. కొన్ని క్షణాలతర్వాత డ్రైవర్ మమ్మల్ని చూస్తున్నాడేమో ననిపించి ఎదురుగా వున్న మిర్రర్‌లో చూశాను. ఓ కంట వాడు చూస్తూనే వున్నాడు మమ్మల్ని. నాకు కాస్త యిబ్బంది అని పించింది. ఆ సాయంత్రం వేరే హోటల్‌కి డిన్నర్‌కి తీసుకెళ్ళింది శీలా నన్ను. ఆ రోజున ఏదో మూడ్‌లో శీలా కాస్త ఎక్కువగా డ్రింక్స్ తీసుకుంది. చాలా జాలీగా వుంది. డిన్నర్ అయిన తర్వాత యిద్దరం బయలుదేరాం. కారు వాళ్ళింటికి చేరువ కాబోతూండగా—

"మిస్టర్ రావ్! ఐ లైక్ టు కిస్ యూ" అని నా జవాబు కోసం ఎదురు చూడ కుండా నన్ను గట్టిగా కౌగిలించుకుని దాదాపు రెండు నిమిషాలు ముద్దు పెట్టు కుంది. నేనేమీ అభ్యంతరం చెప్పలేదు.

"హోటల్‌కే పోదాం" అందామె గోముగా నా చెవిలో.

"ఈ రోజు కాదు. రేపు!" అన్నాను

"ఈ రోజూ, రేపూ కూడా" అంది శీలా.

ఇలాంటి విషయాలు నేనా ఫ్యాక్టరీలో చేరినప్పటినుంచీ మర్చిపోయాను. శీలా వచ్చి వుండకపోతే నేను అలాంటి విష యాల జోలికి పోయివుండే వాడిని కాదేమో. నిద్రపోతున్న నన్ను శీలా లేపింది. శీలా మాట కాదనలేక కొంత, నా చపలత్వం మూలంగా కొంత ఆమెను కాదనలేక పోయాను.

హోటలు రూంలో యిద్దరం రాత్రి మూడు గంటలదాకా వున్నాం.

సత్యవతి, అభినేత్రి, ఇందిర వేరు, వాళ్ళలో పొందుకీ శీలాలో పొందుకీ చాలా తేడా వుంది. శీలాకి సిగ్గు తక్కువ. కావలసినది అడిగే ధైర్యం, పచ్చిగా కవ్వించే చనువూ శీలా సొత్తు. ఏది ఏమైనా ఆమె వేషంలోనూ, మాటల్లోనూ, ప్రవర్తనలోనూ ఆడతనం కంటే మగ తనం ఎక్కువ కనబడింది. పాత పరి చయాలు మల్లెలతో అయితే, ఈమెతో పరిచయం మొగలి రేకు సాంగత్యంలా వుంది.

తెల్లవారు ఝామున మూడుగంటలకి ఆమెను వొప్పించి యింటికి బయలుదేరాం. లక్ష్మిని ఒంటరిగా వదలడం నాకు యిష్టం లేదు. ఎంత రాత్రి అయినా యింటికి వెళ్ళడం యింత కాలం ఒక నియమంగా పాటిస్తూ వచ్చాను. శీలా కాదంటే ఏం చేసేవాడినో తెలీదు కానీ ఆమె యింటికి వెళ్ళడానికి అంగీకరించడం మూలంగా మూడున్నరకి ఆమెను యింటికి దగ్గర దిగబెట్టి మా యింటికి నేను వెళ్ళాను. లక్ష్మి తలుపు తీసి "ఇంత పొద్దు పోయిందేం?" అని అడిగింది. "అర్జం టుగా విదేశాలకి ఎగుమతి చేయడానికి ఒక కొత్త ప్రోడక్టు తయారు చేయవలసి వచ్చింది" అన్నాను. నా మాటలు నమ్మి నట్టుగానే వుంది లక్ష్మి మొహం. ఆమె ముందు అబద్ధం ఆడుతున్నందుకు నాకు సిగ్గు అనిపించింది.

"ఈ పని రోజూ వుంటుందా?"




అందామె.

"కొన్నాళ్లు తప్పదు. అయినా యింత ఆలస్యం కాదు"

"ఏమిటో మీ వుద్యోగం. రాత్రిం బవళ్ళు నిమిషం విశ్రాంతి లేకుండా వుంది. ఇలా పనిచేస్తే మీ ఆరోగ్యం ఏమవుతుందోనని భయంగా వుంది నాకు" అంది లక్ష్మి నా వెనకనే బెడ్‌రూంలోకి వస్తూ. వెనక్కి తిరిగి ఆమె ముఖంలోకి చూశాను. నాకు జాలేసింది. ఆమెను దగ్గరకు తీసుకొని "ఇప్పుడు కష్టపడి పనిచేస్తే ముందు ముందు సుఖ పడ వచ్చు" అని నచ్చచెబుతున్నట్టు అన్నాను.

షీలా సంగతి మా యజమానికి తెలిస్తే నన్ను అపార్థం చేసుకుంటాడేమోనని, భయం భయంగా వుంది నాకు. మరునాడు ఆఫీసుకు వెళ్ళిన తర్వాత ఆయన ఎదుట పడడానికి నాకు బెరుకుగా వుంది. మధ్యాహ్నం మూడు గంటలకి ఆయన నన్ను తన రూంకి పిలిచారు. వెళ్ళాను. షీలా అక్కడే వుంది. నన్ను కూర్చో మన్నారాయన. చాలా బుద్ధిగా కూర్చు న్నాను. షీలా ఏమీ జరగనట్టే ఫ్రీగా మాట్లాడుతోంది.

"మిస్టర్ నారాయణరావ్! మా తాత గారి ఫ్యాక్టరీలో వుండిపోయారు గానీ మీరు స్టేట్స్‌లో వుంటే మీకు మంచి పేరూ వచ్చేది, బాగా సంపాదించగలిగే వారు కూడా" అంది షీలా.

"ఇప్పుడతనికిక్కడ ఏం లోటమ్మా ? హి ఈజ్ నెక్స్ట్ టు మి. అతనికి షేరు కూడా ఇద్దామనుకుంటున్నాను" అని షీలాకి నా గురించి చెప్పి "మిస్టర్ రావ్! మా షీలాను నువ్వు బాగా ఇంప్రెస్ చేశావు. ఆమె ఎం.బి.ఏ. ప్యాసయింది. ఆమెను యిక్కడికి రప్పించడానికి కారణం ఈ ఫ్యాక్టరీ మానేజిమెంటు ఆమెకు అప్పజెప్పి నేను గుజరాత్‌లో వేరే ఫ్యాక్టరీ స్టార్టు చేయాలని. దానికి నీ సహకారం కావాలి. లాభాల్లో పది శాతం తీసుకో. ఇద్దరూ జాగ్రత్తగా మేనేజ్ చేసుకోండి ఫ్యాక్టరీని" అన్నాడు మా యజమాని.

"కమాన్ లెటజ్ గో అవుట్" అంటూ షీలా లేచింది. ఆమె వెనక నేనూ నడి చాను. ఆ రాత్రి హోటల్లో డిన్నర్ తీసు కుంటున్నాం ఇద్దరమూ. ఇందిరతో జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది నాకు. నాకు పెళ్ళైందన్న సంగతి దాచడం మంచిది కాదనుకున్నాను.

"షీలా! నాకు పెళ్ళయింది" అన్నాను.

"అయితే ?"

"అహ ! చెబుతున్నాను. చెప్పడం నా బాధ్యత"

షీలా పకపక నవ్వింది.

"యూ సిల్లీమాన్! నేను నిన్ను పెళ్ళా డనులే. ఇటీజ్ జస్ట్ ఫర్ ఫన్. అది కాకపోయినా, నేను పెళ్ళాడుతానంటే పెద్ద పెద్ద బిజినెస్ మాగ్నెట్స్ క్యూలో వుంటారు. నేను నిన్ను పెళ్ళాడుతానని ఎందుకు వూహించావ్ ? నువ్వంటే యిష్ట పడ్డాను. దట్సాల్" అంది చాలా తేలికగా,

నా మీద నాకే అసహ్యం వేసింది. తన అంతస్తుతోటి, డబ్బుతోటి ఏ మగాడి నైనా కొనేయగలనన్న ఈ షీలా ధైర్యం ? ఇలాంటిది ఎప్పుడైనా నేను కాదంటే రెచ్చిపోయి ఏం చేస్తుందో ? సాధ్యమై నంత వరకు ఈమెకు దూరంగా వుండడం మంచిది అనుకున్నాను. కానీ ఎలాగో పాలు పోవడంలేదు.

మా ఫ్యాక్టరీ యజమాని అన్నమాట



ప్రకారం తన మనుమరాలు షీలాకు, నాకు ఫ్యాక్టరీని అప్పజెప్పి కొత్త ఫ్యాక్టరీ స్టార్టు చేయడానికి గుజరాత్ వెళ్ళిపో యాడు. మొత్తం ఫ్యాక్టరీ బాధ్యత నేనూ, షీలా నిర్వహిస్తున్నాం. నేను చిన్నవాటా దారుడినే అయినా షీలా తనకింద పని చేసే వుద్యోగిగానే చూసేది నన్ను. యజ మాని ధోరణిలోనే ఆదేశాలను యిచ్చేది. ఆ ఆదేశాలు ఫ్యాక్టరీ పనివరకూ అయితే నేను సంతోషంగా నిర్వర్తించే వాడిని. కానీ షీలా ఆదేశాలు చాలావరకు ఆమె సంతోషానికీ, వినోదానికీ సంబంధించినవే. ఆమె దృష్టిలో నేనొక ఆటబొమ్మని. కాదని తిరస్కరించడానికి బతుకుతెరువు అడ్డు వస్తోంది. చక్కటి జీతం, అన్ని సదుపాయాలూ గల యిల్లు, అన్నిటికీ మించి ఒక పారిశ్రామికవేత్తకు ఉండ వలసిన హోదా కలిపించాడు మా యజ మాని. షీలా మాటలు తిరస్కరిస్తే వాళ్ళ తాతకు చెప్పి నన్ను తొలగిస్తుందేమోనని. భయం. నిజంగా తొలగించడమే జరిగితే నేను రోడ్డున పడతాను. తిరిగి మళ్ళీ ఉద్యోగం వెతుక్కోవడం, ఒక స్థాయికి రావడం సమస్యగా పరిణమిస్తుంది. అందుకని మనసు చంపుకొని మర బొమ్మలా షీలా కనుసన్నలలో ఆమె తృప్తికోసమే బతకడం తప్పనిసరి అయింది. మరోపక్క లక్ష్మిని నిర్లక్ష్యం చేయాల్సి వస్తోందని బాధకూడా మనసుని వేధిస్తోంది. ఈ సంఘర్షణలతో షీలాకు శారీరకంగా దగ్గరగా వుంటున్నా, మాన సికంగా చాలా దూరంగా వుంటూ వచ్చాను. స్వతస్సిద్ధంగా మనిషికి వుండే బల హీనతేమో. ఏ సమస్యలూ, సంఘర్షణలూ లేకుండా వున్నప్పుడు సెక్స్‌వైపు మొగ్గి నంతగా మనిషి మనసు సమస్యల సాలె గూడులో చిక్కుకున్నప్పుడు మొగ్గదు. షీలా లాంటి అధునాతన నాగరికురాలు. నా విద్యార్థి దశలో కలిసివుంటే ఆమె పట్ల నా ప్రవర్తన యింకోలా వుండేది. పగలు, రేయి రేయిగానే సాగిపోయి వుండేది. కానీ ఆ గాడి నుంచి బయటపడి పట్టాల మీద రైలులా జీవితం సాగుతూ వున్న ప్పుడు షీలా నా జీవితంలో ప్రవేశించడం ఒక చిత్రమైన మలుపు. ఫ్యాక్టరీలో పది శాతం వాటా లభించడానికి షీలాయే కారణమయినా నేను మానసికంగా చితికి పోవడానికి కూడా ఆమె కారణమయింది. ఆమె కింద పనిచేయడం సాలెగూడులో యిరుక్కున్న ఈగలా వుంది నాకు. ఏమైనా సరే నేను బయటపడాలి. నిత్యం ఆత్మవంచన చేసుకుంటూ అందలం మీద కూర్చోవడం కంటే ఆత్మాభిమానంతో నేల మీద నిలబడడం మంచిదని నిర్ణయానికి వచ్చాను.

ఆ రోజున షీలాతో చెప్పి రాజీనామా చేసి ఆ ఫ్యాక్టరీ నుంచీ, షీలానుంచీ బయట పడాలనుకున్నాను. ఈ నిర్ణయం ఒక్క నెలలోనూ, సంవత్సరంలోనూ తీసుకున్నది కాదు. మా యిద్దరి యాజ మాన్యంలోనూ అప్పటికే రెండు సంవత్స రాలు నడిచింది ఫ్యాక్టరీ. లాభాలు కూడా బాగానే వచ్చాయి. దాదాపు నా వాటాకు ఓ లక్ష రూపాయలదాకా వచ్చింది. ఆ డబ్బు ఫ్యాక్టరీ అకౌంట్‌లోనే వుంది. నేను తీసుకోలేదు. అవసరమయితే ఆ డబ్బు వదులుకోవడానికి కూడా మానసికంగా సిద్ధంగానే వున్నాను.

ఈ ఆలోచనలతో షీలాను కలవాలని అనుకుంటున్న సమయంలో షీలాయే నన్ను తన గదికి పిలిచింది ఫ్యాక్టరీలో.




అలా అప్పుడప్పుడు పిలిచి గట్టిగా ఒక ముద్దు పెట్టుకుని పంపించే అలవాటుంది ఆమెకు. అందుకే ననుకొని చిరాకుగా వెళ్ళాను. ఏమైనా సరే ఆమెకి ఆ అవకాశం ఇవ్వకూడదనుకొని వెళ్ళాను. కానీ ఆమె నేను వూహించిన దానికి భిన్నంగా ప్రవరించింది. నన్ను సగౌరవంగా కూర్చోమని చెప్పింది. కూర్చున్నాను.

"మిస్టర్ రావ్! ఫ్యాక్టరీలో మీ లాభాల తాలూకు డబ్బు ఓ లక్ష రూపాయలదాకా వుంది. ఈ ఫ్యాక్టరీ మొత్తం ఖరీదు ముప్ఫైలక్షలు పైగా వుంటుంది. సగం డబ్బిచ్చి ఫ్యాక్టరీని మీరే నిర్వహించుకుంటూ మిగిలిన సగం వాయిదాల మీద తీర్చలేరా?" అంది షీలా. ఆమె అలా ఎందుకంటోందో నాకు అర్థంకాలేదు. ఒక వేళ ఆమె ఒప్పుకున్నా ఈ ప్రపోజలు వాళ్ళ తాతగారు ఒప్పుకుంటారన్న నమ్మకం నాకు లేదు. అంతబరువు మోయగలనన్న విశ్వాసం నాకసలులేదు. నా స్తోమత ఏమిటో నాకు తెలుసు.

"ఐయామ్ సారీ! అంత డబ్బు నా దగ్గర లేదు. నేనొక టెక్నీషియన్‌ని. బిజినెస్ మాగ్నెట్‌ని కాదు" అన్నాను.

"టెక్నీషియన్ లేకపోతే, బిజినెస్సూ వుండదు, బిజినెస్ మాగ్నెట్టూ వుండడు. వాళ్ళకి వీళ్ళెంత అవసరమో వీళ్ళకి వాళ్ళూ అంతే అవసరం. అయితే ఓ పని చేయండి. మీకు రావలసిన లక్ష రూపాయలే కాకుండా మరో మూడు లక్షల దాకా మన ఫ్యాక్టరీ అడ్వాన్సు యిస్తుంది మీకు. అది మీరు తీర్చవలసిన పని లేదు. మీ పది శాతం వాటా మీద వచ్చే లాభాలను ఆ మూడు లక్షల కిందా జమ కట్టుకుంటాం. మొత్తం ఈ నాలుగు లక్షలూ తీసుకొని అవసరమైతే బ్యాంకు లోన్ కూడా తీసుకొని మీరే స్వయంగా యేదో ఫ్యాక్టరీ పెట్టుకోండి. నెల రోజుల్లో ఈ ఫ్యాక్టరీ నుంచి మీరు వెళ్ళిపోవాలి" అంటూ నాలుగు లక్షల చెక్కును నాచేతి కందించింది షీలా.

ఆ క్షణంలో నాకు నోట మాట రాలేదు. అదొక పెద్ద షాక్ నాకు. నేను యెన్నడూ వూహించని పరిణామం అది. జీవితాన్ని ఖుషీగా గడపడానికి, స్వైరవిహారానికి అలవాటు పడ్డ షీలా ఒక్కసారిగా అంత వ్యాపార సరళిలో మాట్లాడడం, నన్ను ఫ్యాక్టరీ నుంచి వెళ్ళిపొమ్మనడం చాలా వింతగా తోచింది నాకు. మారు మాటాడకుండా చెక్కు తీసుకున్నాను. మూడు లక్షలకు వెంటనే ప్రోనోటు రాసియిచ్చాను. ఆమె ఆ నోటు తీసుకుని "అవసరంలేదు మీ రంటే మాకు నమ్మకమే" అని ఆ నోటుని చించేసింది. ఆమె అహంకారానికి నా అహం దెబ్బతింది. చెక్కు చించేద్దామనుకున్నాను. కానీ భవిష్యత్తు కళ్ళ ముందు మెదలడంతో తమాయించుకొని ఆమె గది నుంచి బయటకు వచ్చేశాను. ఆ సాయంత్రం షీలా నన్ను తన వెంట రమ్మనలేదు. నేను ఇంటికి వెళ్ళిపోయాను. లక్ష్మితో షీలా సంగతి చెబుదామా అనుకున్నాను. అంతవరకు ఏ నాడూ నా బయటి తిరుగుళ్ళ గురించి కానీ, నావ్యక్తిగత ప్రవర్తన గురించి కానీ, నా బలహీనతల గురించికానీ లక్ష్మికి చెప్పలేదు. షీలా అకస్మాత్తుగా మూడు లక్షలు యిచ్చింది అని లక్ష్మికి చెబితే లక్ష్మి మనసు ఏమి ఆలోచిస్తుందోనని చెప్పలేదు. నా మీద లక్ష్మికి చాలా నమ్మకం. ఆ నమ్మకాన్ని అలా నిలబెట్టుకోవడమే నా లక్ష్యం,



శీలా ఫ్యాక్టరీలో పని చేస్తూనే నేను ఇండస్ట్రియల్ ఎస్టేటులో వేరే ఫ్యాక్టరీ పెట్టుకునేందుకు ఏర్పాట్లు చేసుకున్నాను. అన్ని ఏర్పాట్లూ చాలా వరకు ఓ కొలిక్కి వచ్చాయి. కొత్త ఫ్యాక్టరీ ఓపెనింగు ఒక వారంరోజుల్లో జరగాల్సి వుంది. శీలా ఫ్యాక్టరీకి రావడానికి నాకు వ్యవధి చిక్కటం లేదు. ఒక రోజున నా కింద పని చేసే మరో కెమిస్టుకి ఫ్యాక్టరీ నిర్వహణ గురించి వివరంగా చెప్పాను.



తరవాత శీలా గదిలోకి వెళ్ళాను. ఇంత వరకూ శీలా దగ్గర చెక్కు తీసుకున్న తర్వాత ఆమె నన్ను పిలవనూ లేదు, నేనామెను కలవనూ లేదు. ఒక్కసారి కూడా తన పాత ధోరణిలో నాతో ప్రవ రించలేదు. నేను గదిలోకి వెళ్ళగానే ''టేక్ యువర్ సీట్ మిస్టర్ రావ్!'' అంటూ ఆహ్వానించింది. నేను కూర్చు న్నాను.

''ఏమిటి చెప్పండి. నాతో ఏమైనా పనుందా?'' అందామె.

"కొత్త ఫ్యాక్టరీకి అన్ని ఏర్పాట్లూ చేశాను. మన ఫ్యాక్టరీ విషయాలు కూడా నా అసిస్టెంటుకి వివరంగా చెప్పాను. నేను లేని లోటు లేకుండా అతను లేబరేటరీని, ఫ్యాక్టరీని మేనేజ్ చేసుకోగలడు. రేపు నన్ను రిలీవు చేస్తే మంచిది" అన్నాను.

"ఓ.కే. మీరెప్పుడు వెళ్ళాలనుకుంటే అప్పుడు వెళ్ళండి. ఈరోజు సాయంత్రం మీరు నాతో రావాలి. మీకు వీడ్కోలు పార్టీ యివ్వాలనుకుంటున్నాను'' అంది షీలా.

''ఫ్యాక్టరీలోనే యివ్వొచ్చుగా''

''కాదు. మనిద్దరమే వుండాలి. మీతో చాలా విషయాలు మాట్లాడాలి. క్లబ్బుకెడదాం" అందామె.

నేను కాదనలేదు.

ఆ సాయంత్రం యిద్దరం కలిసి క్లబ్బుకి వెడుతున్నాం. నా మనసు పరి పరి విధాల పోతోంది. ఆ రాత్రి షీలాతో గడపాల్సిన ఆఖరి రాత్రి కాబోలు అనుకున్నాను. అందుకు నేను మానసికంగా సిద్ధపడుతున్నాను కూడా ! క్లబ్బుకి చేరుకున్నాం. ఒక కార్నర్ టేబిలు దగ్గర కూర్చున్నాం. డ్రింక్స్ తీసుకుంటున్నాం. చాలా సేపు షీలా ఏమీ మాట్లాడ లేదు. చివరికి—

"మిస్టర్ రావ్ ! నన్ను చూస్తే మీకేమని పిస్తుంది?'' అందామె.

నేను చిరునవ్వు నవ్వి వూరుకున్నాను.

"కావాలని మీకు చేరువై, నేనే యిలా మిమ్మల్ని దూరం చేసుకోవడం వింతగా అనిపించడం లేదూ మీకు ?'' అందామె నవ్వుతూ. నిజానికది నాకు వింతగానే వుంది.

"మీరు నాకు అర్థంకాలేదు"అన్నాను.

"ఇందులో అర్థం కానిదేమీ లేదు మిస్టర్ రావ్ ! ఒక రోజున మీకు పెళ్ళయిందీ అని చెప్పారు నాతో. ఆ తర్వాత నుంచీ శారీరకంగా నాకుదగ్గరగావుంటున్నా మానసికంగా మీరు ఏదో బాధపడుతున్నారని గ్రహించాను. నాతో ముభావంగా వుంటున్నారనీ, నాకు దూరంగా వుండాలను కొంటున్నారనీ కూడా గ్రహించాను. నా మనసుకు నచ్చినట్టు మీరు వుండలేక పోవడానికి కారణం మీ భార్యే అయి వుంటుందనుకున్నాను. ఆమెను ఒకసారి చూడాలనుకున్నాను. మీరు లేనప్పుడు మీ యింటికి వెళ్ళాను. వెడుతూ దారిలో చాలా చిత్రంగా వూహించాను. ఏమిటో తెలుసా ? మీ రూహించలేరు. వీలైతే మీ ఆవిడకి కావలసినంత డబ్బిచ్చి ఆవిడని మీ జీవితంనుంచి తప్పించి నాకు మొహం మొత్తేదాకా మిమ్మల్ని నా జీవితంలో వుంచుకుందామనుకున్నాను.''

ఆమె అలా అనే సరికి కోపంతో నా కళ్ళూ, ముఖం ఎర్రబడ్డాయి.అసహ్యంగా చూశాను.

"తొందర పడకండి. తీరా నేను మీ యింటికి వెళ్ళి మీ భార్య లక్ష్మిగారిని చూశాక అలాంటి ఆలోచన తలఎత్తడానికే అవకాశం లేకపోయింది. నేనుపిలిచే సరికి ఆమె పూజా మందిరం నుంచి వచ్చినట్లున్నారు. తలంటు పోసుకున్న జుత్తు, నుదుట కుంకుమ బొట్టు, ముఖం నిండా పసిడి కాంతుల పసుపు – ఆమె ముఖంలో యేదో తేజస్సు వున్నట్టు చూశా. చిరునవ్వుతో ఆమె ఆప్యాయంగా నన్ను పలకరిస్తూ వుంటే నా మనసు ఆమె స్నేహానికి అర్రులు చాచింది. అప్పటికి నేనెవరో ఆమెకు తెలీదు. నేను ఫలానా అని చెప్పాను. నన్ను ఎంతో ఆదరంతో





ఆహ్వానించి యిల్లంతా చూపించారు. మీ పడక గది, మీ డ్రాయింగు రూము, వంటిల్లు, చివరికి ఆమె పూజా మందిరం. పూజా మందిరంలోకి అడుగు పెట్టాక దేవుడి పక్కనే వున్న మీ ఫొటోని చూశాను. ప్రేమించడం వేరు, పూజించడం వేరు మిస్టర్ రావ్! భక్తి ప్రేమ కంటే చాలా వున్నత మైనది. ఆమె పూజ లందుకొంటున్న మిమ్మల్ని చూసి మీరునానుంచి యెందుకు దూరం కావాలను కున్నారో అర్థం చేసుకున్నాను. అటు వంటి భార్యను పొంద గలిగిన మీరు చాలా అదృష్టవంతులు అంటున్నాను. ఆమె ఆ ఇంట్లో మసులుతూ వుంటే ఆ యిల్లు ఒక దేవాలయం లాగా, ఆమె ఒక దేవత లాగా అనిపించింది నాకు. ఆమెకు దగ్గరగా వెళ్ళి సందిట్లోకి తీసు కొని ముద్దాడాలనిపించింది. దగ్గరగా వెళ్ళాను కానీ సందిట్లోకి తీసుకుందుకు, ముద్దాడడానికి నేను అర్హురాలను కానని పించింది. ఆమె ముఖ వర్చస్సు చూసి నమస్కరించకుండా వుండలేక పోయాను. ఆమె వ్యక్తిత్వం, స్వరూపం అంతగా నన్ను ప్రభావితం చేశాయి. దానికి కారణం లేక పోలేదు. నేను పెరిగిన నాగరి కత వేరు. వాతావరణం వేరు. పాశ్చాత్య దేశాల్లో ఒక స్త్రీ ఒకరి తర్వాత ఒకరికి విడాకు లిచ్చి ఎందరినైనా పెళ్ళాడవచ్చు. అలాగే మగాడు కూడా. అక్కడా వివాహ వ్యవస్థ వున్నా, మన వివాహ వ్యవస్థ అంతటి పటిష్టమైనదీ, పవిత్ర మైనదీ కాదు. కానీ, మన వివాహ వ్యవస్థ వేరు. స్త్రీ తనకు తాళి కట్టిన మగవాడిని దైవంగా ఆరాధిస్తుంది. ఆ ఒక్క మగవాడితోటే తన బతుకు తెల్ల వారి పోవాలనుకుంటుంది. అతని కంటే ముందు తానే పోవాలనుకుంటుంది.

ఎందుకో తెలుసా? భర్త మరణించిన తర్వాత ఒంటరి జీవితాన్ని గడిపే స్త్రీ మరో మగవాడికి లోకువని, మరో మగ వాడికి తాను చెందకూడదు అని. ఇన్ని విషయాలు నాకు ఎలా తెలుసు ననుకుంటు న్నారా? ఇవన్నీ మీ భార్య చెప్పింది. ఆమెను గౌరవించకుండా వుండలేక పోయాను. ఆమె పట్ల నాకెంతో భక్తి పెరిగింది. పండు వెన్నెల్లాంటి మీ దాంపత్య జీవితంలోకి కారు మబ్బులా ప్రవేశించకూడదనుకున్నాను. మిమ్మల్ని నానుంచి దూరంగా వుంచాలనుకున్నాను. ఎందుకంటే మీరు నా కళ్ళ ముందే వుంటే ఏ క్షణంలో నయినా నేనైనా చలించవచ్చు, మీరైనా చలించవచ్చు. అందుకిలా జాగ్రత్త పడ్డాను. నాదో కోరిక. మీ జీవితంలోకి నా లాంటి వాళ్ళు ఎవరైనా ముందు ముందు ప్రవేశించ డానికి ప్రయత్నిస్తే దయచేసి నిగ్రహం వహించండి. మీ భార్యకి అన్యాయం చేయకండి. విష్ యూ ఆల్ ది బెస్ట్!"

షీలా మాటలు విన్న తర్వాత షీలాను అంత ప్రభావితం చేయగలిగిన లక్ష్మి అంటే నాకు నిజంగా దేవతలాగే అనిపించింది. యముడి నుంచి తిరిగి తన భర్తను తెచ్చుకున్న సావిత్రి పతివ్రత అయితే, హోదా, అంతస్థు, ఆస్తి, వయసు అన్ని హంగులూ గల షీలా నుంచి నన్ను తిరిగి తన వాణ్ణి చేసుకో గలిగిన లక్ష్మిని పతివ్రతే అనాలో, మరింకేమనాలో తెలీలేదు నాకు.

శీలాన్ని తృణ ప్రాయంగా భావించే షీలా ఒక్కసారిగా యిలా మారడం నాకెంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. షీలాకి శీలం లేదని నాకు హేయ భావం

లేదు. కారణం షీలాకి ఎంత శీలం వుందో నాకూ అంతే వుంది కాబట్టి. కానీ శీలం సెక్స్ పరంగానే చూ డ ట ం సమంజసం కాదేమో ననిపించింది షీలాను చూసిన తర్వాత. ఆమె హృదయ విశాలత, మంచిని మంచిగా చూడగలిగే శ క్తి, తనను తాను అవగాహన చేసుకొనే తెలివి, ఎదుటి మనిషిని అర్థం చేసుకోగలిగే అవగాహన నన్ను నిజంగా ముగ్ధుణ్ణి చేశాయి.తన తప్పు తాను తెలుసుకొని నన్ను తప్పు చేయవద్దని హెచ్చరించే షీలాను చూస్తే ఆ క్షణంలో షీలా శీలం నాకెంతో ఉన్నతమైందిగా కనబడింది.

ఆమెను యింటి వద్ద దిగబెట్టడానికి వెంట వెళ్ళాను. లోపలికి వెళ్ళిన తర్వాత "మిస్ షీలా! మీరు నా కంటే చిన్నవారు. కానీ మీకు నమస్కరించ కుండా వుండలేక పోతున్నాను" అన్నాను. ఆమె నవ్వుతూ "ఎందు కంత భక్తి నా మీద?" అంది.

"మీరు మనిషి కాదు, మనీషి!" అన్నాను.

"నన్ను మనిషిని చేసినది మీ భార్య" అంది షీలా.

అది నా నాలుగవ ప్రేమ మజిలీ.




అక్టోబరు 6' 1956




ఆ రోజున నాకొత్త ఫ్యాక్టరీ ప్రారంభం. ఎవరి చేత ప్రారంభోత్సవం చేయించాలా అని ఆలోచించి ఆ శుభ కార్యానికి కారకురాలైన షీలానే పిలిచాను. అక్టోబరు ఆరవ తేదీ లక్ష్మి పుట్టిన రోజు కూడా. అప్పటికి నా వయస్సు ఇరవై ఎనిమిది. లక్ష్మి వయస్సు ఇరవై రెండు. ఆ రోజు మరొక విధంగా కూడా నా జీవితంలో శుభదినం. లక్ష్మి నేను తండ్రిని కాబోతున్నట్టు అంత క్రితం రాత్రే చెప్పింది. చుట్టుపక్కల వున్న పారిశ్రామిక వేత్తలు అంత చిన్న వయస్సులో నేను ఒక ఫ్యాక్టరీని స్థాపిస్తున్నందుకు ఎంతగానో అభినందిస్తున్నారు. ఆ రోజు నాకు యెటు చూసినా ఆనందమే. షీలా ఫ్యాక్టరీకి ప్రారంభోత్సవం చేసినా కంటే చిన్నదే అయినా త్వరలోనే పెద్ద పారిశ్రామిక వేత్త ను కావాలని దీవించి వెళ్ళింది. ప్రారంభోత్సవం ఎంతో వైభవంగా జరిగింది.

షీలా ఫ్యాక్టరీలో నేను గడించిన అనుభవం, అక్కడ అలవర్చుకున్న కార్యదీక్ష నా ఫ్యాక్టరీని నేను అభివృద్ధి చేసుకొందుకు ఎంతగానో ఉపకరించాయి. శ్రమ పడిన కొద్దీ కొత్త శక్తినీ, ఆనందాన్నీ పుంజుకున్నానే కానీ అలసటను నేను అనుభవించలేదు. సరిగ్గా మూడు సంవత్సరాలలో మా ఫ్యాక్టరీ ప్రారంభ దశను దాటి లాభాల్లో పడింది. నేను అప్పు తీసుకున్న బ్యాంకుకు వాయిదాలు సకాలంలో చెల్లించడం చేత అక్కడ నా పరపతి బాగా పెరిగింది. షీలా నిర్వహిస్తున్న ఫ్యాక్టరీకి ఒకసారి యాభై వేల రూపాయలు తీసుకొని వెళ్ళాను - నేను తీసుకున్న మూడు లక్షల కిందా జమ కడదామని. ఆ ఫ్యాక్టరీ కూడా బాగా లాభాలు సంపాదించడంతో నేను యాభై

వేలు జమ కట్టనక్కరలేదనీ, నా కాతా లోనే లాభం తాలూకు డబ్బు లక్ష రూపాయల దాకా వుందనీ అక్కౌంటెంటు చెప్పాడు. అప్పట్లో షీలా ఆ ఫ్యాక్టరీ ప్రోడక్టును అరేబియన్ దేశాలకు పరిచయం చేయడానికి విదేశ పర్యటనలో వుంది. ఈ మధ్య కాలంలో అప్పుడప్పుడు ఫోనులో మాట్లాడటమే తప్ప షీలాను నేను కలవలేదు. షీలా నన్ను కలవలేదు.

మా ఫ్యాక్టరీలో తయారవుతున్న ఒక ప్రత్యేకమైన ఎరువు దేశమంతటా ప్రచారమయింది. దాని ఏజన్సీల కోసం కొత్తవారు ఎంతోమంది ఎగబడుతున్నారు. నేను పట్టింది బంగారంగా సాగిపోతున్నాయి రోజులు.

సొంత యిల్లు కట్టాను. కారు కొన్నాను. ఫ్యాక్టరీని బాగా పెంచాను. బ్యాంకు అప్పులన్నీ పూర్తిగా తీరిపోయాయి. మరో కెమికల్ ఇండస్ట్రీని కూడా ప్రారంభించాను. ఇదంతా ఏడెనిమిదేళ్ళలో సాధించిన అభివృద్ధి. కాకపోతే ఈ ఏడెనిమిదేళ్ళూ అకుంఠిత దీక్షతో పని చేశాను. నెలకు దాదాపు ఇరవై రోజులు టూరు చేసేవాణ్ణి. ఎంతో మందిని కలిశాను. ఒకసారి విశాఖపట్నం వెడుతున్నాను.

నిడదవోలు స్టేషనులో రైలు ఆగింది. ఓ పెద్ద మనిషి సరాసరి నేను ప్రయాణం చేస్తున్న కంపార్టుమెంటులోకి ఎక్కి నా క్యాబిన్‌లోకి వచ్చాడు. తెల్లని కోర తలపాగా, వెండిలా మెరుస్తున్న బుగ్గమీసాలు, కోటేరులాంటి ముక్కు, ఖద్దరు పంచె, మోకాళ్ళ దాకా ఖద్దరు లాల్చీ, పైమీద కండువా చూడగానే ఎవరైనా సరే గౌరవించి తీరాలిసిందే అన్నట్టుంది వేషం. ఆయన వెనకనే మరో మనిషి వచ్చి ఓ చక్కెర కేళీ అరటి పళ్ళ గెల, ఒక స్టెయిన్‌లెస్ స్టీలు టిఫిన్ క్యారియరు నా ముందుంచాడు. "నువ్వెళ్ళి కిందుండ్రా" అన్నాడా పెద్ద మనిషి అవి తీసుకొచ్చిన మనిషితో. ఆ మనిషి వెళ్ళి ప్లాటుఫారం మీద నిలబడ్డాడు. ఇంతకీ ఆ వచ్చిన పెద్ద మనిషి ఎవరో నాకు తెలీదు.

"నా పేరు వెంకటపతిరాజండి. మీకు నేను కొత్త. నాకు మీరు కొత్త. తమరి పేరు నారాయణరావుగారు. హైదరాబాదులో వున్న ఎరువుల ఫాక్టరీ ప్రొప్రయిటరుగారు మీరు. మా ఏరియాలో తమరి ఎరువులకి మంచిగిరాకీ వుందండి!'' అంటూ తనను పరిచయం చేసుకొని, నన్ను పరిచయం చేసేసుకున్నాడు.

"కూర్చోండి" అన్నాను నేను. నా పక్కనే కూర్చున్నాడు.

"ఏం పనిమీద వచ్చారు ?" అని అడిగాను.

"నాకేం పనిలేదు. ఎవరైనా పెద్దవారు ఈ లైనులో వెడుతున్నా, వస్తున్నా వచ్చి దర్శనం చేసుకోవడం, పరిచయం చేసుకోవడం నా కలవాటండి ! చిన్నప్పటి నించీ అదో హాబీ అయిపోయిందండి నాకు"

"నా పేరు మీకెలా తెలుసు ?"

"అదేంటండి బాబూ ! తమరి పేరు తెలియందెవరికి ? మా వూరి కుర్రోడే తమరి ఫ్యాక్టరీలో పని చేస్తున్నాడు. ఆడికి ఫోన్ చేసి తమ టూరు ప్రోగ్రాం ముందే తెలుసుకున్నాను. అది కాకపోయినా రైతు కుటుంబంలో పుట్టినోణ్ణి. లక్ష్మీ మార్కు ఎరువుల కంపెనీ ప్రొప్రయిటరు పేరు తెలియకపోతే వ్యవ

సాయ రంగానికీ, వ్యవసాయదారుల సంఘానికీ కూడా అవమానం కదండీ"

ఆయన ధోరణికి నేను నవ్వకుండా వుండలేక పోయాను.

"మీరు కూడా ఈ ట్రైనులో వస్తున్నారా?" అన్నాను.

"నేను తమరి దర్శనం కోసమే వచ్చాను. రమ్మంటే వచ్చేస్తాను కలకత్తా కయినా సరే, కాశీకయినా సరే"

"ఈ సామాను చూసి అడిగాను"

"బలేవోరే! నేను నిడదవోలు స్టేషనుకి ఎప్పుడొచ్చినా అది నా కూడా వుండే సామానే. తమరి కోసమే తెచ్చాను."

"గెల అరటి పళ్ళు నా కెందుకండీ?"

"అలా అనకండి. అవి కర్పూర చక్కెర కేళీలు. నోటిలో ఏసుకుంటే కరిగిపోతాయి. నమలక్కర్లేదు. ఒంటికి మంచి ఆరోగ్యం. ఆ టిఫిను కేరీరులోవి పూతరేకులు. శాంపిలుకి ఓ పాతిక పట్టించుకు వచ్చాను. మధ్యాహ్నం నిద్దరోయి లేచాకా, రాత్రి పడుకోబోయే ముందూ రెండేసి చొప్పున పుచ్చుకోండి. ఆవు పాల కంటే తేలిగ్గా జీర్ణమైపోతాయి."

"ఇంతకీ తమరికి నాతో పనేమిటో చెప్పారు కాదు."

"నాకు పనంటూ ఏవీ లేదండీ బాబూ! నేనేమి చేసినా మా యువజన సంఘం కోసం, మా ఏరియా పెజానీకం కోసం. శలవండి మరి."

"మరి టిఫిన్ క్యారియరు ...?"

"అదేంటది ?...మళ్ళీ తమర్ని కలవ ననుకుంటున్నారా ? తిరిగి తమరు వెళ్ళే టప్పుడు కలుస్తాగా. పెద్ద టిఫిన్ కేరీరు యిచ్చి చిన్న టిఫిను కేరీరు పట్టుకు పోతాను. అమ్మగారికీ, అబ్బాయిగారికీ పట్టించుకు ఎడుదురుగాని పూతరేకులు. మన మగోళ్ళకేమిటండీ ! దేశం నాలుగు మూలలా తిరుగుతాం, నాలుగు రుచులూ చూస్తాం. ఇంట్లో వున్న ఆడంగులకీ, పసి పిల్లలకీ మనం పట్టికెళ్ళి చూపిస్తేనేగా నాలుగు రుచులూ వాళ్ళకి తెలిసేది !"

ఇంతలో గార్డు విజిల్ వేశాడు. రైలు కదిలింది. వెంకటపతిరాజు "శలవండి" అని నాకు చెప్పి కంగారుగా రైలు దిగి వెళ్ళిపోయాడు. ఆయన్ని చూసి నాకు నవ్వు వచ్చిందీ చిత్రంగానూ అనిపించింది. 'ఫన్నీ'మాన్ అనుకున్నాను.

తిరిగి నేను విశాఖపట్నం నుంచి హైదరాబాద్ వెళ్ళే రోజున ఎలా తెలుసుకున్నాడో ఏమో టంచన్‌గా కంపార్టుమెంటులోకి వచ్చేశాడు వెంకటపతిరాజు నిడదవోలు స్టేషనులో. ఈ సారీ ఓ పనస పండు, చక్కెరకేళీ అరటిపండ్ల గెల, ఓ పెద్ద టిఫిన్ కేరియరు వెంట వున్నాయి. నా పక్కనే కూర్చొని అవి వెంట తెచ్చిన మనిషిని "బెజవాడకి ఓ ఫస్టు క్లాసు టిక్కెట్టు పట్రారా. స్టేషను మాస్టరికి నేను చెప్పేనని చెప్పు" అన్నాడు వెంకటపతిరాజు. అతను టిక్కెట్టు పట్టుకొచ్చి యిచ్చాడు ఒక్క పరుగున. ఆ ప్రాంతంలో అతని పలుకుబడి ఏమిటో నాకు అర్థం కాలేదు. అతను ఎవరో నాకు తెలీదు. కానీ అతను ఏదడిగినా నా చేతుల్లో వుంటే చేసేయాలనిపించింది. బెజవాడ వెళ్ళేదాకా ఏదో పిచ్చాపాటీ మాట్లాడేదేతప్ప తనకేం కావాలో చెప్ప లేదు.

బెజవాడలో రైలు ఆగాక అసలు విషయం చెప్పాడు. బియ్యే ప్యాసై ఉద్యోగంలేని కుర్రాడున్నాడట. అతనికి

ఎరువుల ఏజన్సీ యిప్పిస్తే బతుకుతెరువు చూపించిన వాడినవుతానని చెప్పాడు. ఆ కుర్రాడి అడ్రసు తీసుకొని తప్ప కుండా ప్రయత్నిస్తానని మాటిచ్చాను. అన్న మాట ప్రకారం వారం రోజుల్లో ఏజన్సీ యిస్తున్నట్టు ఆర్డరు పంపించాను. మరోవారం రోజుల్లో ఆ ఏజన్సీ షాపు నేనే ఓపెన్ చేయాలంటూ వెంకటపతి రాజుగారు ఫోను చేశారు.అంత పెద్దాయన మాట కొట్టేయడం బావుండదని బయలు దేరి వెళ్ళాను. ఒక మంత్రిగారికి యిచ్చి నంత స్వాగతం ఏర్పాటు చేశాడు స్టేషనులోనే. నిడదవోలులో ఏజన్సీ షాపు ఓపెన్ చేశాను. నేను ఎంత కాదంటున్నా వినకుండా ఆ రాత్రికి తన ఆతిథ్యం స్వీకరించే వెళ్ళాలని పట్టుపట్టి నన్ను ఆపు చేసేశాడు.

ఆ రాత్రి ఎనిమిది గంటలకు మూడు చిన్న కార్లు నిడదవోలునుంచి యింకా లోపలికి వున్న ఏదో పల్లెటూరికి బయలు దేరాయి. నేనూ, రాజుగారూ ఓ కారులో వున్నాం. మిగిలిన రెండు కార్లలో క్రిక్కిరిసి కూర్చొని ఓ పదిహేను మంది కుర్రాళ్ళు వున్నారు. కార్లు పొలం మధ్యలో వున్న ఓ బంగళా ముందు ఆగాయి. లోపలికి వెళ్ళాం. బంగళా పొలం మధ్యలో వున్నా అధునాతనమైన అన్ని సదుపాయాలూ వున్నాయి.

"ఇది మన సొంత గెస్టు హవుసండి. ప్రతి గదికీ బాతురూం తగిలించి వుందండి. స్విచ్చి నొక్కితే వేడి నీళ్ళొస్తాయి. గదిలో డబల్ కాట్లు, డన్‌లప్ పరుపులు. ఇంకా ఎ.సి. పెట్టించ లేదండి. వెనక భాగంలో వంట గది ఉందండి. వంటగదిలో గాసు స్టవ్వు, మస్తాను అనే వంట మనిషి వున్నాడండి. దుప్పట్లు కొత్తయండి. గలేబులు కొత్తవి. బాతురూంలో పియర్సు కొత్త సబ్బుం దండి. ఇయ్యాలే మడత విప్పిన బొచ్చు రుమాలుందండి. తమరు తొరగా స్నానం మాడి వచ్చేస్తే ధర్మవరం పట్టు లుంగీ కొత్తది రెడీయండి. నేను పట్టు లుంగీలే వాడతానండి. గెస్టులకి కూడా అయే యిస్తాను. ఆడోళ్ళు పట్టు చీరలు కట్టు కున్నట్లు మగోళ్ళు రాత్రి పూటైనా పట్టు లుంగీ కట్టుకోకపోతే ఎలాగండి?" అంటూ నన్ను హడావిడి చేసి బాతురూం లోకి పంపించి వేశాడు. నేను స్నానంచేసి బయటికి వచ్చేలోపున ఏర్పాట్లన్నీ చేసే శాడు. నన్ను పక్క వరండాలోకి తీసుకు వెళ్ళాడు. రెండు పెద్ద టేబుల్సు, వాటి చుట్టూ కుర్చీలు. టేబుల్సుమీద తెల్లని గుడ్డలు పరిచివున్నాయి. వాటిమీద ఐస్ కెటిలూ, విస్కీ బాటిల్సూ, చక్కటి గ్లాసులు, పక్కనే సోడా కేసులు రెడీగా వున్నాయి. నన్ను కూర్చోమని చెప్పి మొదలు పెట్టాడు.

"మన దగ్గర స్కాచీ వుంది, ఇండియా వుందండి. ఇంక రకాలంటారా...జున్ను, వైను, రమ్ము, షాంపేను ఒకటేటి, మొత్తం వెరైటీలన్నీ వున్నాయండి. మరీ అంత దేశభక్తి వున్నోళ్ళు ఇండియా తీసుకుంటారు. ప్రపంచమే మన దేశం అనుకున్నోళ్ళు ఏ ఫారిన్‌దైనా తీసు కుంటారు. మీరు ప్రపంచమే మన దేశం అని అనుకునే మనిషి అని నా అభి ప్రాయం. అందుకని తమరికి స్కాచి యేస్తాను" అని చెప్పి నాకూ, తనకీ స్కాచి విస్కీ సర్వు చేశాడు వెంకటపతి రాజు.

"అరే కుర్రోళ్ళూ! మీరందరూ ఇండియా తీసుకోండి" అని వాళ్ళని

ఆదేశించి "ఈ కుర్రకారుని చూశారా! అందరూ పద్దెనిమిదేళ్ళు మొదలుకొని పాతికేళ్ళ లోపువాళ్ళు. నా వయస్సు యాభై దాటి అయిదారేళ్ళు అవ్వొస్తోంది. అయినా బెల్లం చుట్టూ ఈగలు ముసిరినట్టు మన చుట్టూనే వుంటారండి" అని వాళ్ళ గురించి నాతో చెప్పాడు.



"అవును మరి! కుర్రవాళ్ళలో కుర్ర వాడిలాగా, పెద్దవాళ్ళలో పెద్దవాడుగా మీరు కలిసిపోగలరు" అన్నాను.

రాజుగారు నవ్వుకొని "మా బాగా చెప్పారు. మీలాంటి పెద్దోరు ఎవరొచ్చినా ఇదే మాటంటారండి. దాంతోనే నేను నిజంగా కుర్రోడి నయిపోతున్నాను. ఇంకా ఆలస్యమెందుకు? చీర్లు చెప్పండి" అని తన గ్లాసు ఎత్తి, నా గ్లాసుకు కొట్టి ఎత్తిన గ్లాసు దించకుండా గడగడా తాగేశాడు. మిగిలిన కుర్రకారు కూడా వాళ్ళ గురువుగారిని అనుసరించారు. వంట మనిషి మస్తాను డిన్నరు ప్లేట్లల్లో రకరకాల చికెన్, పిట్ట మాంసం, ఫిష్



చిప్స్ పట్టుకొచ్చి పెట్టాడు.

నేను రెండు రౌండ్లు తీసుకునేసరికి రాజుగారూ, ఆయన శిష్యులూ నాలుగు రౌండ్లు మింగేశారు. ఇంతలో ఓ కారు వచ్చి బయట ఆగింది.

రాజుగారు ''పెద్దాపురం వెళ్ళిన కారను కుంటా[నా. చూడు రాంబాబూ!" అని ఓ శిష్యుణ్ని పురమాయించాడు. ఆ శిష్యుడు ఒక్క పరుగున వీధి వైపు వెళ్ళి మరుక్షణంలో మా దగ్గరకు వచ్చి "ఆ కారే బాబాయ్!" అని వినయంగా జవాబు ఇచ్చాడు రాజుగారికి.

"సరుకు దిగుమతి చేసి లోపలికి చేర్చావా?" అన్నాడు రాజుగారు.

"ఆఁ కావాలంటే చూడు" అని సమాధానం ఇచ్చాడు రాంబాబు.

రాజుగారు నన్ను చూస్తూ "మనం లోపలికి వెళ్దాం పదండి" అంటూ తన గ్లాసు చేతబట్టుకొని లోపలికి నడిచాడు. పెద్ద మనిషి చెప్పిన మాట అతిథిగా అంగీకరించడం నా బాధ్యత కాబట్టి ఆయన వెనకే గ్లాసు చేత బట్టుకొని నేనూ వెళ్ళాను. ఇద్దరం బెడ్‌రూంలోకి వెళ్ళాం. రాజుగారినీ, నన్నూ చూడగానే బెడ్‌మీద కూర్చున్న ముగ్గురమ్మాయిలూ వినయంగా లేచి నిలబడ్డారు. రాజుగారు చిరునవ్వు నవ్వుతూ "ఏం రాజ్యం! బావున్నావా?" అంటూ ముగ్గురిలో ఒకరిని పలకరించాడు. రాజ్యం సిగ్గు లొలికిస్తూ "బాగానే వున్నానండి" అని సమాధానం ఇచ్చింది తన గోళ్ళ రంగు అందాలను చూసుకుంటూ.

"ఈళ్ళిద్దరూ ఎవరూ?" అని [ప్రశ్నించాడు రాజుగారు మిగిలిన ఇద్దరమ్మాయిల గురించీ.

"ఇది మా పిన్నిగారమ్మాయి, సంపంగండి. ఇదేమో మా కాంతమ్మత్త కూతురండి. కనకాంబరమండి" అంటూ మిగిలిన ఇద్దర్నీ పరిచయం చేసింది రాజ్యం. ఆ పేర్లు, వాళ్ళ ముస్తాబూ, వాళ్ళ మాట తీరూ చూస్తే ఏదో గమ్మత్తుగా వుంది. 'భీమవరం సత్యవతి' ఛాయలు లీలగా వాళ్ళల్లో కనబడుతున్నాయి.

అప్పుడు నా కనిపించింది-జంటనగరాల్లోనూ, గతంలో నేను చదువుకున్న కాలేజీల్లోనూ, సాగర్ యూనివర్సిటీలోనూ రకరకాల ఆడవాళ్ళను చూశాను. రకరకాల అందాలనూ చూశాను. కానీ కృష్ణా, గుంటూరు, గోదావరీజిల్లాల్లోని అందాలూ, ఆడవాళ్ళ తీరూ ఏదో [ప్రత్యేకంగా అనిపిస్తుంది. వీళ్ళల్లో వున్న ఆకర్షణ, మగతనాన్ని తట్టిలేపే శక్తి నాకు మరెక్కడా కనపడలేదు. అందుకేనేమో వాళ్ళ ముగ్గుర్నీ చూడగానే నేనెవరినో మర్చిపోయి, నా అంతస్థును మరిచిపోయి, ఆ ముగ్గురిలో ఏ ఒక్కరితో గడిపినా 'నాట్ బేడ్' అనిపించింది.

గులాబీలు అందంగానే వుండచ్చు. అలాగే కొన్ని గడ్డిపూలు కూడా అందంగానే వుండచ్చు. అందంగావున్న పువ్వును గడ్డి పువ్వుకదా అని చిన్న చూపు చూడాల్సిన పనిలేదు.

ముగ్గురినీ పరిశీలనగా చూశాను. 'రాజ్యం', 'సంపంగి', 'కనకాంబరం' అని వాళ్ళ పేర్లను మనసులోనే మననం చేసుకున్నాను.

రాజుగారు వారి గ్లాసులోని శేషాన్ని గుటుక్కున మింగేసి "ఏంటే! బట్టల కొట్లో బొమ్మల్లా అలా నిలబడి పోయేరేంటి? ఆరెవరను కున్నారు? హైదరాబాద్‌లో పెద్ద ఫాక్టరీ ఆరిది. ఫాక్టరీ అంటే మన ఎంకటసామి రైస్‌మిల్లు




లాంటిది కాదు. వొంద రైసు మిల్లులు కలిసి ఎంతుంటదో అంత పెద్దదన్నమాట ఆర ఫాక్టరీ. దానికి ఈయనగారు యజమాని. మనసైడు మీరు అందక తెలే కావొచ్చు. మీ అందరిళ్ళల్లోనూ పందిరి పట్టి మంచం, నిలువుటద్దం ఫిట్ చేసే బీరువా, కిష్టుడి బొమ్మ, టేబిలు ఫేన్లూ వుండొచ్చు. అదే గొప్పనుకోకండి. ఆయనగారి ఆఫీసులో ప్రైవేటు సెక్రటరీ అని వుంటది. ఆవిడగారు మీకు మల్లే మడమల కిందదాకా సీరకట్టుకోదు. తొడలు అపడీ ఆపడనట్లు సగం సరికేసిన లంగా ఏసుకుంటది. జబ్బలు పుల్‌గా ఆపడేలా పట్టుబాడీ బనీను ఏసుకుంటది. మన సైడు మగోళ్ళు అగస్మాత్తుగా ఆవిడగారిని సూస్తే, కళ్ల తిరిగి కాలుజారి పడిపోతారంటే, అట్లాంటి ఆడ మడిసిని అందులో పెట్టుకున్న పెద్ద మనిషి మీ ముందు నిలబడితే అలా బొమ్మల్లా నిలబడి పోతారేటే!" అని నా గురించి అనర్గళంగా వాళ్ళకి వివరించాడు రాజుగారు.

"ఆరికి మేమేం పనికొస్తామండీ?" అంది రాజ్యం.

"అదేటే పిచ్చి సన్నాసీ. పనివాడితనం చూపించు. పనికొస్తావని రుజువు చేసుకో" అన్నాడు రాజుగారు.

రాజుగారి మాటల్లో కొత్త ఆవకాయలోని ఘాటు కనిపించింది. రాజ్యం చూపుల్లో ఆవకాయలోని వెల్లుల్లి నమిలిన పొగరు నాకు సోకింది. రసజ్ఞులైన రాజుగారు నా కళ్ళల్లో అప్పుడే తొంగి చూస్తున్న ఎర్ర జీరను గమనించినట్టున్నారు.

"ఇంకా అలా నిలబడి పోయారేటే? ఆయన గారిని మనం హైదరాబాదు వెళ్ళి కలవాలంటే తలకి యాభై రూపాయలు ఆరిపోతాయి ఎంత లేదన్నా. సరదాపడి తీరా ఎల్లినా ముఖాముఖి ఇంత దగ్గరో మడిసి మనకు దొరకడు. ఏదీ, తలో ముద్దూ పెట్టుకోండి. ఊఁ" అని వాళ్ళని నా మీదకి వుసిగొలిపాడు.

ఆ ముగ్గురిలోకీ ధైర్యం అయిన రాజ్యం నాకు దగ్గరగా వచ్చి తన ఒంటిని నాకు తగిలీ తగలకుండా బుగ్గమీద ముద్దెట్టుకుంది. మిగిలిన ఇద్దరూ కూడా ఆమెలాగే ముక్తసరి ముద్దులు పెట్టుకున్నారు మరబొమ్మల్లా.

అది చూసిన రాజుగారు "అయ్యేం ముద్దులే? తోలుబొమ్మలాటలో లవ్వులాగా! ఆడమడిసి మగ మడిసిని ముద్దెట్టుకోడమంటే దాంట్లో ఎంత ఆర్టుండీ, ఎంత కళుండీ ఎంత ఇదుండీ. ఎంత అదుండీ!" అని కళ్ళెర్ర జేశాడు.

'ఇంకెలాగండీ?' అన్నట్లు చూశారు ముగ్గురూ. నిజానికి ఎలాగో వాళ్ళకి తెలియక కాదు. వాళ్ళకు నా గురించి మరీ ఘనంగా చెప్పడంతో కాస్త జంకారంతే.

"ముద్దంటే చ్చాదీకి చ్చాదీ, పెదాలకి పెదాలూ తాపడమైపోవాలి. ఆపైన అలా ఆడా మగా కలిసిపోతే మధ్యలోకి గాలి సొరడానికి కూడా చోటుండకూడదు. అదీ సిసలైన ముద్దంటేను. సూస్తారంటే? వూ!...కానివ్వండి" అంటూ మళ్ళీ ఆ ముగ్గుర్నీ వుసిగొలిపాడు నా మీదికి.

వాళ్ళు ముగ్గురూ నాకు వూపిరాడనివ్వలేదు.

"అద్దదీ! బాబూ! నారాయణరావుగారూ! గ్లాసు, సీసా, భోజనాలు లోనకొస్తాయి. తమరింకా పనిమీదుండండి" అని రాజుగారు తన కోరమీసాలు సవ

రించుకుంటూ "జాగ్రత్తగా చూసుకోండే. మన ఏరియా పరువు నిలబెట్టాలి" అని వాళ్ళని హెచ్చరించి బయటకు వెళ్ళిపోయారు.

ఆ రాత్రిని ఆ ముగ్గురి మగువలమధ్యా మూడు పువ్వులూ, ఆరు కాయలుగా గడిపేశాను. ఆ రాత్రి నేను అనుభవించిన థ్రిల్ మాటల్లో చెప్పలేను. నలభై సంవత్సరాలు దగ్గర పడుతున్నా నా ఇరవైఏళ్ళ వయస్సును గుర్తుకు తెచ్చిన రాత్రి అది.

అలా మళ్ళీ కాలుజారాను, జారిన కాలు పాతాళానికే లాగుతుందో, పూపిరాడనివ్వని వూబిలో నన్ను ముంచెత్తుతుందో ఆ క్షణంలో నాకు తెలియలేదు. కానీ ఒక నిజం మనసుకు తోచింది "ఆడది యెంత చౌక!" అని.




నా వ్యాపారం బాగా పెరిగింది. నేను స్థాపించిన పరిశ్రమ పట్టాలెక్కిన రైలుబండిలా సాఫీగా సాగిపోతుంది. నేను తీసుకున్న ప్రతీ నిర్ణయం నాకు లాభాలను తెచ్చిపెడుతోంది. ఒక్కమాటలో చెప్పాలంటే నేను పట్టిందల్లా బంగారం.

మనిషి మనసు సమస్యల ముళ్ళ మొలలో చిక్కుకున్నప్పుడు సుఖాల మీదికి పోదు. సమస్యల పరిష్కారం కోసమే సతమతమవుతుంది. సమస్యలు లేని మనసు సుఖాల వెంటబడుతుంది. ఆనాటి నా పరిస్థితి అది. నాకు ఏ సమస్యలూలేవు. షీలాతో పరిచయం తర్వాత కొంత కాలం యెంతో నిష్ఠగా వున్నాను. నా సర్వస్వం లక్ష్మేనని నమ్మాను. కానీ రాజుగారు నన్ను వూబిలోకి లాగిం తర్వాత నన్నునేను మర్చిపోయాను.

పట్టుతేనె పసిడి పళ్ళెంలో వడ్డించి తనివితీరా ఆరగించమని ఆహ్వానించే నా లక్ష్మి వున్నా పళ్ళెంలో తేనెకంటే కుసుమ కుసుమానికి తిరిగి రకరకాల మధువులను ఆస్వాదించాలనే చపలత్వం నాలో రోజు రోజుకి పెరిగిపోతోంది. వాలిన పువ్వుమీద వాలకుండా యెన్నో పువ్వులలోని మకరందాన్ని కొనుక్కుంటూ, వెతుక్కుంటూ రోజూ ఒక అన్వేషణగానే కాలాన్ని గడుపుతున్నాను.

అలా తిరుగుతున్నా నేను తీసుకున్న జాగ్రత్త ఒకటి నాకు అన్నివిధాలా ఎంతో వుపకరించింది. నా ఆనందాన్వేషణలోనూ, రసాస్వాదనా కృషిలోనూ మూడవ మనిషి సహకారాలు నేనెన్నడూ కోరలేదు, వినియోగించుకోనూలేదు.

అలా ఎంతో గుట్టుగా గడుపుతున్న నా వ్యక్తిగత జీవిత రహస్యం లక్ష్మికి చేరలేదు. లక్ష్మిని యేనాడూ నేను చీదరించుకోలేదు. ప్రేమతో ఎంతో లాలనగానే లక్ష్మిని నేను తీసుకున్నాను.

ఆమెకు నేనొక రాముడినని నమ్మకం. అలాంటి నమ్మకం కలగడానికి కారణం నేను బయట ఎలా తిరిగినా యింటిని ఒక దేవాలయంగానూ, ఆమెను ఒక దేవతగానూ చూసుకోవడమే. గడప దాటిన తర్వాత నాకు నియమాలు లేవు. నిబంధ

 

నలు లేవు. నేను స్వేచ్ఛా జీవిని. నా అంతస్థుతోటి, డబ్బుతోటి నా కంటికి నచ్చిన అందాన్ని వెలకట్టి కొనుక్కునే వాణ్ణి. అనుభవించేవాణ్ణి.

"అవకాశాలు వున్నప్పుడు అనుభవించని జీవితం జీవితమేకాదు" అని జీవితాన్ని సిద్ధాంతీకరించాను.

సిద్ధాంతాన్ని తు.చ తప్పకుండా పాటించాను. బంజారాహిల్స్‌లో ఓ గెస్టు హౌస్ కట్టాను. నాతోటి వ్యాపారస్థులను' నా కవసరమయిన వ్యాపారస్థులను ఎంటర్‌టైన్ చేయటం కోసం ఆ గెస్ట్ హౌస్ కట్టానని లక్ష్మిని నమ్మించాను.

అది నా విలాస మందిరం. అంత గోప్యంగా నా వ్యక్తిగత వ్యవహారాలను, చపలత్వాలను సాగించుకో గలగడం మూలంగానే యింటా బయటా కూడా నా పరపతి చెక్కు చెదరకుండా నిలచింది. ఊర్లో వున్నప్పుడు అలా రోజులు సాగి పోయేవి.

బిజినెస్ పనులమీద యితర పట్నాలకు వెళ్ళినప్పుడు కూడా నేనలాగే కాలం గడిపాను. డబ్బుతో కొనలేనిది ఏదీ లేదని గట్టి నమ్మకాన్ని పెంచుకున్నాను.

ఒకనాడు ఊటీలో ఓ గెస్టుహౌస్‌లో దిగాను. పగలంతా వాన. ఫోన్ పని చేయడం లేదు. చీకటి పడింది. చపలత్వం మేల్కొంది. ఒంటరిగా కూర్చొని తాగడంతో చపలత్వం మరింత రెచ్చిపోయింది. మనసు జతకోసం తహతహలాడుతోంది.

ఆ గెస్టుహౌస్ వాచ్‌మన్ జ్వరంతో బాధపడుతున్నాడు అవుటు హౌస్‌లో. ఆ రోజు ఉదయం నుంచీ కూడా ఆ వాచ్‌మన్ కూతురు లత నాకు కావలసిన సదుపాయాలను చూస్తోంది. అయినా పగలంతా లత గురించి అంతగా ఆలోచించనూలేదూ, పట్టించుకోనూ లేదు.

అప్పటికే పొద్దు పోవడంతో "భోజనం వడ్డించమంటారా బాబూ!" అంటూ లత వచ్చి నా ముందు నిలబడింది.

లతను పరిశీలనగా చూశాను.

రెచ్చిపోయిన చపలత్వం మసక పొరలనుంచి చూస్తున్న నా కళ్ళకి లత కొత్తగా కనబడింది.

మడమల దాకా దిగకుండా మడమలకీ మోకాళ్ళకీ మధ్య ఆగిపోయిన లంగా.

నడుముకి పటకాలా బిగిసివున్న లంగా బొందు. జాకెట్టుకీ లంగాకీ మధ్య నున్నని నల్లని బొజ్జ. ఆ బొజ్జను పూర్తిగా కప్పకుండా లంగా కుచ్చెళ్ళనుంచి పైకి ఎగబాకిన వోణీ.

ఆ వోణీ కొండల మధ్య పారే సన్నని సెలయేరులా ఆమె వయసు కొండలమధ్య నుంచి చోటు చేసుకొని కొండలను మరింత ఉన్నతం చేస్తోంది.

గుండ్రని మెడ, ఆమె ముఖం, అయస్కాంతల్లాంటి ఆమె చూపులు, బయటి నుంచి వీచే చలిగాలికి కదిలే ఆమె ముంగురులు ఆ క్షణంలో వడ్డించిన విస్తరిలా తోచాయి నాకు.

నాకు ఆకలయింది. భోంచేయాలనిపించింది. డైనింగ్ టేబిలు మీద వున్న భోజనం కాదు,

కనువిందుగా కళ్ళముందున్న వయసు విందును ఆరగించాలనిపించింది.

"ఆ భోజనం తర్వాత చేస్తాను. ముందు నువ్విటురా" అని పిలిచాను లతను. నాకు కాస్త ఎడంగా వున్న లత రెండడుగులు ముందుకు వేసింది.

"ఏంటి బాబూ ?" అంది.

"ఇలావచ్చి నా పక్కన కూర్చో"

ఆమె తెల్లబోయింది.

"నీకు చలిగా లేదూ ?" అన్నాను.

ఆమె బదులు చెప్పలేదు. అక్కడినుంచి వెళ్ళిపోయింది. మరు క్షణంలోనే రగ్గుతో వచ్చి "కప్పుకోండి" అని అందించింది.

నాకు నవ్వొచ్చింది.

"అది కప్పుకుంటే చలి తగ్గదు. ఇది పుచ్చుకుంటే చలి తగ్గుతుంది" అంటూ నా చేతిలోని గ్లాసును ఆమె కందించాను.

"నాకు చలి లేదండి. అదిగాకపోయినా అలాంటి అలవాట్లు మాకు లేవు" అంది లత.

"నాకోసం అలవాటు చేసుకో" అన్నాను.

"మీ కోసం అలవాటు చేసుకుంటే అలవాటయ్యాక రోజూ ఎవరిసారండీ ?"

"ఆ ఏర్పాటు నేను చేస్తాను" అంటూ నేను బ్రీఫ్‌కేసు తెరిచి ఒక వెయ్యి రూపాయల కట్ట తీసి ఆమెకందిస్తూ ఆమెను చటుక్కున దగ్గరకి లాక్కున్నాను.

ఆ వెయ్యి రూపాయల కట్టను ఆమె కళ్ళముందుంచి దగ్గరకు లాక్కుంటే ఆమె కాదనదని నా విశ్వాసం. కానీ ఆమె తోకతొక్కిన తాచులా కస్సుమంద. నన్ను ఒక్క వుదుటున విదిలించుకుంది.

ఆమె కళ్ళల్లో నిప్పు రవ్వలు చిందు తున్నాయి. పెదవులు గజగజ వణుకు తున్నాయి.

నేను నవ్వుతూ ఒక్క అడుగు ముందుకు వేశాను.

"ఆగు ! ఇంకొక్క అడుగు ముందు కేస్తే ఈ సీసా నీ నెత్తిన పగులుతుంది. సీసా ఎన్ని ముక్కలవుతుందో నీ బుర్రఅన్ని ముక్కలవుతుంది" అనిగర్జించింది.

నెత్తికెక్కిన మైకం పాదాల్లోకి దిగి పోయింది. తల విరబోసుకున్న చపలత్వం తల దించుకుంది.

సంస్కారం మేల్కొంది నన్ను నేను గుర్తుకు తెచ్చుకున్నాను.

"నువ్వెళ్ళు భోజనం నేను వడ్డించుకు తింటాను" అన్నాను.

"మీకు భోజనం వడ్డించడం నా పని. మీకు భోజనం వడ్డించి, మీరు తిన్నాకే వెళతాను" అని నా ముందునుంచి వెళ్ళి పోయి డైనింగ్ టేబిలు దగ్గర కూర్చుంది లత. లత ధైర్యం చూస్తే నాకు మతి పోయింది. నన్ను కాదని తిరస్కరించిన లత ఇంకా అక్కడే వుండడం నాకు మనస్కరించలేదు. లేచి భోజనానికి వెళ్ళాను. నేను చేసిన పనికి నన్ను అసహ్యించుకోకుండా ఎంతో ఆప్యాయంగా కొసరి కొసరి వడ్డించింది.

పేదరికంలో వున్నా నేనిచ్చిన డబ్బును కాదని తన గుణమే కొండంత ధనమని నమ్మిన లతను చూస్తే నాకు ఆమె పట్ల గౌరవం పెరిగింది.

నేను మౌనంగా భోజనం చేశాను. ఆమె వెడుతూ "బాబూ ! తమరు పెద్ద వారు. డబ్బుకలవారు. మీ పెద్దరికంతోటీ, డబ్బు తోటీ ప్రతీ ఆడదాన్ని కొనేయచ్చు ననుకోకండి" అని చెప్పి అవుట్ హౌస్ లోకి వెళ్ళిపోయింది.

తెల్లవారింది.

నేను బయలుదేరబోయే ముందు అవుట్ హౌస్ దగ్గరకు వెళ్ళి వాచ్‌మన్‌ను పిలిచాను. దుప్పటి నిండుగా కప్పుకొని "పిలిచారా బాబూ ?" అంటూ బయట కొచ్చాడు.

"అవును. ఈ డబ్బు తీసుకో. నీ కూతురు పెళ్ళి చేయి" అని వెయ్యి





రూపాయలు అతనికి అందించాను. వాచ్ మన్ "తమరు దేవుడు బాబూ!" అంటూ డబ్బు తీసుకొని నాకు చేతులెత్తి మొక్కాడు.

నేను తలవంచుకున్నాను.

వంచిన తల ఎత్తకుండానే నా కారు దగ్గరకు నడుస్తున్నాను.

వెనకనుంచి "ఆగండి బాబూ!" అన్న లత పిలుపు వినబడింది.

వెనక్కి తిరిగాను.

తండ్రి చేతిలో డబ్బు తీసుకొని లత నా దగ్గరకు వచ్చింది.

"తీసుకోండి బాబూ! మీ డబ్బు మీరు తీసుకెళ్ళండి. దేవుడు డబ్బివ్వడుబాబూ! దీవెనలిస్తాడు. డబ్బు సంపాదించుకుందుకు కాళ్ళు చేతులు యిచ్చాడు మాకు. అవి చాలు" అని ఆ డబ్బు నా చేతిలో పెట్టి గిరున వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

రాజుగారి గెస్టుహౌస్‌లో ఏది నిజమని నేను నమ్మానో లతను చూసిన తర్వాత ఆ నిజం అబద్ధమని తెలుసుకున్నాను. 'కొనడానికి అందనిది ఆడది' అనే కొత్త నిజాన్ని గ్రహించాను.

ఇది నా అయిదవ ప్రేమ మజిలీలో నేనుతెలుసుకున్న కొత్త పాఠం. అయినా నా వేట నేను మానలేదు. లక్ష్మి కన్ను మూసేదాకా నా వేట అలా సాగుతూనే వుంది. మజిలీ తరువాత మజిలీ.




'సుగంధి' సోప్ ఫ్యాక్టరీ యజమాని మాధవరావు నా చిన్ననాటి స్నేహితుడు. అతని సోప్ ఫ్యాక్టరీ బాగా వృద్ధి చెందింది. ఆ సందర్భంలో 'సుగంధీ నైట్' అంటూ ఓ రోజున రవీంద్ర భారతిలో పెద్ద ఫంక్షన్ ఏర్పాటు చేశాడు. ఆ ఫంక్షన్ ప్రత్యేకత ఫంక్షన్‌కి హాజరైన ప్రేక్షకుల టిక్కెట్ల కౌంటర్ ఫాయిల్స్ నుంచి డ్రా తీసి ఒక టెలివిజన్ సెట్, ట్రాన్సిస్టర్ కమ్ రేడియో, యింకా చిన్న చిన్న ప్రైజులూ యిస్తున్నాడు. ప్రేక్షకులను ఆకర్షించడానికి మద్రాసునుంచి కిన్నెర అనే నర్తకి నృత్యాన్ని ఏర్పాటు చేశాడు.

మాధవరావుకీ, నాకూ వున్న చెలిమి కారణంగాను, నాకు లలిత కళల యందు గల అభిరుచినీ, అభిమానాన్నీ తెలిసినవాడు కావడం చేత మాధవరావు నన్ను ఆ ఫంక్షన్‌కి ముఖ్య అతిథిగా ఆహ్వానించాడు.

రవీంద్రభారతి హాలంతా ప్రేక్షకులతో కిటకిట లాడుతోంది. ముఖ్య ఆకర్షణ కిన్నెర నృత్యం. ఆమె బృందానికి ఇదివరకే చాలా పేరుంది. కిన్నెర నృత్యం ప్రారంభమైంది. శాస్త్రీయ నృత్యంలో నిధి ఆమె. కొన్ని అయిటెమ్స్ చేశాక తారాశశాంక నృత్యనాటిక ప్రారంభమైంది.

తారగా కిన్నెర ప్రేక్షకులకు గిలిగింతలు పెట్టింది. ప్రేక్షకులలోని ప్రతి పురుషుడూ ఆమెను వేదికమీద చూస్తూ చంద్రుడైపోయాడు. ఆమె కళ్ళతోటే ప్రేమ కావ్యాలనూ, శృంగార సూక్తులను ప్రేక్షకులకు చవిచూపించింది. ఆమె నృత్యం ముగించగానే ప్రేక్షకులు కరతాళ

ధ్వనులతో ఆమె ప్రజ్ఞాపాటవాలను అభినందించారు.

తర్వాత నేనే వేదిక మీదకు వెళ్ళి టికెట్ కౌంటర్ ఫాయిల్స్ నుంచి డ్రా తీశాను. విజేతల పేర్లను చదివాను. విజేతలకి బహుమతులు కిన్నెర అందజేస్తుంది. కిన్నెరకు మొమెంటో నేను అందివ్వాలి. ఆమె గురించీ, ఆమె నృత్యం గురించీ నాలుగు మాటలు చెప్పాలి. అదీ ఆ నాటి నా బాధ్యత.

మాధవరావు ఆమెను కూడా వేదిక మీదకు ఆహ్వానించాడు. కిన్నెర గురించి ప్రేక్షకులకుచెప్పి ఆమెబహుమతులనుఅందజేస్తుందని చెప్పాలి. నేను మైక్ ముందు నిలబడ్డాను.

సభలో నిశ్శబ్దం ఆవరించింది.

"నృత్యకళా రాణి, నటరాణి కుమారి కిన్నెరకు నా ఆశీస్సులు, నృత్యకళా వాహినిలో తనివితీరా జలకాలాడి, ఇప్పుడిప్పుడే తనువును తడియార బెట్టుకుంటున్న రసజ్ఞులైన ప్రేక్షకులకు నా నమస్కారాలు.

ఎవరీ కిన్నెర ?

కిన్నెర, కింపురుష, గంధర్వ కన్యలు ఆటపాటలకూ, అందచందాలకూ ఆటపట్టని మన పురాణాలూ, కావ్యాలూ చెప్పగా విన్నాం.

ఆ కిన్నెర కన్యయేనా ఈ కిన్నెర ! లేక సాక్షాత్తూ భరతమునికి అభిముఖంగా నిలిచి నాట్యశాస్త్రాన్ని అభ్యసించి, నాటి నుంచి నేటిదాకా సాధనచేసి, తన వాడి చూపుల వలయంలో వయసును కదలనివ్వకుండా బంధించి ఈనాడు మన ముందు నృత్య ప్రదర్శన ఇచ్చిన నాట్యశాస్త్రకారుని ఆది శిష్యురాలా? లేక ఈమె నృత్యాన్ని చూసి భరతముని నాట్యశాస్త్రాన్ని రచించాడా ?

నేను ఖచ్చితంగా చెప్పలేను. ఊహలకందని ప్రశ్నలివి.

కాని ఒకటి మాత్రం నిజం.

గాయకుడు గుడ్డివాడైనా ఫరవాలేదు.

చిత్రకారుడు చెవిటివాడైనా ఫరవాలేదు.

వైణికుడు కుంటివాడైనా ఫరవాలేదు.

కవి కురూపి అయినా ఫరవాలేదు.

కాని నటుడూ, నర్తకీ ఏ అంగ వైకల్యమున్నా పనికిరారు, రాణించరు.

కిన్నెరను మనమంతా చూశాం.

అంగాంగ పరిపూర్ణమూ, సర్వాంగ సౌందర్యమూ ఆమె సొత్తు.

ఆమె కనుకొనులు సూరకత్తి మొనలు.

ఆమె చూపులు అయిస్కాంత వలయాలు.

వాటికి ఎదుటి వారి మనసును ద్రవింపజేసి తనవైపే ప్రవహించేలా చేసే ఆకర్షణ వుంది.

ఆమె చెక్కిళ్ళు కెంపులు పొదవిన అద్దాలు.

ఆమె పెదవులు అరవిరిసిన అనార్ మొగ్గలు.

ఇలా అమె ప్రతి అవయవాన్ని వర్ణిస్తూపోతే అది ఒక సౌందర్య వ్యాకరణమవుతుంది" అని ఆమె ముఖంలోకి చూశాను. ఆమె రెప్పార్పకుండా నన్నే చూస్తోంది. ఆమె నా చూపులతో చూపులు కలిపి చిరునవ్వు నవ్వింది.

అది చిరునవ్వు కాదు. మన్మథుని మల్లెకాసారకం.

ఆ పైన నాకింకేమి మాట్లాడాలో తోచక "కుమారి కిన్నెరగారిని మొమెంటో

తీసుకోవలసినదిగా కోరుతున్నాను!" అని ఆమెను కళ్ళతోటే ఆహ్వానించాను.

ఆమె నవ్వుతూ వయ్యారంగా వచ్చి నానుంచి మొమెంటో అందుకుంది. మొమెంటో అందుకుంటూ విప్పారిన నేత్రాలతో కృతజ్ఞతాపూర్వకంగా నా కళ్ళలోకి చూసింది. ఆ చూపులకు నా తనువు పులకించిపోయింది.

మొమెంటో తీసుకొని మైక్ ముందు కెళ్ళింది. సభనంతా కలియచూసింది.

"ముఖ్య అతిథి నారాయణరావుగారికి, సభకూ నమస్కారం!" అంటూ నృత్య భంగిమలో నమస్కరించింది. సభా, నేనూ కూడా ఆమె మాటలు వినడానికి చెవులు రిక్కించి ఎదురుచూస్తున్నాం.

"పుణ్య నది ఓ మహా పతివ్రత ఎప్పుడు వచ్చి తనలో జలకమాడి పునీతను చేస్తుందా అని ఎదురు చూస్తూ వుంటుందట. అలాగే కళాకారులు తమ కళా పాటవాన్ని ఆస్వాదించి ఆశీర్వదించే రసజ్ఞులు ఎప్పుడు లభిస్తారా అని ఎదురు చూసారు. ఈరోజు నాకలాంటి అవకాశం కలిగింది. ముఖ్యంగా శ్రీ నారాయణరావుగారి ఉపన్యాసం విన్న తర్వాత నా నృత్యమే బాగుందో, వారి ఉపన్యాసమే బాగుందో నాకు తెలియడం లేదు. ముందుగానే వారి ఉపన్యాసం ఇచ్చివుంటే ఇంత ధైర్యంగా మీ ముందు నిలబడి నృత్యం చేయగలిగే దాన్నికాదు. వారిముందు నృత్య ప్రదర్శన ఇవ్వగలగడం నా అదృష్టంగా భావిస్తున్నాను" అని నన్ను చూసింది కిన్నెర.

ఆ తరువాత విజేతలకు బహుమతులు పంచి పెట్టింది. సభ ముగిసింది.

నేను గ్రీన్ రూమ్‌లోకి వెళ్ళాను. కిన్నెర అద్దంముందు కూర్చుని మేకప్ తుడుచుకుంటూవుంది. అప్పటికే గిల్టు ఆభరణాలూ, జరీ బట్టలు తీసేసి లేత నీలి రంగు షిఫాన్ శారీ కట్టుకుంది. నేను వెళ్ళి ఆమె వెనకనే నిలబడ్డాను. అద్దంలో నన్ను చూడగానే వెనక్కి తిరిగి లేచి నిలబడింది ఎంతోమర్యాదగా. ముఖానికింకా కొద్దిగా నూనె జిడ్డు వుంది. గబగబా తుడిచేసుకుంటూ చుట్టూవున్న జనం నుంచి నన్ను కాస్త పక్కకి తీసు కెళ్ళింది.

నేను ఆమెనే రెప్పార్పకుండా చూస్తు న్నాను. ఆమె శరీర సౌష్టవం, తీర్చిదిద్ది నట్టువున్న వంపులూచూ సేకొద్దీ చూడాలని పిస్తున్నాయి. లోనెక్ జాకెట్టు బిగింపు లోంచి వయసు వయ్యారాలు విరుచుకు బయట పడాలని తాపత్రయపడు తున్నాయి.

ఆమె విరిసిన మల్లెలా మెత్తగా లేదు. పండిన సంపంగిలా జిగిబిగిగా వుంది.

నా చూపులను పరికించి "ఏమిటలా చూసున్నారు?" అంది కిన్నెర నవ్వుతూ.

"ఏం చుసున్నానో మీరే చెప్పండి" అన్నాను కొంటెగా.

"నేను ఆటక త్తెనే కాని మాటకారిని కాను" అంది ఆమె.

"ఆటక త్తెకూమాట లొచ్చుగా. వచ్చిన మాటల్లోనే చెప్పండి" అన్నాను.

"నా మాటల్లో చెప్పడం కంటే మీ మాటల్లో వినాలని వుంది."

"మీ అందాలను కళ్ళారా ఆరగిస్తు న్నాను."

"మీరింకా బాగా చెప్పగలరు" అంది కిన్నెర నా కళ్ళలోకి సూటిగా చూస్తూ.

ఆమె మాటలకు నేను నవ్వుకున్నాను

"ఇందాక వేదిక మీద చంకీలమాటున దండలో దాగిన కుసుమాన్ని చూశాను. ఇప్పుడు యిప్పుడే కొమ్మన విరిసిన కుసుమాన్ని చూస్తున్నాను" అన్నాను.

ఆమె గల గలా నవ్వింది.

అవి నవ్వులు కావు.

మల్లెల జల్లులు.

నవ్వును ఆ పు కొ ని "నాకో వరం యిస్తారా?" అంది.

"వరాలు దేవుళ్ళను అడగాలి."

"అబ్బ" మీతో మాట్లాడటం కష్టం బాబూ! పోనీ నాదో చిన్న కోరిక. తీరుస్తారా?"

"మీ లాంటి నర్తకి అడిగితే కాదన గలనా ? అడగండి"

"మీ ఒక్కరికే నా నృత్యం చూపించే అవకాశం యిస్తారా?" అంది కిన్నెర సిగ్గు లొలికిస్తూ.

"ఇది నేనడుగుదామనుకున్న వరం. మనసెరిగి అడగకుండానే వరాలిచ్చే దేవిలా వున్నారు మీరు. సమయం, స్థలం సెలవిస్తే రెక్కలుకట్టుకొని వాలుతాను" అన్నాను.

"మద్రాసులో మాయింట్లోనే" అంటూ తన విజిటింగ్ కార్డుయిచ్చి' "ఎదురు చూస్తు వుంటాను" అంది.

"ఎదురు చూడనక్కర్లేదు. ఎల్లుండి సాయంత్రానికి వస్తున్నాను" అన్నాను

"థేంక్యూ" అంది ఆమె

"మరినేను వ స్తా ను" అనిఆమెను మళ్ళీ మళ్ళీ చూస్తూ గ్రీన్ రూంలోంచి బయటకొచ్చాను. ఎల్లుండి కోసం వెయ్యి కళ్ళతో ఎదురు చూశాను. ఎల్లుండి రానే వచ్చింది.




ఉదయం ప్లేన్‌కి మద్రాసు వెళ్ళాను.

నేను హోటల్‌కి చేరగానే ఫోన్ చేశాను. కిన్నెరే మాట్లాడింది. ఆమె మాటల ధోరణిచూస్తే నా రాక ఆమెకెంతో ఉల్లాసాన్ని కలిగించిందనిపించింది.

నాకు ఆమె వట్టి నృత్యాన్ని చూపించ డానికే ఆహ్వానించిందా లేక మనసులో మరోవుద్దేశ్యం ఏమైనావుందా అన్న ఆలో చన వచ్చింది నాకు.

ఆమె నృత్యం నాకు నచ్చిన మాట నిజమే! కాని అంత కంటే ఆమె కూడా నచ్చింది. ఆ మాట ఆమెకు ఎలా చెప్పాలో తెలియడం లేదు. తొందరపడి చనువు తీసుకుంటే ఏమనుకుంటుందోనని అనుమానం. ఒకవేళ ఆమె కాదంటే అహం దెబ్బ తింటుందని భయం.

సరే సమయాన్ని బట్టే, ఆమె ప్రవర్త నను బట్టే అప్పుడే ఏం చేయాల్సిందీ నిర్ణ యించుకుందాం కదా అని సాయంత్రం కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాను.

సాయంత్రం కలుద్దామని నేనే అన్నాను. అసలు వెంటనే ఇంటికి రమ్మని ఆహ్వానించింది. కారు కూడా పంపుతానంది. ఆమె అంతగా మర్యాద చేస్తూవుంటే మా మాధవరావు నా గురించి ముందుగానే చెప్పేడేమోనన్న అనుమానం కూడా వచ్చింది. ఆమెకు నిజంగా నామీద ఆసక్తో లేక నేను బంగారు పిచుకను కదా అని గుంజడానికే తాపత్రయ పడుతోందో నాకు అర్థం కావడం లేదు.

ఏది ఏమైనా సాయంత్రం దాకా ఒంటరిగా కాలక్షేపం చేయడం కష్టంగానే వుంది.

మొత్తానికి సాయంత్రం దగ్గరపడింది. తొందరగా తయారయ్యాను.

చెప్పిన వేళకు ఆమె కారు పంపిం చింది.

కిన్నెర ఇంటికి బయలుదేరాను.

కారు పోర్టికోలో ఆగ్గానే ఆమే స్వయంగా బయటకొచ్చి, ఆహ్వానించి లోపలికి తీసుకెళ్ళింది.

ఇల్లు చిన్నదే అయినా చూడముచ్చటగా వుంది. అలంకరణలన్నీ అధునాతనంగా వున్నాయి. అధునాతనంతోబాటు కళాత్మకం వుట్టిపడుతోంది. హాలులోకి అడుగుపెట్టగానే ఎదురుగా ఒక టేబిలు మీద నటరాజు విగ్రహం. ఆ హాలులో డాన్సు క్లాసులు తీసుకుంటుందట కిన్నెర.

నన్ను మేడ మీదకు తీసుకువెళ్ళింది. మేమిద్దరం మేడమీదకు వెడుతూవుంటే పన్నెండేళ్ళ అమ్మాయి కిందకి దిగుతోంది.

"మా చెల్లెలు రాణీ" అని ఆ అమ్మాయిని నాకు పరిచయం చేసింది.

''అంకుల్‌కి నమస్కారం చెప్పు'' అంది అమ్మాయితో. రాణి నమస్కారం చెప్పింది. 'నమస్తే అంకుల్' అంటూ.

రాణి చూడ్డానికి ఎంతో ముద్దుగా వుంది.

''కారు రెడీ. నువ్వు పిక్చర్‌కి వెళ్ళొచ్చు'' అంది కిన్నెర.

రాణి సినిమాకి వెళ్ళిపోయింది.

నన్ను మేడమీద గదిలోకి తీసుకెళ్ళింది. అది ఆమె పడక గది. విశాలమైన స్ప్రింగ్ కాట్. ఎదురుగా నిలువుటద్దం. ఓ పక్క ఫ్రిజ్, మరో పెద్ద బీరువా. కింద మెత్తని కార్పెట్, ఓమూల సోఫాసెట్. విండోలకి నీలిరంగు పల్చని తెరలు. ఎయిర్‌కండిషన్డ్ రూమ్. గదిలోకి అడుగు పెట్టేసరికి మంచి గంధపు సువాసనలు-స్ప్రింగ్ కాట్ మీద క్రీమ్ కలర్ బెడ్‌షీట్సు.

నేను వెళ్ళి సోఫాలో కూర్చున్నాను.

"స్నానం చేస్తారా'' అంది కన్నెర.

"ఇప్పుడే చేశాను" అన్నాను.

''ఏం తీసుకుంటారు? కాఫీయా, కూల్ డ్రింక్సా-హాట్ డ్రింక్సా?"

''కూల్ డ్రింక్" అన్నాను మోహమాటంగా.

"ఎండవేళ కూల్ డ్రింక్స్ తీసుకోవాలి. ఇలాంటి చల్లని వేళ హాట్ డ్రింక్స్ తీసుకోవాలి'' తార చంద్రుడుకి పాఠాలు చెప్పినట్లే చెప్పింది.

నా సమాధానం కోసం ఎదురు చూడకుండానే ఓ 'స్కాచ్' బాటిలు, సోడాలు, గ్లాసులూ తెచ్చి నా ముందు టీపాయ్ మీద పెట్టింది.

ఓ గ్లాసులో విస్కీ పోసి, సోడా కలిపి నా కందించింది.

"మరి మీరు ?'' అన్నాను.

''ముందు నా కోరిక తీర్చుకున్నాక' అంటూ కాళ్ళకు గజ్జెలు కట్టుకుంది.

"వాయిద్యగాళ్ళు, పాట పాడేవారూ లేకుండానేనా నృత్యం'' అనడిగాను.

''ఏకాంతంగా మీ కోసం ప్రత్యేకంగా చేస్తున్న నృత్యం ఇది. మూడవ వ్యక్తి మధ్యన వుంటే అనుభూతికి అంతరాయం కదా. అందుకని టేప్‌చేయించి వుంచాను'' అని టేప్ ఆన్ చేసింది.

చక్కటి జావళీ వినిపిస్తోంది.

కిన్నెర నృత్యం ప్రారంభించింది.

నేను విస్కీ సిప్ చేస్తూ ఆమె నృత్యాన్ని చూస్తున్నాను. ఎంతో అద్భుతంగా చేస్తోంది. నన్నే చూస్తూ, నా కోసమే ఆమె అలా నృత్యం చేస్తూవుంటే నేను ఏ దేవలోకంలోనో వున్నట్లు అనిపించింది. దేవ నర్తకి నా కోసమే గజ్జెకట్టినట్టువుంది ఆ క్షణాన.

ఆమె అభినయంలోని శృంగారాభినయం, విరహ విన్యాసాలూ నాకు మత్తెక్కిస్తున్నాయి. చేతిలోని గ్లాసులోంచి చుక్కకూడా నా గొంతులోకి దిగలేదు. ఆమె నృత్య భంగిమలు అందించే మధువును కనులారా తాగి మైమరచి పోతున్నాను.

నాట్యం పూర్తిచేసి పమిటకొంగుతో మెడనూ, ముఖాన్నీ వత్తుకొంటూ వచ్చి నా పక్కనే కూర్చుంది కిన్నెర. నృత్యం పూర్తికాగానే చప్పట్లు కొట్టాలనుకున్నాను. కాని "చాలా బాగా చేశారు" అని మాత్రం అన్నాను.

"థేంక్యూ" అంది కిన్నెర.

"నేనే థాంక్సు చెప్పాలి మీకు"

"ఎందుకూ?"

"వెనక రాజులకు, రారాజులకు యిలాంటి అవకాశాలుండేవి. నేనేమీ కాకపోయినా అలాంటి అవకాశం కలిగించారు"

"ఈ అవకాశం అంతకంటే గొప్పది రావుగారూ! రాజులు, రారాజులు శాసించి ఆడించేరు. నర్తకికి యిష్టమున్నా లేకపోయినా ఆడేది. అలాంటిది నేను కావాలని కోరుకొని మీముందు ఆడాను. మనసైనపుడు ఆడే నెమలికీ - సర్కస్‌లో ఆడే నెమలికీ ఎంత తేడా వుందో అంతతేడా వుంది-రాజదర్బారులోని నృత్యానికీ, యీ నా నృత్యానికీను" అంది కిన్నెర.

నాకు నిజమే అనిపించింది.

"ఇహ నాకు కంపెనీ యిస్తారా" అన్నాను మరో గ్లాసులో విస్కీపోస్తూ.

"తప్పకుండా.గజ్జె కట్టేముందుతాగను. గజ్జె విప్పేక తాగకుండా వుండలేను" అంటూ గ్లాసు తీసుకొని"ఛీర్స్"చెప్పింది,

"ఎన్నాళ్ళనుంచీ కళారాధన?" అనడిగాను సిప్‌చేస్తూ.

"చిన్నతనం నుంచీను"

"అదే ఎన్నేళ్ళనుంచీ అని"

ఆమె నవ్వేసింది. "మీరు చాలా తెలివైనవారు. నేను మీ ఆదాయం అడిగానా" అంది కిన్నెర.

ఆమె మాటకారితనాన్ని అభినందించకుండా వుండలేకపోయాను. నవ్వేకుని "ఆడదాని వయసూ మగవాడి ఆదాయం అడగకూడదని హెచ్చరిక" అన్నాను.

"మీరు ఏమి అడిగినా చెబుతాను. మీ దగ్గర నాకు ఏమీ దాచుకోవాలనిపించడం లేదు ఎందుకనో. నా వయసు ముప్పైరెండు. కాని నృత్య సాధన మూలంగా అంత కనపడదు. ఇంకా ఏమైనా అడగాలా నన్ను".

"సారీ. మిమ్మల్ని నొప్పించాననుకుంటాను. ఏమీ తోచక అడిగిన ప్రశ్న. మిమ్మల్ని యిలా చూస్తూ-యిలా మీ ముందు కూర్చుంటే ఎంతో హాయిగా వుంది. ఇంక నేనేమీ అడగాల్సిన ప్రశ్నలు లేవు" అన్నాను.

"కానీ నేనో ప్రశ్న అడగాలనుకుంటున్నాను?" అందామె.

"అడగండీ"

"గత జన్మలో మీరు ఋషా ?"

"గతజన్మ సంగతి నాకెలా తెలుస్తుంది? ఎందుకలా అనుకున్నారు?"

"నా నృత్యం మిమ్మల్ని కదలించలేకపోయిందే అని".

"మనసును ఎప్పుడో కదిలించింది. తనువు కదలడానికి సంస్కారం అడ్డొచ్చింది".

"ఏమైనా నేననుకున్నట్లుగానే మీరు చిత్రమైన మగవారండీ".

నవ్వేకుని, "కాస్త విపులంగా

చెప్పరాదూ" అన్నాను.

"అన్నీ నా నోటితోనే చెప్పించాలనా?" అందామె.

"సారీ! నేను చనువు తీసుకుంటే మీరు ఏమనుకుంటారోనని గాని, మీరంటే ఎంతో ఇష్టం నాకు" అంటూ ఆమె భుజం చుట్టూ చేయిచుట్టి దగ్గరకు తీసుకున్నాను.

"ప్లీజ్! ఒక్క క్షణం ఆగండి కాస్త నన్ను మాట్లాడనివ్వండి" అంటూ నా చేతిని ఎంతో మృదువుగా ఒత్తిగించింది కిన్నెర. ఆమె మనసేమిటో నాకర్థం కాలేదు. అర్థంకానట్లే ఆమె కళ్ళలోకి చూశాను.

"మీరే నన్ను అడుగుతారనుకున్నాను కాని నాచేతనే అడిగించారు. ఆ బిగువూ నాకు నచ్చింది. మీరంటే మరింత ఆకర్షణ పెరిగింది. ఓ కాంత ఏకాంతాన్ని సమకూర్చి కావాలని కోరి గజ్జెకట్టి కళ్ళ ముందు నిలబడితే—'మీరూ మీరూ' అనే పిలుస్తున్నారు. నోరుతెరిచి అడిగేదాకా మీలోచలనంలేదు. మిమ్మల్ని చూ సే చాలా ప్రిన్స్‌పల్డ్ పెరసన్‌లావున్నారు. నేను మీనుంచి కో రు కొ నే ది క్షణికమైన సుఖం కాదు. కలకాలం నిలిచే సాంగత్యం స్నేహం."

"నేనూ మీ నుంచి కోరుకొనేది కూడా అదే"

"అయితే నాగురించి మీకు తెలియాలి పూ ర్తిగా"

"ఏమిటి తెలియాలంటారు?"

"నా గతం—నేను పెద్ద కుటుంబంలోనే పుట్టాను. చిన్నప్పటి నుంచీ డాన్స్ అంటే నా కిష్టం. ఒక గురువు దగ్గర చేర్పించారు. డాన్స్ నేర్పించారు. కాని ఆయన నన్ను లొంగదీసుకొని నా వాళ్ళకి నన్ను కాకుండా చేశారు. ఆ తరువాత ఆయన పోయారు. ఇల్లు వదలి బయట పడ్డాను. ఆ తరువాత యీ స్థాయికి చేరడానికి, యీ అంతస్తు నిలబెట్టుకోవడానికి - కొందరు పెద్దవాళ్ళకి లొంగాను. నేను ఏ మగవాడికీ రెండవ ఆడదాన్ని కాకూడదనుకొనే దాన్ని నాకు వూహ తెలిశాక. ఏ ఒక్క మగవాడికీ మొదటి ఆడదాన్ని కా లే క పోయాను. మీకు నేను మొదటి దాన్ని కాదని నాకు తెలుసు. అయినా మీరంటే ఎందుకని నా అంతట నేనే యిష్ట పడుతున్నానో తెలుసా? చాలా మంది మగవాళ్ళు నేనే కావాలని వెంట పడ్డారు. నన్నే అభిమానించే వారు అవసరానికి. కానీ మీరు ముందు నా కళను అభినందించారు. తరువాత నన్ను అభిమానించేరు. ఆ కళను వదులుకోలేకనే యిలా జీవితపు పాకుడు రాళ్ళ మీధ జారి పోయాను. కళను కూడా మీరు అభిమానించడం చేత మిమ్మల్ని నేను అభిమానిస్తున్నాను. ఇందాక మీరు చూచిన పిల్ల నా చెల్లెలు కాదు, నా కూతురు. ఇప్పుడు మీరు నన్ను కావాలను కుంటున్నారా? కావాలనుకుంటే నా కభ్యంతరం లేదు" అందామె.

ఎంతో ఆవేశంగా ఆమెను దగ్గరకు తీసుకున్నాను.

"కిన్నెరా! నీవు నాకు మొదటి ఆడదానివి కాని మాట నిజమే. రెండవ దానివి కూడా కాదు. ని జ ం చెబుతున్నాను. నీ దగ్గర నిజం చెప్పకుండా వుండలేక పోతున్నాను. నాకు నువ్వు నూట యాభై ఒకటవ దానివి.

ఆ మాట వినేసరికి ఆమె తుళ్లిపడి నా ముఖంలోకి చూచింది.

"కాని నూటయాభై రెండవ ఆడది నాజీవితంలో యిహ వుండదు" అన్నాను.

"మీ ఫ్రెంక్‌నెస్‌కి జోహార్లండీ. థాంక్యూ" అంటూ గట్టిగానన్ను కౌగలించుకుంది కిన్నెర.

అలా యిద్దరం ఒకరి కౌగిలిలో ఒకరు ఒదిగి బెడ్ మీదకు వచ్చాం.

నా జీవితానుభవాలన్నింటికన్న తీయని అనుభవం అది. జ్ఞాపకం బతికినంతకాలం బతికే అనుభూతి అది.

ఆమె స్పర్శలో ఏదో విచిత్రమైన సుఖం. ఆమె ఆలింగనలో ఏదో మైమరపించే ఆవేశం. ఆమెలో నేనింతవరకూ ఎక్కడా చవిచూడని బిగీ! జిగీ!

ఎన్నో పూవుల మీద వాలి రకరకాల మధువులను గ్రోలిన నాకు మధువులకే మధురిమనిచ్చే మధువును కొసరి కొసరి, కవ్వించి కవ్వించి అందిస్తోంది కిన్నెర.

దోరజామని కొరికిన అనుభవం ఆమెతో పొందు.

ఇద్దరం అలసిపోయాం.

ఆమె ముంగురులను సవరిస్తూ "కిన్నెరా" అన్నాను.

"చెప్పండి" అందామె,

"నన్ను నువ్వు అనలేవూ" అన్నాను.

"అనరాదూ—అనలేను" అంది నాలో ఒదిగిపోతూ.

"ఎందుకని?"

"మీరంటే గౌరవం, ప్రేమా, భక్తి అన్నీను"

"ఇంతలోనే"

"మీరెంతలో నన్ను ఆనాడు వేదిక మీద అంతగా అభినందించారు ?"

ఆమెను నాలో పొదవి పట్టుకొని, తనువంతా తడుముతూ "కిన్నెరా తుమ్మెదలేపువ్వులను వెతుక్కుంటూ రెక్కలు నెప్పి పుట్టేలా ఎందుకు పరుగులు తీస్తాయి"

"పువ్వులకు రెక్కలు లేవు కనుక" అంది కొంటెగా ఆమె.

ఆమె మాటలు నాకు నా ఒక్కడికే వినిపించే తీయని సంగీతం.

అలా రెండురోజులు గడిచిపోయాయి.

పగలూ రేయీ మా గదిలోకి రాలేదు. ఆ రెండు రోజులూ మాయిరువురి కోసమే పుట్టిన తీయని రేయిలు.

అంతవరకు ఎందరితోనో పరిచయాలు పెంచుకున్నా ఈ పరిచయం ఎందుకో అపురూపంగా వుంది నాకు.

ఆమె నృత్యం ఎక్కడ వున్నా వెళ్ళిపోయే వాణ్ణి. నేను ఎదుట లేకపోతే అడుగులు తడబడతాయనీ, లయ తప్పుతుందనీ అనేది కిన్నెర.

కాస్త ఖాళీ దొరికితే యిద్దరం ఎక్కడెక్కడికో ప్రయాణమయ్యే వాళ్ళం. ఊటీ, కాశ్మీర్, ఆగ్రా, కొచ్చిన్, అజంతా బరితెగించి తిరిగేస్తున్నాం.

"ఒకసారి తిరుపతి వెళ్ళి యిద్దరం కలసి దైవదర్శనం చేసుకోవాలంది" కిన్నెర.

"దేవుని ఎదుట విడిపోమని ప్రమాణాలు చేసుకోవాలా" అన్నాను.

"కాదు కలసి వుంటున్నామని చెప్పడానికి" అంది నవ్వుతూ.

ఇద్దరం తిరుపతికి బయలుదేరాం.

ఇది నా కడపటి ప్రేమ మజిలీ.

ప్రేమకు అర్థం తెలిసిన మజిలీ.

 




"అవి బాబూ నా ప్రేమ మజిలీలు!

వీటిని ప్రేమ మజిలీలు అనడం కంటే పాలజల్లు లాంటి వెన్నెలలు వెద జల్లే చందమామలోని నల్లని మచ్చల్లా నా తెల్లని జీవితంలో చెరగని మచ్చలుగా నిలిచిపోయిన సత్యాలివి. నాకున్న కీర్తి ప్రతిష్టలు నీకు తెలుసు. క్రమశిక్షణకు మరో పేరు నారాయణరావు అంటారనీ నీకుతెలుసు. నే చెప్పిందంతా 'నారాయణ రావు జీవిత చరిత్ర' అని ఒక పుస్తకంగా అచ్చువేసి జనానికి పంచిపెడితే ఒక్కరూ నమ్మరు.

పంచి పెట్టినవాణ్ణీ, అచ్చువేసిన వాడినీ కొడతారు కూడా. ఈ నాడు సొసైటీలో నా ఇమేజ్ అలాంటిది. సిగ్గు విడిచి ఈనాడు నీకు వివరించిన నా గతం నా మజిలీలలో భాగస్వాములైనవారికి తప్ప మరెవరికీ తెలీదు. ఆఖరికి మీ అమ్మ లక్ష్మికి కూడా. అంత గోప్యంగా వుంచిన నా గతాన్ని ఈనాడు నా కన్న కొడుకువైన నీకెందుకుచెబుతున్నానా అని ఆశ్చర్యపోతున్నావు కదూ!" అన్నాను నా కెదురుగా కూర్చొని నా గతాన్నంతా ఎంతో శ్రద్ధగా విన్న నా కొడుకు మురళీ ముఖంలోకి చూస్తూ.

ఇప్పుడు మురళీ వయస్సు ఇరవై రెండేళ్ళు. యుక్త వయస్సు వచ్చింది. నాకు మిగిలింది మురళీ ఒక్కడే. నా కొడుకు నా అంతటివాడు కావాలని నా ఆశ. కానీ వాడి జీవితం నా జీవితంలా కాకూడదని దుగ్ధ. అందుకే నా స్నేహితులకు కూడా ఏనాడూ చెప్పని నా వ్యక్తిగత జీవితం గురించి విపులంగా మురళీకి చెప్పాల్సి వచ్చింది. అలా చెప్పాల్సిన పరిస్థితి మురళీయే తీసుకువచ్చాడు.

అంతా విన్న మురళీ బరువుగా నిట్టూర్చి ఎందుకిదంతా చెప్పానో అర్థం గాకా, పూర్తిగా తలవంచుకొని కూర్చోలేకా, సూటిగా నా కళ్ళల్లోకి చూడలేకా ఇబ్బంది పడుతున్నాడు.

మురళీ పరిస్థితి నేను గ్రహించాను.

"నేను స్నేహితులతో నా గురించి నేను చెప్పుకోలేక పోవచ్చు బాబూ! కానీ నువ్వు నాకు స్నేహితుడికంటే ఎక్కువ. నీకు చెప్పకుండ ఉండలేను. ఇన్నాళ్లూ మనసులో దాచుకున్న ఈ గతాన్ని నీకు చెప్పుకొని నా మనసు తేలిక చేసుకుందామని కాదు. నీ జీవితానికి ఉపకరిస్తుందనీ, ఉపకరించాలనీ చెబుతున్నాను. ఇప్పుడు నా వయస్సు అరవైకి దగ్గర పడుతోంది. పదేళ్ళ క్రితం మీ అమ్మ పోయింది. ఆనాటి దాకా, యీ నాటి వరకూ నేనిటువంటి వాడినని ఎవరికీ తెలియదు. వెన్నెలలా సాగిపోతున్న నా జీవితం వెనుక ఇలాంటి చీకటి మరకలు వున్నాయని ఎవరూ ఎరగరు. నేను పెద్ద పారిశ్రామిక వేత్తననీ, నీతి నియమాలకు నేను పెట్టింది పేరనీ జనం విశ్వాసం.

కానీ నేను పడుతున్న మానసిక సంక్షోభం నాకు తప్ప మరెవరికీ తెలీదు. అలా అని గెడ్డం పెంచుకోలేదు. కాషాయ

వస్త్రాలు ధరించలేదు. తల నెరిసినా తెల్లని వెంట్రుక ఎవరి కంటా పడనీయ లేదు. చాలామంది ఈ నాటికీ నాకు యాభై దాటలేదనే అనుకుంటారు. అది నా జీవిత విధానం. మనసులోని బాధలు మొఖంమీద కొట్టొచ్చినట్టు కనపడేలా చేసుకోవడం నాకు మొదటి నుంచీ కిట్టదు. కానీ అలా దాచుకోగలగడం చాలా కష్టం. గతస్మృతులు హృదయాన్ని రంపపుకోత కోస్తుంటే పెదవుల మీద చిరునవ్వులు నింపుకోగలగడం నిజంగా ఒక గొప్ప కళ.

మీ అమ్మ లక్ష్మి పోయిన నాటి నుంచీ మీ అమ్మ ఎలా పోయిందో, ఎందుకు పోయిందో నాకు తెలిసినా ఇంతవరకూ నీకు కూడా చెప్పలేదు. అందరూ అను కున్నది మీ అమ్మ హార్ట్ ఎటాక్‌తో పోయిందని. కానీ అది నిజం కాదు."

"మరెలా పోయింది?" అన్నాడు ఆత్రంగా.

"నేనే హత్య చేశాను!" అన్నాను గంభీరంగా. మురళీ నా కళ్ళలోకి ఆశ్చ ర్యంగానూ, అసహ్యంగానూ చూశాడు.

"హత్య చేశానని నేననుకుంటున్నాను. నేను హంతకుడినో కాదో నువ్వు చెప్పాలి. మీ అమ్మ పదిరోజులకి పోతుం దనగా నేను ఆఫీసు పనిమీద మద్రాసు వెళ్ళాను. ఆరోజు డిశంబరు ఇరవై. జనవరి మూడో తారీకు మీ అమ్మ పుట్టిన రోజు. ఆ రోజుకు తప్పకుండా వస్తానని మీ అమ్మకు మాటిచ్చి వెళ్ళాను. అమ్మకు ఇచ్చిన మాట నా జీవితంలో ఎప్పుడూ తప్పలేదు బాబూ! అందుకే మీ అమ్మకు కొండంత నమ్మకం. రాముడిలా నాకు కూడా ఒకేమాట ఒకే భార్య అని ఆమె నమ్మకం.

కిన్నెర తిరుపతి వెళ్ళాలని సరదా పడితే యిద్దరం కలిసి తిరుపతి వెళ్ళాం. కాటేజీలో దిగాం. ఆమెను తీసుకొని స్వామి దర్శనానికి వెళ్ళాను. పాపనాశ నానికి వెళ్ళాం. కానీ చిత్రం ఏమిటంటే పిల్లి పాలు తాగుతూ ఎవ్వరూచూడటం లేదనుకున్నట్లు నేను కిన్నెరను వెంటేసుకొని తిరిగాను. మీ అమ్మకిచ్చిన మాట ప్రకారం జనవరి మూడో తేదీ ఉదయానికి యింటికొచ్చాను. మీ అమ్మ పుట్టినరోజు కదా అని డైమండ్ నెక్లెస్సూ, పట్టు చీరలూ కూడా తెచ్చాను. నేను వచ్చే వేళకి ఎప్పుడూ గుమ్మంలో నిల బడి 'వచ్చేశారా!' అంటూ చిరునవ్వుతో ఆహ్వానించే మీ అమ్మ గుమ్మంలో కన పడలేదు.

'లక్ష్మి! లక్ష్మి!' అంటూ మేడమీదకు వెళ్ళి పడకగది తలుపు తెరిచాను. మీ అమ్మ యింకా నిద్రపోతూనే వుంది. పక్కలో కూర్చొని 'లక్ష్మి!' అంటూ భుజం పట్టుకొని కుదిపాను. మీ అమ్మ కదలలేదు. మీ అమ్మ శాశ్వత నిద్ర పోయిందని అప్పుడు తెలిసింది.

పుట్టినరోజుకని తెచ్చిన పట్టు చీరలు ఆమె కట్టుకుందుకు కాకుండా ఆమె శవానికి కప్పడానికి పనికొచ్చాయి. మర ణించిన ప్రతి మనిషికీ జరగాల్సిన కర్మ కాండంతా మీ అమ్మకూ జరిగింది. కాక పోతే మన హోదాను బట్టి కాస్త ఘనంగా జరిగింది. పదకొండవ రోజున మీఅమ్మనే తలుచుకొంటూ ఒంటరిగా పడక గదిలో పడుకున్నాను. అంతవరకూ నేనాగదిలోకి వెళ్ళలేదు. వెళ్ళలేక పోయాను. నిద్ర




పట్టిక అటూ యిటూ దొర్లుతూంటే దిండులో కాగితం రెపరెప లాడింది. ఏమిటోనని తీసి చూశాను.

అది మీ అమ్మ నాకు రాసిన ఆఖరి ఉత్తరం. ఇదిగో బాబూ! చదువు" అని మురళీ చేతికిచ్చాను ఆ ఉత్తరాన్ని.

మురళీ ఉత్తరం విప్పాడు.

"ఏమండీ! తప్పకుండా మీరు నా పుట్టినరోజుకి వస్తారని నాకు తెలుసు. అందుకే ఈరోజు దాకా ఆగాను. మీరు కేంపుకి వెళ్ళిన తర్వాత మా అమ్మా, నాన్నా వచ్చారు. అసలు మనిద్దరినీ కూడా తిరుపతి తీసుకువెడదామనే వచ్చారట. మీరు లేకపోవడంతో మీరు వచ్చేలోగా వచ్చేయొచ్చని వాళ్ళతో కలిసి తిరుపతి వెళ్ళాను. మిమ్మల్ని అడక్కుండా వెళ్ళడం తప్పేననుకోండి. అమ్మ తోటీ, నాన్నతోటీ కదా యేనని వెళ్ళాను. పైగా దైవదర్శనానికి కదా! అక్కడికి వెళ్ళి ఓ కాటేజీలో దిగాం. మర్నాడు దర్శనానికి వెళ్ళాలి. ఆ రాత్రి తిరుపతి ఎందుకొచ్చానా అనిపించిందండీ. మీరు జ్ఞాపకం వచ్చారు. తిరుపతి శ్రీనివాసుడి కంటే మీరే ఎన్నోరెట్లు గొప్పవారు అనిపించింది. ఎందుకో తెలుసా? కొండమీద పద్మావతీదేవి, కొండకింద అలివేలు మంగ - యిద్దరు భార్యలట ఆయనకి. కానీ నా దేవుడికి నేనొక్కరెనే, ఆదేవుడికంటే నాదేవుడే మంచివాడు అని మురిసిపోయాను.

తెల్లవారింది. దైవదర్శనానికి వెళ్ళాం. నా ముందు మీరు మరో అమ్మాయి భుజం మీద చెయ్యివేసి దేవుడి ముందు నిలబడి దైవ దర్శనం చేసుకొంటున్నారు. పొరబడ్డానేమోనని గుచ్చి గుచ్చి చూశాను. నా దేవుణ్ణి నేను గుర్తుపట్టలేనంత అజ్ఞానంలో లేను కదండీ! ఆ అమ్మాయి పక్కనున్నది మీరే. ఆ అమ్మాయి మన బంధువుకాదని నాకు తెలుసు. మనసుకి ఎలా నచ్చచెప్పుకోవాలో తెలియక కాటేజీకి వచ్చి ఏడుస్తూ పడుకున్నాను. కొంతసేపయ్యాక కారు చప్పుడు విని బయటికి తొంగి చూశాను. మీరూ, ఆ అమ్మాయి కారుదిగి మా పక్క కాటేజీలోకి వెళ్ళారు. ఇంకా అనుమానం తీరక ఆ కాటేజీలో పనిచేసే పని కుర్రాడిని పిలిచి మీ గురించి అడిగాను. 'ఆరిద్దరూ మొగుడూ పెళ్ళాం అనుకుంటానండి. రెండో పెళ్ళేమో? అస్తమానూ యికయికలూ, పకపకలూనండి' అన్నాడు ఆ కుర్రాడు. వాడి మాటలు వింటూంటే నా మనస్సును ఎవరో పిండేస్తున్నట్లనిపించింది.

ఇంటి కొచ్చేశాం.

'అలా వున్నావేమిటమ్మా?' అని మా అమ్మ దారిపొడుగునా అడుగుతూనే వుంది. అమ్మకు చెప్పలేదు నేను. జనవరి రెండో తారీకు దాకా ఆగాను. అంతవరకూ ఆలోచించుకుంటూనే వున్నాను. దాదాపు మీతో ఇరవై య్యేళ్ళు కాపురం చేశాను. నన్ను అరచేతిలోని నిమ్మపండులా చూసుకున్నారు మీరు. మీ ప్రేమ నాకు పరిపూర్ణంగా లభించిందనుకున్నాను. అనుకోవడమేమిటి? నిజంగానే లభించింది. కానీ మరో అమ్మాయితో తిరుపతిలో మిమ్మల్ని చూసిం తర్వాత నా అభిప్రాయాన్ని మార్చుకున్నాను. మీ మీద నాకుగల అభిప్రాయాన్ని కాదు, నామీద నాకుగల అభిప్రాయాన్ని మార్చుకున్నాను. అన్నివిధాలా మీ యిల్లాలుగా మిమ్మల్ని తృప్తి పరిచానని నా నమ్మకం.

కానీ తిరుపతిలో మిమ్మల్ని చూసిం తర్వాత మీకు పరిపూర్ణమైన తృప్తిని ఇవ్వలేక పోయానని తెలుసుకున్నాను. ఇరవైయేళ్ళు మీతో కాపురం చేసి మీకివ్వలేని తృప్తినీ, అందించలేని సుఖాన్ని యిక శేష జీవితంలో మాత్రం యివ్వగలనా ? ఇవ్వలేను ! ఎలా యివ్వాలో నాకు తెలీదు. అలాంటప్పుడు మీ సుఖానికి నేనెందుకు అడ్డుగా వుండాలి ? మీరు సుఖంగా వుండడం కంటే నాకు కావాల్సిందేముంది? శలవా మరి ?"

మురళీ అలా ఉత్తరం చదివాడు. అప్పటికే కళ్లు చెమ్మగిల్లాయి.

"ఇప్పుడు చెప్పుబాబూ ! మీ అమ్మను నేనే హత్య చేశాను కదూ !"

మురళీ మాట్లాడలేదు.

"నేనే హత్య చేశాను బాబూ ! కానీ నిజానికి మీ అమ్మ ఆత్మహత్య చేసుకొంది. ఆ విషయం చట్టానికి తెలిస్తే ఆమె నేరస్థురాలవుతుంది. నేరం చేసిన నేను చట్టానికి దొరకను. అందుకని నే చేసిన నేరానికి నేనే శిక్ష విధించుకోవాలనుకున్నాను. మీ అమ్మలా నేనూ నా జీవితాన్ని ముగించుకొని పిడికెడు బూడిదై మట్టిలో కలిసిపోవడం శిక్షా ? లేక అంతకంటే కఠినమైన శిక్ష మరొకటుందా ? ? అని ఆలోచించాను.

చావు చాలా చిన్న శిక్ష అనిపించింది నాకు. చావు శిక్షకు విముక్తి కానీ శిక్ష కాదనిపించింది. అందుకే బతుకుతున్నాను. కానీ గతంలోలా కాదు. మీ అమ్మ రాసిన ఉత్తరం చదివిన నాటి నుంచీ నేను కన్నెత్తి మరో ఆడదాన్ని చూసి ఎరగను. మీ అమ్మ చావు నాలో చాలా మార్పు తెచ్చింది. నా చపలత్వం చచ్చిపోయింది. బలహీనత ఎండిపోయింది. పశ్చాత్తాపంతో నా మనసు అనుక్షణం కుత కుత వుడికిపోతూనే వుంది. తోడు కావలసిన యీ వయసులో జీవితాంతం తోడుగా వుంటుందనుకున్న మీ అమ్మ లేకుండా ఒంటరిగా యీ పశ్చాత్తాపంతో మగ్గిపోతున్నాను బాబూ ! ఈ శిక్షలో నాకు చాలా తృప్తి వుంది. మీ అమ్మ బతికినంత కాలం దైవ మందిరంలో దైవానికి సరసన నా రూపాన్ని నిలుపుకొని పూజలుచేసింది. ఈనాడు మీ అమ్మ రూపాన్ని నా మనసులోనే నిలుపుకొని ధ్యానం చేసున్నాను. భారతీయ సంస్కృతిలో వైవాహిక బంధం ఎంత పవిత్రమైనదో, ఎంత వుదాత్తమైనదో మీ అమ్మ నాకు తెలియజెప్పింది. కానీ ఆలస్యంగా తెలుసుకున్నాను. నీకైనా తెలియ చెప్పాల్సిన వయసులో తెలియ చెప్పాలని యిదంతా చెబుతున్నాను. ఎందుకోతెలుసా? నీకీమధ్య పెళ్ళి సంబంధం వచ్చింది. ఆ మ్మాయిని చూశావు. ఒప్పుకున్నావు. కానీ యీ మధ్యనే నీ గురించి నాకు కొన్ని విషయాలు తెలిశాయి.

నువ్వు నీరజ అనే అమ్మాయిని ప్రేమించావట. పెళ్ళి చేసుకుంటానని మాటిచ్చావట. మీరిద్దరూ కలిసి తిరిగారట కూడా ! ఆ అమ్మాయి స్వయంగా నా దగ్గరకొచ్చి ఈ సంగతి చెప్పింది. నీరజను ప్రేమించి, పెళ్ళి చేసుకుంటానని మాటిచ్చి మరో అమ్మాయిని పెళ్ళి చేసుకుందుకు నువ్వెలా సిద్ధపడ గలిగావో, ఎందుకు అంగీకరించావో నాకు తెలీదు. నువ్వు నీరజనే పెళ్ళాడతానంటే నేను అడ్డు చెప్పను. ఆ పిల్ల

ఎవరైనా ఫరవాలేదు. ఈ మాట నేను అభినేత్రిని ప్రేమించినప్పుడు మా నాన్న అని వుంటే నా జీవితం ఎలా వుండేదో నాకు తెలీదు.

కోరికలను అదుపులో వుంచుకొని జీవితాన్ని గడపగలిగితే ఆ జీవితం నదీ ప్రవాహం అవుతుంది బాబూ! కోరికలకు తలవంచి, కోరికలు నడిపినట్లు జీవితాన్ని నడిపితే అది వరద అవుతుంది. నదికి వున్న పవిత్రత, పూజనీయత వరదకు వుండదు. నది సృష్టికి దోహదం చేస్తే, సృష్టిని విధ్వంసం చేస్తుంది వరద. నా జీవితం వరదలాగే సాగిపోయింది.

ఎన్నో జీవితాలు నా జీవిత వరదలో మునకలు వేసి విచిత్రమైన రూపాలను దాల్చాయి.

అనుకోకుండా ఆప్యాయంగా పిలిచి నాకు తొలి ఆనందాన్నందించిన సత్యవతి జనానికి చాలా దూరంగా, జనం కంటబడకుండా కుష్టు ఆసుపత్రిలో వుంటోం దిప్పుడు. నా కెలా తెలుసునని అడక్కు. తొలి అనుభూతినిచ్చిన అభిమానంతో నేనే వెతికి తెలుసుకొని డబ్బు పంపిస్తున్నాను చాలా కాలంగా.

అభినేత్రి నీతిని తలుచుకుంటే నేనిప్పటికీ సిగ్గుపడతాను. అభినేత్రి మరెవరితోటీ ప్రేమలో పడలేదు. పెళ్ళి చేసుకోలేదు. గజ్జెకట్టి ప్రదర్శన ఇవ్వలేదు. సంఘసేవకురాలిగా జీవిస్తూ తనను తాను మరిచిపోయి సంఘం కోసమే బతుకుతోంది. పది మంది మగవాళ్ళ మధ్యా ఆమె కలిసి తిరుగుతున్నా, ఆమె శీలాన్ని గురించి మాట్లాడ గలిగినవారు కానీ, వేలెత్తి చూపగలిగిన వారు కానీ లేరు. ఆమె నిప్పు అని అందరికీ తెలుసు.

చివరిసారిగా మేం కలుసుకున్నప్పుడు ఇందిర నాతో అన్నమాట నిలబెట్టుకుంది ఈనాటికీ. ఢిల్లీలో పాఠశాల నెలకొల్పి నిర్వాహకురాలిగా వుండి విద్యా దానం చేస్తోంది. ఇంతవరకూ ఆమె పెళ్ళి చేసుకోలేదు.

షీలా కొంత కాలం వ్యాపారంలో మునిగి తేలాక ఆధ్యాత్మిక చింతనలో పడి భారతీయ తత్వశాస్త్రాన్ని కూలంకషంగా అవగాహన చేసుకుంది. చివరికి మానవసేవే మాధవ సేవ అని గ్రహించి తన సర్వస్వాన్నీ అనాథ స్త్రీ జనోద్ధరణకు అంకితం చేసింది. ఆ మధ్య మన ఇంటికి ఆశ్రమ నిర్మాణానికి చందా కోసమని వచ్చినామే ఆ షీలా.. మనమీనాడు యిలా ఉండగలగడానికి కారణం కూడా ఆవిడే.

లతకు నేనే పెళ్ళి చేశాను. నేను చేసిన మొదటి మంచి పని అదేనేమో!

కిన్నెర సంగతి చెప్పనక్కర్లేదు. ఆమె ఈనాడు పెద్ద సినీ నర్తకి.

ఇంకా నాతో పరిచయం వున్న ఎందరెందరి జీవితాలో ఎన్నెన్నో మలుపులు తిరిగాయి. మీ అమ్మ పోయిన తర్వాత స్త్రీ పట్ల నాకు విపరీతమైన గౌరవ భావం పెరిగింది. ప్రతి స్త్రీ లోనూ అమ్మనే చూడగలుగుతున్నాను కానీ ఆడతనాన్ని చూడలేకపోతున్నాను.

అదీ నా జీవితం.

నీ జీవితం కూడా నా జీవితంలా వరద కాకూడదు బాబూ! నిర్మల నదీ ప్రవాహంలా పవిత్రంగా సాగాలి. నీ ప్రవర్తన కారణంగా మరొకరి జీవితం ఒడుదుడుకులకు గురి కాకూడదు. మోడు వారి పోకూడదు.

ఇదంతా చెప్పి నీకు నీతులు బోధించే అర్హత నాకు లేదని తెలుసు.

కానీ—అనుభవం వుంది.

తండ్రిగా చెప్పాల్సిన బాధ్యతావుంది. ఆపైన నీ ఇష్టం. నా అనుభవాన్ని గుణ పాఠంగా తీసుకుంటావో, 'నేను నీ కొడుకుని, నాలో ప్రవహించేది నీ రక్తమే' అని స్వైర విహారివవుతావో నువ్వే నిర్ణయించుకో. నా జీవితం నీకు గుణ పాఠం కాకపోయినా, మీ అమ్మత్యాగం,



ఆత్మార్పణ నీకు తప్పకుండా గుణపాఠా లవుతాయని నా సమ్మకం" అని ఆగాడు తండ్రి! ఆలోచనలో పడ్డాడు కొడుకు.

తండ్రి తిరుగుబోతూ, తాగుబోతూ అయినా తన కొడుకు నీతివంతుడు కావాలని కోరుకోవడం, తల్లి పచ్చి వ్యభిచారి అయినా తన కూతురు మంచి యిల్లాలు కావాలని కోరుకోవడం సహజం.

'కాని మనిషిని మలచేవి పరిస్థితులూ, పరిసరాలూ' అనుకున్నాడు మురళి. ★





* ఫొటోలోని గొరిల్లా పిల్ల పేరు సాల్. కాకి పిల్ల కాకికి ముద్దంటారు గానీ మరి సాల్ తల్లికి తన పిల్ల ముద్దు రావట్లేదేమో దాన్ని నిర్లక్ష్యం చేస్తోంది. తల్లీ, తండ్రీ వుండికూడా అనాథ అయిపోడంతో బ్రిష్టల్ జూ సంరక్షకుడు రోన్, అతని భార్య బార్బరా దాని పోషణ బాధ్యతని స్వీకరించారు. ప్రతి నాలుగు గంటలకో సారి ఆహారమిచ్చి జాగ్రత్తగా పోషిస్తే దాని బరువు మూడున్నర పౌన్లు పెరిగిందిట. ప్రస్తుతం దాని బరువు పదిహేను పౌన్లు. కానీ సాల్ తల్లి మాత్రం తన బిడ్డని ఇప్పటికీ నిర్లక్ష్యంగా చూస్తోందిట.



* సినిమాలోని మాంత్రికుని గుహ కాదిది. కాలిఫోర్నియాకు చెందిన శాన్ జోస్‌లోని రాబర్ట్ క్రవిక అనే ఓ దంతవైద్యుని వెయిటింగ్ రూమ్ ఇది. చికిత్స కోసం వచ్చే పిల్లలు, పెద్దలు ఏడ్చి పనికి అంతరాయం కలిగించకుండా వుండడానికి గాను దీనిని ఇలా వారికోసం తీర్చి దిద్దడా వైద్య శేఖరుడు.



* హేంగింగ్ గార్డెన్స్ అనగానే మనకి బొంబాయి గుర్తొస్తుంది. (బాబిలోనియాలో ఉన్నాయి) తాజ్‌మహల్ ఆగ్రాలో వుంది. వీలయితే ప్రేమిక జంటలు ఆ గార్డెన్‌లో లాంగ్ షాట్‌లో విహరించి ఈ మహల్ దగ్గర క్లోజప్‌లో కౌగిలించుకోవచ్చు. కాని అది చాలా పెద్ద బెడద. కాదు, రెండూ ఒకే స్పాట్‌లో, ఒకే షాట్‌లో నెరవేరాలంటే—

ప్రకృతి సౌందర్యానికి పేరెన్నికగన్న సింగపూర్‌లో ఎటు చూసినా దీవులు కన్పిస్తాయి. ఈ దీవులు నలభై వరకూ ఉన్నాయి. చిత్రంలో కన్పిస్తున్నది అక్కడి వ్యాపార కేంద్రాల్లో ఒకటి. ఇక్కడి వ్యాపారం చాలా వరకూ పడవల్లో జరుగుతుందంటే తమాషాగా లేదూ !



* ఏనుగు అంబారీ, గుర్రపు స్వారీ మనం చూసుంటాం. కాని తిమింగలాల మీద, మొసళ్ళ మీద స్వారీ అన్నది మనకి అందని ఊహ. ఊహ కందనివి కొన్ని వాస్తవంగా కన్పించి విచిత్ర మన్పిస్తాయి. విచిత్ర విశ్వంలో ఇటువంటివి ఎన్నెన్నో జరుగుతుంటాయి. అయితే ఫోటోలో కన్పిస్తున్నది—

సాధారణమైన చేప కాదు, పదకొండు సంవత్సరాల వయసుగల ప్రాణాంతకమైన తిమింగలం. పేరు లియో. దీని బరువు ఆరువందల కిలోలు. పొడవు నాలుగు మీటర్లు. జపాన్‌లోని కమేగవా సీ వరల్డ్ వద్ద దీని శిక్షకుడు స్వారీ చేస్తున్నాడు.




* కారుండడం ఐశ్వర్య చిహ్నమయితే పట్టు తివాచీ మీద దాన్ని పార్కు చేయగలగడం అంతస్థును మరో మెట్టు పెంచుకొన్నట్టు. శాన్‌ఫ్రాన్సిస్కోలోని ఓ కారు సర్వీసు కంపెనీ ఈ అవకాశాన్ని కల్పించింది. పైగా ఈ తివాచీ చేయి తిరిగిన చిత్రకారుని కుంచె నుండి ఉదయించిన కళాఖండం కూడా !



* చాలా మందికి చాలా చాలా అలవాట్లూ, హోదాలూ వుంటాయి. కొందరు పిల్లుల్ని పెంచుతారు. మరికొందరు కుక్కల్ని పెంచుతారు. ఇంకొకరు ఇంకేవో పెంచుతారు. అయితే వాళ్ళందరికీ జంతువుల మీద అభిమాన ముందనుకోవడం పొరపాటు. హోదాలకు తగ్గట్టుగా ఒకరు దేశవాలీ కుక్కను పెంచితే మరొకరు ఇంపోర్టెడ్ డాగ్‌ను పెంచుతారు. పసిపిల్లల్ని చేరదీయకపోయినా కుక్కల్ని, పిల్లుల్ని చేరదీయటం ఈనాడొక ఫేషన్ !

రేసు కారు, సింహం పిల్ల, రేసుగుర్రం లాంటి అమ్మాయీ మూడింటికీ మంచి పొంతన వుంది. దక్షిణాఫ్రికా కేసరి అని పిలవబడుతూన్న ఈమె పేరు డిజైర్ విల్సన్. ఒక రకం మహిళా రేసు డ్రైవర్లలో ప్రపంచం మొత్తమ్మీద అగ్రగామి ఈమె. ఆవిడ పెంచుకొంటూన్న బుల్లి సింహం పిల్ల ఇది.

# కందపుష్టి

వామనరావుకు ప్రమోషన్ మీద ఢిల్లీకి బదిలీ అయింది. తను ముందు వెళ్ళి డ్యూటీలో జాయిన్ అయి, ఇల్లు వగైరాలు చూసుకొని ఆ తరువాత సంసారాన్ని అక్కడికి మార్చుదామనుకున్నాడు. అతనిది పేరుకు తగిన రూపమే! సన్నగా, పొట్టిగా, నీరసంగా ఉంటాడు. అలా ఉండే వామనరావు రైల్లో ఢిల్లీ బయలుదేరాడు. అతి కష్టం మీద త్రీటైరులో బెర్త్ ఇప్పించిన తన స్నేహితుడికి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

చీకటి పడింది. తన బెర్త్‌ను దింపుకొని పడుకోవాలనుకున్నాడు వామనరావు. ఎంత తంటాలుపడినా బెర్తును క్రిందకు దించి కొక్కెం తగిలించలేకపోతున్నాడు. తన అసమర్థతను చూసి ఎదుటివాళ్ళు నవ్వుతారేమోనన్న అనుమానంతో సతమతమౌతున్నాడు.

అతను పడుతున్న అవస్థను చూసి ఎదురుగా ఉన్న సర్దార్జీ వచ్చి సాయం పట్టాడు.

సహాయం చేసిన సర్దార్జీ ఊరికే పోకుండా – "పచ్చళ్ళు మేస్తే ఏం లాభమయ్యా, రొట్టెలు తినాలిగాని" అంటూ హాస్యమాడి మరీపోయాడు.

వామనరావుకు ఒళ్ళు మండింది. కానీ తను అసహాయుడు.

తెల్లారింది–

అందరూ టిఫెన్లు ముగించుకొన్నారు. బయట వాన జోరుగా పడుతోంది. అందరూ కిటికీలకున్న అద్దాలను దించుకొని వాటిల్లోంచి, బయటకు చూస్తున్నారు. వామనరావు ఎంత తంటాలు పడ్డా కిటికీ అద్దం దించలేక పోతున్నాడు. మళ్ళీ అదే సర్దార్జీ సహాయపడ్డాడు.

"నే చెప్పలా! ఆవకాయ మానేసి రొట్టెలు తినండయ్యా! బాగుపడతారు" అంటూ మళ్ళీ ఎగతాళి చేశాడు.

వామనరావుకు రోషం వచ్చింది. ఢిల్లీ చేరేలోపల వీడికి ఎలాగైనా బుద్ధి చెప్పాలనుకున్నాడు.

మర్నాడు ఉదయం వామనరావు



అలారం చైను పట్టుకొని లాలనగా చూస్తున్నాడు. సర్దార్జీ కలుగజేసుకుని బలం కొద్దీ గొలుసును లాగాడు. అది ఊడి చేతిలోకి వచ్చింది. కాస్సేపటికల్లా రైలు ఆగిపోయింది.

గార్డువచ్చి అనవసరంగా లాగిన సర్దార్జీకి ఫైనువేసి తిన్నగా వెళ్ళిపోయాడు.

వామనరావుకు అవకాశం దొరికింది.

"నిజమేనండీ! రొట్టెలు తింటే బుర్ర బాగా పనిచేస్తుందనుకుంటాను" అన్నాడు

—రావూరి రవీంద్రనాథ్

# కతలు

## పసికోరిక

ఆరోజే జాయినయింది టీచర్ వనజాక్షి.

పాఠం మొదలెట్టే ముందు లేచి-

"ఇవాళ మీకో విషయం చెప్పాలనుకుంటున్నాను. ప్రతీ మనిషి తన జీవితంలో ఏదో సాధిద్దామని ఒక లక్ష్యం ఏర్పరచుకుంటాడు. తన లక్ష్యాన్ని చేరుకోడానికి అన్ని వేళలా కృషి చేస్తాడు.



కాబట్టి ప్రతి మనిషికీ కొన్ని ఆశయాలు, కోరికలు వుంటాయనడంలో సందేహం లేదు.

అయితే ఇప్పుడు మీలో ఎవరెవరు ఏం చేద్దామనుకుంటున్నారో నాకు చెప్పండి. ఇతరులకి తెలియడం మీ కిష్టం లేకపోతే ఒక తెల్లకాయితం మీద బొమ్మగీసి దాని ద్వారా మీ కోరికని వ్యక్త పరచండి"

ఇహ పిల్లలందరూ చకచక పుస్తకాలు తెరిచి బొమ్మలు గీయటంలో మునిగిపోయారు.

పావుగంట గడిచింది.

దాదాపు అందరూ బొమ్మలేసారు. టీచరు ముందు ఒక కాగితాల గుట్ట తయారైంది. టీచరు ఒక్కో కాయితాన్ని చూసి, పక్కన పడేస్తోంది. డాక్టర్లు, లాయర్లు, నర్సులు, స్టెనోలు, టీచర్లు ఇలా ఎన్నో, ఎన్నెన్నో బొమ్మలు వాళ్ళ ఆశయాల కనుగుణంగా. చివర్న ఓ కాయితం మిగిలిపోయింది.

ఆ కాయితంలో ఏ బొమ్మా గీసిలేదు. ఉత్తి తెల్ల కాగితం. టీచర్ ఆ కాయితాన్ని పైకెత్తి పట్టుకొని-

"ఈ కాయితం ఎవరిది?" అంది.

"నాది టీచర్" సరళ లేచి నిలబడింది.

"నీకేం కోరికలు లేవా? బొమ్మ వెయ్యలేదేం ?"

"మరే...మరే...నాకు హోంవర్కు చెప్పని స్కూల్లో జాయినవ్వాలనుంది టీచర్. కాని... కాని... నాకు ఆ బొమ్మ ఎలా గీయాలో తెలీక..." నసిగింది పన్నెండేళ్ళ సరళ

—భాగవతుల

## ఎత్తుకుపోయారు

"హెడ్క్లర్కు రామనాధం యింట్లో దొంగలు పడ్డార్ట" ఉదయం పదకొండింటికే ఆఫీసంతా గుప్పుమంది. ఆఫీస్ స్టాఫ్ మొత్తం ఓ చోట గుమిగూడి ఇదే విషయాన్ని గురించి చర్చిస్తునారు. ఇంకా మానేజర్ గారు రాలేదు.

"మహా పిసినారి. తగిన శాస్తయింది" తెగ సంబరపడి పోతునాడు యు. డి. సి.

వైకుంఠరావు.

"వెధవ దొంగలు అతని తమ్ముడు చికాగోనుంచి పంపిన టేప్ రికార్డర్ ని ఎత్తుకుపోతే బాగుణ్ణు" ఒక లక్షా తొంభై ఆరువేల మూడు వందల ముప్పై ఒక్కసార్లు రామనాథం నోటివెంట "మా తమ్ముడు నాకు చికాగోనుండి టేప్‌రికార్డర్ పంపాడోయ్" నీకు తెలుసా! అన్న పదాన్ని వినీ వినీ విసిగిపోయిన ఎల్డీసీ ముకుందరావు కసిగా అనుకున్నాడు.

"అతని భార్యపేరుమీద లాటరీలో వచ్చిన స్టీలు బీరువాను గనక ఎత్తుకుపోతే



మీకు పార్టీ యిస్తానోయ్." అసూయతో మండిపడుతూ టైపిస్టు సుమతి అందరికీ వాగ్దానం చేసింది.

"ఇవాళ గురుడి ముఖం చూడాలి,ఎలా వుంటుందో" కాపీయిస్టు కామేశం ముసి ముసిగా నవ్వేడు.

"పూర్తిగా ముడుచుకుపోయి ఉంటుంది" రికార్డసిస్టెంట్ జోకుతో అందరూ నవ్వేరు.

మరి కొంతసేపు గుసగుసలాడారు.

ఇంతలో గబగబా రానే వచ్చాడు రామనాథం. ఆఫీసు స్టాఫంతా అతడ్ని చూసి ఆశ్చర్యపోయారు. ఎన్నడూ లేనంతగా మెరిసిపోతున్నాడు. ట్రిమ్‌గా తయారయాడు. మడత నలగని బట్టలేసుకున్నాడు. ముఖ్యంగా అతని మొహం దేదీప్యమానంగా వెలిగిపోతోంది.

తామూహించిన దానికి భిన్నంగా జరిగేసరికి ఆఫీస్ స్టాఫంతా తెల్లబోయింది.

మరికొంతసేపటికి సూపర్నెంటుగారు రామనాథం దగ్గరగా వెళ్ళి- "సార్! మీ యింట్లో దొంగలు పడ్డారని తెలిసింది. ని...ని...జ...మే...నా!" నసిగేడు.

"నిజమేనయ్యా! నేనే చెప్దామనుకుంటున్నాను. ముందందరికీ టీ తెప్పించు. బిల్లు నేనే యిస్తాలే"

అతని వాలకాన్ని చూస్తుంటే అందరికీ పిచ్చెక్కసాగింది.

"ఎలా పడ్డారు సార్" అడిగేడు అటెండర్.

"మా యింటి వెనుక పెద్ద సొరంగం తవ్వి లోపలి కొచ్చారోయ్"

"ఏవీ ఎత్తుకుపోలేదా సార్" కొత్తగా చేరిన స్టెనో అడిగాడు.

"ఎత్తుకుపోయారయ్యా! లేకుంటే నేను మీ కందరికీ టీ ఎందుకు తెప్పించేవాడ్ని."

"ఏవెత్తుకుపోయార్సార్? టేప్ రికార్డరా" అడిగేడు ఎల్డీసీ.

"ఊహూ"

"ఉక్కు బీరువానా" అడిగింది టైపిస్టు

"ఊహూ"

"మరి దేన్నిసార్?" అందరి ముఖాల్లో ఆత్రుత.

నవ్వుతున్నాడు రామనాథం.

"అయ్యో! చెప్పరేం సార్! కొంప దీసి





వాళ్లు యింకెక్కడయినా ఎత్తుకొచ్చినవి తీసుకొచ్చి మీ యింట్లో విడిచి వెళ్లారా ఏమిటి"

"అలాంటి దేం కాదు. మా యింట్లో నుండే ఎత్తుకెళ్లా'రు."

"దేన్ని సార్''

''అదే యిన్నాళ్ళు రాక్షసి అని చెప్పే వాడ్నే...దాన్ని...''ఆగాడు రామనాథం.

''అంటే మీ... మీ..." నసిగేడు సూపర్నెంటు.

"దొంగలెత్తుకు పోయింది మా రేడియోని"

రామనాథం ముఖం చాటంతయింది.

''అం? !!!'' ఆఫీస్ స్టాఫంతా నోరు వెళ్ళబెట్టింది.

అదే స మ య ం లో టీ పట్టుకొని హోటల్ కుర్రాడు ప్రవేశించాడు.

— సి. హెచ్. సనత్ కుమార్

# రాంగ్ టైమ్

'నారాయణ! నారాయణ?' అన్న తెలుగు సినీమాల్లోని పౌరాణిక నారదుడి డైలాగ్ వినబడి లక్ష్మీదేవి చెంగుచాట్నుంచి సర్దుకున్నాడు విష్ణుమూర్తి.

అనుమానించినట్టుగానే నారదుడు ప్రత్యక్షమయేడు. 'రా నారదా' అన్నాడు విష్ణుమూర్తి సమయభంగం కల్గించిన చిరాకుని లోలోపలే అణుచుకుంటూ.

'కలహభోజనులు, ఊ ర క రా రు. విషయమేవిటో వివరించు నారదా' అంది లక్ష్మీదేవి గూడా చిరాకుమొహాన చిర్నవ్వు అతికించుకుంటూ.

'నాకు తెల్సుమాతా! ప్రజలు నన్ని విధంగా అకారణంగా ఆడిపోస్కుంటారు. కనకనే ఇప్పుడు విశేషమేమీ లేకుండా ఉత్తినే వొచ్చాను' అన్నాడు నారదుడు.

'ఐతే ప్రోబ్లెమ్స్ ఏవీ లేవన్నమాట... సరే! తీరిగ్గా కూర్చొని విశేషాలు చెప్పు' అన్నాడు విష్ణుమూర్తి.

'విశేషాలేముంటయ్ స్వామీ! యుగ ధర్మం తమకు తెలిందే గనకనా—భూ లోకంలో ఘోరకలి ప్రబలిపోతోంది. ఎవడికీ పక్కవాడిమీద లక్ష్యం లేదు.ఎవడి స్వార్థం వాడుచూస్కోడంకోసం హత్యలు, మానభంగాలు, దోపిడీలు, సమ్మెలు, లాకౌట్లు, ఒకటేమిటి — అల్లకల్లోలంగా



ఉంది—" అంటూ ఉస్సురని నిట్టూర్చేడు నారదుడు.

'నువ్వెప్పుడూ ఇంతే! ఆక్రోశాల్నీ, ఆక్రందనల్నీ మోస్కురావడం తప్పించి మా సృష్టిలోనే ఉన్న కొద్ది మంచినైనా చెప్పవ్ కదా—'

'మంచి అన్నది ఉంటేకదా దేవా చెప్ప డానికి—'

'అంటే! అసలు మా సృష్టిలోనే ఏదో లోపం ఉందన్నమాట–'

'ఆ ముక్క నేనెలా అనగల్ను దేవా-'

'పోనీ - భూమ్మీద ఎక్కడా పిసరంత శాంతి, మంచి లేదంటావ్...'

'ఆ ముక్క మాత్రం నిజం'

'సరే భూలోకానికి పద. ఇదే పందెం, నీ మాట రుజువైతే ఈ సృష్టినంతా చెరిపేసి కొత్త బ్రహ్మని సృష్టించి కొత్త సృష్టి చేయిస్తాను' అంటూ లేచాడు విష్ణుమూర్తి.

'పదండి తమ చిత్తం' అంటూ అనుసరించాడు నారదుడు. ఏదో అనబోయిన లక్ష్మీదేవి అవాక్కయి పోయింది ఇద్దరూ అదృశ్యమవడం చూచి.

* * *

భూమార్గానికి వస్తూనే వేదకాలం నుంచి ప్రాచీనమైన భారతదేశం అగుపడేసరికి ఆగిపోయేడు విష్ణుమూర్తి.

ఆశ్చర్యం!!!

అక్కడి పరిస్థితి నారదుడు చెప్పినంత భీభత్సంగా లేదు. పైగా ఎంతో ఆహ్లాదకరంగా అగుపించింది. దాంతో నారదుడిమీద కోపం వొచ్చింది విష్ణుమూర్తికి.

'ఒక్కసారి అటుచూడు నారదా!' అన్నాడు సాధ్యమైనంత సౌమ్యంగా.

'మీరే చూస్కోండి' అన్నాడు నారదుడు నిర్లక్ష్యంగా తంబురా శృతి చేసుకుంటూ.

'చూడమంటూంటే' గర్జించేడు విష్ణుమూర్తి. అయిష్టంగా అలవోకగా అటు కేసి చూసిన నారదుడు గతుక్కుమన్నాడు.

'ఏమంటావ్' అన్నాడు విష్ణుమూర్తి.

ఏమంటాడు? నారదుడు బిక్కచచ్చిపోయేడు ఎదురుగా కనబడ్తూన్న దృశ్యాలు చూసి.

ఎక్కడ చూసినా మంత్రివర్యుల పాదయాత్రలు, మురికివాడల్లో సహపంక్తి కన్నీటి తుడుపులు, బడుగువర్గాల భుజం తట్టుళ్ళు, అడిగేవారికి జీతాల పెంపు, అడగనివారికీ, అనవసరమైనవారికీ కూడా బోనస్‌లు, ఆకాశవాణి వార్తల్లో తగ్గింపు ధరలు, ఏ పోలీసైనా ఏవర్నైనా మానభంగం చేస్తే వెంటనే సస్పెన్షన్, ఎవరూ రోడ్డుమీదకొచ్చి కేకవేయకుండా బొక్కలోకి తోయ వీలుండే ఆర్డినెన్స్‌లు తద్వారా శాంతి భద్ర'తల' పరిరక్షణ...పేదవారికి పేపర్లమీద ఇళ్లు, చేతి కాగితాల్లో పట్టాలు, నిరుద్యోగులకి ప్రణాళికల్లో ఉద్యోగాలు, ఉపాధి కల్పనలు..

బుర్ర గిర్రున తిరిగి పోయింది నారదుడికి.

'ఇంకెప్పుడూ రాంగ్ రిపోర్టివ్వకు' అన్నాడు విష్ణుమూర్తి హెచ్చరికగా.

అప్పుడు వెలిగింది నారదుడికి.

'రాంగ్ రిపోర్ట్ కాదు. రాంగ్ టైమింగ్, మిమ్మల్నిప్పుడు తీస్కురావల్సింది కాదు మహాప్రభో, ఇది ఎలక్షన్ల సీజను ఇలాగే ఉంటుంది." అనబోయేడు నెత్తి కొట్టుకుంటూ.

కానీ విష్ణుమూర్తి అక్కడ లేడు. ఎప్పుడో అదృశ్యమయేడు.

-పిశుపాటిఉమామహేశ్వరమ్

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HD/402